శ్రీసద్గురవేనమః.



వేదాంతమును

# అచలగ్రంథమును

వసిష్ఠశ్రీరామసంవాదమును నగు

శ్రీరామహృదయంబను

## షట్చక్రవర్తులయింద్రజాలపుకథలు.

ఇది

పోకల - శేషాచలమునాయనివారిచే

రచియింపంబడి

యాతనిజ్యేష్ఠపుత్రుండగు

పోకల - వేంకటనరసింహారావునాయనిచేఁ

ప్రకటింపంబడియె.

ఆఱవ కూర్పు 1000—కాపీలు.




చెన్నపురి :

"హిందూరత్నాకర" ముద్రాశాల

ముద్రితంబయ్యె.



Price 8 Annas.] 1927. [వెల 8 అణాలు.

# విషయసూచిక.

విషయసంఖ్య. | పుటసంఖ్య.



---

## వేదాంతగ్రంథములు.

| | రూ. | అ. | | రూ. | అ. |
|---|---|---|---|---|---|
| శ్రీకృష్ణబోధామృతము | 0 | 12 | శ్రీకృష్ణరుక్మిణీ సంవాదమను సుజ్ఞానశాస్త్రము | 0 | 8 |
| అచలగ్రంథము | 0 | 12 | ఉషాపరిణయము | 0 | 6 |
| ఇంద్రజాలపుకథలు | 0 | 8 | రత్నావతిచరిత్రము | 0 | 4 |
| పరమపదమార్గము | 0 | 8 | ఆంధ్రపంచీకరణము | 0 | 2 |
| వసిష్ఠజనకసంవాదమను అతీతమార్గము | 0 | 8 | గురుపూజావిధానము | 0 | 2 |
| పైలసద్గురు సంకీర్తనలు | 0 | 8 | అద్వైతరహస్యము | 0 | 2 |

**మావిలాసము :—**

(1) పిడుగు - వేంకటకృష్ణారావు పంతులు,
2/40, పెద్ద నాయని వీధి, మద్రాసు.

(2) పోకల - వేంకటనరసింహారావు నాయుఁడు,
ముత్యాలపేట హైస్కూలు తెలుఁగు పండి—



“అచలగురుఁడు.

పోకల - శేషాచల స్వాములు.”



శ్రీ సద్గురవే నమః.

శ్రీ రామహృదయంబను

# షడ్చక్ర వర్తుల యింద్రజాలపు కథలు.



శ్రీమద్వేదాంత ప్రవర్తకుండును, మహాయోగపురుషుండును, ప్రభావసంపన్నుండునునైన శ్రీ చెంచు రాజగురువకుశిష్యుండును, నచల గురుండైన యమినిగడ్డ - కోటప్పదేవరకు భక్తుండును, నాత్రేయగోత్రుండును, నాదివెలమకులోద్భవుండునునగు పోకల రామగోపాలునాయని వారికిం దృతీయ పుత్రుండును నైన పోకల - శేషాచలాహ్వయుఁడు ప్రకృతిద్వయదోషరహితుఁడైన సద్గురుస్వామిని మనంబున సేవించి, ప్రాచీన దేశికస్వాములైన సాందీపమహామునిం బ్రస్తుతించి, శివరామ దీక్షితులనుగీర్తించి, భాగవతుల కృష్ణదాసునింబేర్కొని, భక్తివైరాగ్యపరులగుముముక్షులకు ప్రథమరూపకమైన యెలుకప్రభావమహాత్మ్యములును, దద్భ్రాంతినిరసనంబును, నచలపరిపూర్ణదర్శనంబును, జక్కఁగబోధపఱచుటకై, యాంధ్రంబునఁగథలరూపంబున వసిష్ఠశ్రీరామ సంవాదంబను శ్రీరామహృదయమనెడు షడ్చక్రవర్తుల యింద్రజాలపుఁ గథలనుజెప్పంబూనుకొనిన, యీగ్రంథమునకుఁగథాక్రమంబెట్టిదనిన :—

శ్రీమదఖండ సచ్చిదానందాద్వయ బ్రహ్మపరిపూర్ణభావుండును, భక్తజనరక్షకుండును, నశేషభూతాంతరాత్ముండును, మాయామానుష విగ్రహుండును, దశరథమహారాజునకు సుపుత్రుండునునైన శ్రీరామచంద్రుండు పాలించిన కోసలదేశమునకుఁ బ్రధానపట్టణమైన యయోధ్యాపురీవిభవమును నానేర్చుకొలఁదిఁ గొంచెముగ వివరించెదను.

చంద్రకాంతమణులు చెక్కఁబడి స్ఫటిక శిలామయములై మిగులధావళ్యములై సుందరములై తేజరిల్లెడు మహోన్నతములైన మేడలును, వజ్రముల ద్వారబంధములును, వైడూర్యకవాటములును, నీలంపుటరుగులును, బవడంపుఁగంబములునుగలిగి, యింటింటను శ్రీరామచంద్రుని జయప్రదమగు చరిత్రరూపపటములను జిత్రములుగా గోడలయందు లిఖింపఁబడి, మృగనాభి, యత్తరు, పన్నీరు, కుంకుమ

పుప్పి, పచ్చకర్పూరము మొదలగు పరిమళద్రవ్యములను మేళనముచేసి, గుప్పుగుప్పునఁదావి సదా గుప్పుచుటులఁజల్లఁబడి, యాణిముత్యముల ముగ్గులచేతను, బచ్చల తోరణములచేతను విలసిల్లెడు విశాలములైన వీథులును, వివిధ ఫలకుసుమభరితంబులై మిగుల వినోదకరములైన శృంగారవనములును, సువర్ణరత్నఖచితంబులైన కేళికాగృహంబులు ను, బిసప్రసూనాది కుసుమవిసర భాసురంబులై స్ఫటికశిలా సోపాన ములుగల సరోవరంబులును, సెలయేటి వెల్లువలందడిసి, చల్లఁగావీచు చుండెడు మలయమారుతంబును, బర్వతసమంబులైన రథంబులును, నైరావతసమంబులైన మదపుటేనుంగులును, నాదిత్యుని రథాశ్వముల కంటెను వేగవంతంబులైన తురగంబులును, యమకింకరుల వంటి వీర భట సమూహంబులును గలిగి, దేవగణముచేతశ్లాఘింపఁబడి, శత్రువుల కసాధ్యంబై భూకాంతామణికిఁ దిలకమువలె నొప్పుచుండు నాయయో ధ్యాపురంబును, శ్రీరామచంద్రుండు సుమంతా ద్యష్టమంత్రులును, సామంతరాజులును, దమ్ములును, విద్వజ్జనంబులును నార్యులునుదన్నుఁ బరివేష్టించియుండఁగా నిండు కొలువుకూటంబున నున్నతమైన రత్న సింహాసనంబు మీఁదంగూర్చుండి, రాజ్యమును బాలించుచుఁ బురిజను లకు క్షేమమునుగలిగించుచు, ధర్మదేవతను నాలుగుపాదములయందు ను సమముగానడిపించుచు దేవగణ సేవితుండై యుండెను.

ఇట్లుండఁగాఁ గొన్నిదినంబుల కారామచంద్రుఁడు, లోకాప వాదమును భరింపఁజాలక మహాపతివ్రతా శిరోమణియును, మహాదేవి యునునైన సీతాదేవిని నిండుగర్భమని యోచింపక నారాక్షసాంత కుఁడు నిర్దయుండై యడవికిం గొనిపోయి విడిచిరమ్మని తనతమ్మునకు నాజ్ఞాపించి, యనంతరము భార్యావియోగమును భరింపంజాలక శోకిం చుచు, నేమియుఁదోఁచక రాజ్యమును విచారించక దుఃఖసముద్రమ్ము లోమునిఁగి తపించుచు, నంతఃపురంబున నున్నాఁడని వసిష్ఠమహర్షివిని మిగుల వగనొంది, యాయయోధ్యాపురికి వచ్చుచుండెను.

శ్రీరామచంద్రుఁడు వసిష్ఠమహర్షి వచ్చుటను దన భటులవలన నెఱింగి యామహాత్మునకు నెదురుగాఁబోయి యంతఃపురంబునకుఁ దో డ్కొనివచ్చి పాదములుకడిగి,తడియొత్తి, రత్నపీఠముమీఁదం గూర్చుండఁ

బెట్టి, యర్చనచందనాది పూజలును, ధూపదీపనైవేద్యములును యథోచితముగఁ గావించి తృప్తిపఱచి, త్రిలోకపూజ్యుండ వగు నోముని



శ్రీరామచంద్రుఁడు.



వసిష్ఠమహాఋషి.

సత్తమా! తమయాశ్రమమందుండు వృక్షలతాదులు సంతతముకుసుమఫల భరితంబులై యున్నవా? జలాశయములందు నీరిసుమంతైనను గొఱంతపడక నిండారుగా నుండునటుల నెలకు మూఁడువర్షములుతప్పక కురియుచున్నవా? దేవతలును ఋషులును సంతోషముతో నున్నవారలా? ధర్మదేవత నాలుగుపాదములతో వర్తించుచున్నదా? యనియడిగిన నామునీంద్రుఁడు మందస్మితవదనారవిందుఁడై, యాసీతాపతిం దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని యతనిదేహమును దనహస్తముతోఁ దడవుచుఁ, బుణ్యాత్మా! నాకును నాశ్రమమునకే కాదు త్రిలోకంబులకును క్షేమమే, మావంటి ఋషులునిర్భయముతో యోగసమాధులఁ గావించుచున్నారు. దేవత లుత్సాహముతో సంచరించుచున్నారు. అజ్ఞానవృత్తియైన ప్రతిమారాధన నీదేవభూమినుండి పరిహరించుట బట్టియును, గురుభక్తి మగుడఁ బ్రబలించుటనుబట్టియును, సదాయాత్మసంతుష్టి గలుగుట

చేతను, ధర్మదేవత సంతోషముగ నాలుగుపాదములతో వర్తించుచున్న దని చెప్పెను. అంత నా రాజేంద్రుఁడుతనపత్నిందలంచి నేత్రంబుల బాష్పంబు లొలుక, నోమునిశ్రేష్ఠుఁడా! నాకుభార్యా వియోగమును, భరింపంగూడని దుఃఖమును గలుగుటకుఁ గారణమే మనియడిగిన, నా మునీంద్రుఁడు తనమనంబున నీపుణ్యపురుషుని పెను దుఃఖమును, నచల బోధవలనం బోఁగొట్టుదమని యోచించి యతని దేహమునుదడవుచు, నో రాజోత్తమా! నీవు నీనిజ స్వరూపమును దెలియనిదోషము చేత నీవు లేనిదుఃఖమును బొందుచున్నావు. నీ వచలపరిపూర్ణ బ్రహ్మమవుగాని యీవిశ్వరూపమైన మాయాశరీరమవు కావు. పురుషుండవుగావు. అంత రాత్మవుకావు ప్రజ్ఞానచైతన్యమవుకావు ఇంద్రియములవుగావు, స్త్రీవికావు, నపుంసకుఁడవుకావు. నీకుసమానము లేదు. నీకువేదములు ప్రమాణ ములుకావు. నీవుజ్ఞానివికావు. అజ్ఞానివికావు. ప్రకృతిద్వయదోష రహితుండవు. నీకుభార్యలేదు. సోదరులులేరు. జననీజనకులులేరు. నీకుఁ బుట్టుగిట్టుటలులేవు. కేవలనిర్గుణుండవు. నిరంజనుండవు. నీకురెండవది లేదు. అశరీరివి. అచలుండవు. నిన్నునిర్దేశించిచెప్పుటకుయుగములుచాలవు, కల్పములుచాలవు. జ్ఞానులును యోగులును నీనిజస్వరూపమును గనఁ జాలక యానందస్వరూపమని లేనిదానినే చెప్పుదురు. వారునుమాయకు లోఁబడిన యొుకలోనివారే కాని విశేషజ్ఞులుకారు. పండితపామరులు నీవలన మాయయొుకపుట్టినదనియు, నీవేకారణమనియు, నీయొుక్క శబ్దములే శ్రుతులనియు, నధ్యారోపాపవాదమును జేయుచున్నారే కాని, నిరామయుండవైననీవలనమాయయొుక యేకాలమందును బుట్టనేలేదు, పుట్టినదనియుఁ దెలియదు. నిశ్శబ్దమైన యచల పరిపూర్ణ బ్రహ్మ మేకాలమందును శబ్దసహితుఁడుగా నుండలేదు. వేదము లహంకార సహితములు. అవికర్తలేకకర్మమునే చెప్పియున్నవికావున వేదములు నీకుం బ్రమాణములుకావు. నీనిజస్వరూపమేకల్పనారహితమైనపరమపదమని చెప్పిన, నారామచంద్రుఁడు విస్మితముఖుండై, మునీంద్రా! పంచమహా భూతములను బ్రపంచమును సృష్టించిన వారెవ్వ? రనియడిగిన నామునీంద్రుఁడు, రాజేంద్రా! పుట్టినదనిచెప్పుట యధ్యారోపాపవాదము. ఈవాదమెన్నఁటికిని జేయఁగూడదు. ఏకాలమందును బుట్టనేలేదు.

గొడ్రాలికిబిడ్డయుండునా? రజ్జువునందుఁజలనములేకయే సర్పభ్రాంతిపుట్టుచున్నది. అటువలెనే భ్రాంతిగలవారికి బ్రహ్మమునందుజగద్భ్రాంతికలుగుచుండునని చెప్పిన, నామానవేంద్రుఁడు "భ్రమమెవరికి? తోఁచినదెవరికి?" కనియడిగెను. ఆమునీంద్రుఁడు "భ్రమమేనాహంజగ" త్తనియున్నదిగనుక నెఱుకకే భ్రమ. ఎఱుకకే తోఁచుచుండును. తనభ్రమకుఁదానేయానందించుచుండును, వితర్కించిదుఃఖించుచుండును. కనుక నీభ్రమరూపకమైన యీప్రపంచ మెండమావులవంటిది. సమీపించిపోయిన నీళ్లులేనట్లు లీమాయయెఱుకే మటుమాయముగాఁబోవును. అచలబ్రహ్మమునకంటెను వేఱొండులేదు. మాయాశరీరములకు మూలములేదు. మూలములేక తనకుఁదానేవచ్చి తనకుఁదానేమూలములేనిదానిని వివాహముచేసుకొని, మూలము లేని బిడ్డలనుగని తనమాయకుఁ దానే వినోదమునుబొందుచు సుఖదుఃఖముల ననుభవించి తనకుఁదానేమటుమాయముగాఁ బోవుచుండును. స్వప్నమునందుగజవాహనారూఢుఁడై దివ్యభూషణములచేత నలంకృతుండై నవరత్నఖచితము లైన కిరీటమకరకుండలములు శోభిల్లఁగా నొకరాజేంద్రుఁడు వచ్చెను. అతనివెంటఁగోట్లకొలఁదిరథములును నేనుఁగులును గుఱ్ఱములును, గాల్బంటులునువచ్చెను. ఆరాజేంద్రుఁడు స్వప్నమందున్న వానినిరత్న పల్లకిలోఁగూర్చుండఁబెట్టుకొని తనపట్టణమునకు వెంటఁబెట్టుకొని పోయివివిధమర్యాదలు గావించెను. మహారమ్యమైనయాకొలువు కూటమును నందుండునవరత్నములను సువర్ణపురాశులను జూచి యద్భుతము నొందుచుండఁగా నాస్వప్నాద్యవస్థపోయి జాగ్రతావస్థకువచ్చినేత్రములనువిచ్చిచూడఁగా నవియన్నియుమాయమై యేమియుఁ గనుపించకుండుట సహజమని తెలియునుగదా! స్వప్నమునందువచ్చిన శరీరములకును నీశరీరములకును హెచ్చుతక్కువలులేవుగదా! వానిని నెవరురప్పించిరి? ఎవరుగొనిపోయిరి? తమంతటఁదాము మూలములేకయేవచ్చిమూలములేకయే మటుమాయముగాఁబోయెను. సత్యమునందసత్యమేకాలమందును బుట్టలేదు. పుట్టింపఁబడనులేదు. మనుష్యులకు మనుష్యులును, నేనుఁగులకునేనుఁగులును, గుఱ్ఱములకుగుఱ్ఱములును, జీమలకుఁ జీమలును బుట్టుచున్నవేగాని వేఱెపుట్టుట లేదుగదా! ఇటువంటి దృష్టాంతములు పెక్కులుండఁగా సత్యమునందు సత్యమేపుట్టునుగాని,

యసత్యమెటులఁబుట్టును! పుట్టనేపుట్టదు.పుట్టింపఁబడనులేదు. గొడ్రాలికి బిడ్డ యేకాలమందునుబుట్టలేదు. బిడ్డపుట్టినయెడలఁ దల్లిగొడ్రాలెట్లగు? కావున భ్రాంతివలననేసమస్తమును దోఁచుచుండును. భ్రాంతియున్న వారందఱును స్వప్నమునందున్న వారేకాని వేఱుకాదు. గురువాక్యము చేత మేలుకొనినపుణ్యపురుషులకు నీగుట్టంతయుబట్టబయలు.మఱలవారికి భ్రాంతిపుట్టనేరదనిచెప్పిన నారామచంద్రుఁడాశ్చర్యపడి, స్వామీ! నేనిది వఱకిట్టిబోధనువినలేదు, మాయయెఱుకలోనివేదములను, భక్తియోగ జ్ఞానములను, నాకుబోధించిరేగాని,మీవలె నెవ్వరునుజెప్పలేదు. ప్రపంచ మును శరీరములునుగనుపించుచున్నవేయని పలికెను. ఆమునీంద్రుఁడు, బిడ్డా! జాలకులుదమయొద్దలేని యావస్తువుల నెల్ల సంకల్పమాత్రంబున రప్పించి యెదుటివారికిఁజూపించి యానందమును బొందించునటుల లేనియెఱుకే యింద్రజాలముభంగి భ్రమికులను భ్రమింపఁజేయుచుండు ననిచెప్పెను. ఆరామచంద్రుఁడు, స్వామీ! మునినాధా! ఇంద్రజాలమని చెప్పితిరి. ఆవిద్యయెటువంటిది? అట్టివిద్యగల వారిప్పుడుందురా? యని యడిగిన, నామునీంద్రుఁడు, రాజేంద్రా! యింద్రజాల మహేంద్రజాలాది విద్యలుషట్చక్రవర్తులదినములలోనుండెను. పిదపభాస్కరుఁడనువానితోడ నావిద్యలునశించెను.ఇప్పుడింద్రజాలమహేంద్రజాలవిద్యలులేవు జాలవిద్య గలవారెందైననుందురనిచెప్పిన నతఁడావిద్యయెన్నివిధంబులై యుండెను? షట్చక్రవర్తుల దినములలో నామాయకులేమేమివిధములను గావించిరి? వానినాకు వేఱువేఱవినిపించుఁడనివేఁడిన, నామునీంద్రుండిట్లనియె.

రాజేంద్రా! జాలమనియును, నింద్రజాలమనియును, మహేంద్ర జాలమనియును, మూఁడు విధములుగా విభజింపఁబడియున్నవి. ఈ మూటికినింద్రజాలమనిపేరు. ఈవిద్యగలవారు విశేషముగా గురుసేవ చేసివారివలనఁగ్రమప్రకారముతమచిత్తమును లోఁబఱుచుకొని, చిదా కాశమువఱకును వ్యాపించి, యట్టిచిదాకాశమునకు మిత్రత్వముగలవి మయూరములగుటంజేసి, యానెమిళ్లయీఁకలను గుంచెగాఁగట్టుకొని యింద్రజాలకులుతమజాలమునుజూపించివినోదమునుబుట్టింతురు. కావున నట్టియింద్రజాలమే భ్రమరూపకమైనమాయ. అదియేయెఱుక. అదియే మహేంద్రుఁడు. అదియేశ్రీమన్నారాయణమూర్తి. అదియేసదాశివుఁడు.

అదియేచతుర్ముఖబ్రహ్మ. అదియే సృష్టికర్త. అదియేగణపతి. అదియే జీవేశ్వరులు. అదియేచైతన్యస్వరూపిణియను నమ్మవారు. అదియేముక్తికాంత. అదియే మహాశక్తి. అదియే యంతరాత్మ. అదియే ప్రజ్ఞానంబ్రహ్మ. అదియే చిద్బ్రహ్మము. అనియేచిదాకాశము. అదియేత్రిపుటి. అదియేజ్ఞానము. అదియేజ్ఞేయము. అదియేకర్త. అదియేభోక్త. అదియే యాత్మ. అదియే దేహము. అదియే సర్వేంద్రియములు. అదియేప్రపంచము. అదియే జగము. అదియేలోకము. అదియేనామరూపంబులు. అదియేబంధమోక్షంబులు. అదియేపుణ్యపాపంబులు. అదియే కల్పనాసహితమైన కైలాసము. అదియేకల్పనాసహితమైనవైకుంఠము. అదియే కల్పనా సహితమైన సత్యలోకము (బ్రహ్మపట్టణము). అదియేకల్పనాసహితమైన సాలోక్యము. అదియే కల్పనాసహితమైనసామీప్యము. అదియేకల్పనా సహితమైనసారూప్యము. అదియేకల్పనాసహితమైనసాయుజ్యము, అదియే కల్పనాసహితమైనసార్ష్టిత్వము. అదియేకల్పనాసహితమైనమోక్షము. ఇవియన్నియు మాయాసంబంధములైన పదవులు. భ్రమరూపకములు గానిస్థిరములుగావు. మాయయెటువంటిదస్థిరమో యంతటిస్థిరమైనవే యీపదవులు, జన్మశూన్యముకలుగనేరదు. పుర్భవరూపకములైనపదవులనిచెప్పిన, నారామచంద్రుఁడద్భుతమునొంది, మునీంద్రా! నాచిత్తమింద్రజాలవినోదములనేవినఁగోరుచున్నది. అవిమూడువిధములనిసెలవిచ్చితిరి, వానివినోదములను వేఱువేఱవినుపించుఁడని వేఁడిననామునీంద్రుండిట్లనియె.

రాజేంద్రా ! జాలమనఁగా జాగ్రతయందుఁగన్నులకెదుట, లేని చిత్రవిచిత్రములను, మున్నెన్నఁడుఁజూడని రూపములఁజూచి చిత్తానందమును, భయోత్పాతములును, నాశ్చర్యములును, సంతోషదుఃఖములును గలిగి, వెంటనే యవియన్నియునశించి, యేమియునుగనుపించకుండుట.

ఇంద్రజాలమనఁగా స్వప్నమున దేవలోకమును, నింద్రాదిదేవతల దర్శనమును, త్రిమూర్తులదర్శనమును, నానావిధములైన వింతలును, వివిధవిచిత్రములును, మిగులసుందరులైన దేవతాస్త్రీలతోడికూటమియు, నద్భుతమైన సుఖానందమును, నలవిగాని దుఃఖము గలుగుటయు మనోనిశ్చయమును, నవరత్నములను సువర్ణమును గాంచుటయు, నేత్రములను దెఱచినవెంటనే యవియన్నియు నశించియేమియుఁ దోఁచఁబడకుండును.

మహేంద్రజాలమనఁగా స్వప్నమునందు దేవలోకగమనమును, నింద్రాది దేవతలదర్శనమును, త్రిమూర్తులదర్శనమును, మహేంద్రుని దర్శనమును, దేవకన్నియలకూటమియును, మిగుల సుఖానందమును, నద్భుతమైన దేవవాద్యములవినుటయును, జిహ్వ్రాహ్మముయొక్క లీలా విలాసమగు చిత్రవిచిత్రములైన వినోదములనుజూచి చిత్తవిభ్రాంతి నొందుటయును, భ్రమచేత నేమియును దోఁచకుండుటయును, భరింపఁ గూఁడని భయోత్పాతములును, నలవిగానిసుఖానందమును, మితిలేని యనుభవమును, దుఃఖమునుగలిగి, నేత్రములను దెఱచినవెంటనే యవి యన్నియును మాయమై యేమియును గనుపించకుండుటయని చెప్పిన, నా రామచంద్రుఁడు, మునీంద్రా! హరిశ్చంద్రచక్రవర్తి దినములలో నింద్రజాలకులువచ్చి యేమేమివినోదములను గావించిరి? దేవర వారు దయతో నాకెఱిఁగించుఁడని వేఁడిన నాతపోధనుండిట్లనియె.

—*(హరిశ్చంద్రచక్రవర్తికథ.)*—

రాజేంద్రా! తొల్లిహరిశ్చంద్రచక్రవర్తి నవఖండమండలాధిపతియై భూమండలమంతయు నేకచ్ఛత్రమునఁబాలించుచు ధర్మమును నాల్గుపాదములయందును నడిపించుచుండఁగా, నొకనాఁడామండలాధిపతి సభకు జలజనాభుం డనునింద్రజాలకుఁడువచ్చి తనవిద్యావినోదములఁ జూపించుటకుయత్నించి తనహస్తమందలి నెమలియీఁకలకుంచెను ప్రభువునకుంద్రిప్పి చిత్తసంకల్ప మొందించెను. తాంబూలము సేయు చాకు మడుపును దక్షిణకరంబునంబుచ్చుకొనిన రాజేంద్రున కింద్రజాలకుని ప్రభావమువలన నిద్రమైకమునంభవించి నేత్రములను మూసినంజూచి, మంత్రులును, ప్రధానసామంతరాజులును, సభికులును, ప్రభువునకు సుషుప్తికలిగెను. సందడిచేయక నిశ్శబ్దముగానుండుఁడని, గీత, నృత్య గానములుచేయు వారికింజెప్పియుండఱు నిశ్శబ్దముగానుండిరి. అమండ లాధిపతి నేత్రములనుమూసినవెంటనే యతనికి గొప్పవెలుఁగునుమిగుల వినోదకరములైన వనములను దానెన్నఁడుఁజూడని ఫలవృక్షములనుబుష్ప లతలనుజూచి, యోహో! యీవింతవనములెక్కడివి? పోయిచూచెద మనిదిగ్గునలేచిపోవుచు నావృక్షలతలనుజూచి యద్భుతమునొందుచు, గుప్పుగుప్పనగుప్పుచుండెడు సుగంధతావినాఘ్రాణించుచు, మాధుర్య



ఫలములనుగోసిభక్షించుచుం, జిత్రములైన సరస్సులలోదిగిజలపానము సేయుచు, సెలయేళ్లప్రవాహములలోనీఁదుచు శుకపికశారికాదిపులుఁగుల మధురధ్వనులకు నానందించుచుం, జెట్లనీడలవిశ్రమించుచుఁబూపొదరిండ్ల

లోఁ దూఱుచుఁ, జిత్రములైన మంటపములనుజూచి విస్మయమందుచు నిదియేలోకమో యెవరివనమోయనిసంకట మొందుచు, మహదానంద ముతో నలుదిక్కులు చూచుచుంబోయిపోయి యొక ప్రదేశమున మిగుల ధావళ్యమై మనోహరమై వినోదకరమైన నడకగల గొప్పపక్షినిం జూచి నేత్రోత్సవమును బొంది, ఆహా! యిదిమిగులపింతయైనపులుఁగు గానున్నది. దీనిఱెక్కలు మిగుల సుందరములు. ఇట్టిపింతపక్షిని మన మెన్నఁడును జూడలేదు. ఇదియెందుండివచ్చెనో తెలియదు, మనభాష తెలిసియాట్లాడిన మిగులవేడుకగానుండునని, యోచించి యత్యం తోత్సాహముతో నాపక్షిసమీపమునకుంబోయి, యోపక్షీంద్రా! నీ వేలోకమందుండివచ్చితివి? ఇది యేలోకము? నీవేజాతిపక్షివి? నిన్నుంజూడఁ జూడ నాకువేడుకగానున్నది, నిన్ను విడిచిపోవుటకు నాకుఁగాళ్లాడలేదు. నేను హరిశ్చంద్రచక్రవర్తిని. నీవృత్తాంతమంతయుఁ జెప్పినీవునాపురికివచ్చితివేని నిన్నుముద్దుచేసి నీకుందగిన యాహారము నిప్పింతు ననిన నారాజ హంసయతనికిట్లనియె.

రాజేంద్రా! నేను చైతన్యస్వరూపిణియనుపక్షిని. నారాకపోకలే ప్రణవాక్షరద్వయము. అదేసోహము. ఆయక్షరద్వయ స్వరూపములే వేదములు. భక్తియోగజ్ఞానులు, నన్ను రాజహంసయనియుఁబరమ హంసయనియుఁజెప్పుదురు. నాసహాయమువలన ముముక్షులువారికోరిక లునెఱవేర్చుకొందురు. నేనుసత్యలోకమునుండి భూలోకమువఱకుసంచ రింతును. నేను లేనిలోకము పాడైపోవును, గాఁబట్టి నాకెందును నిల్కడ లేక, మడాధారములకుఁదంత్రిరూపకమైతిరుగుచుందును. నాకుదివారాత్రు లును, జాగరణస్వప్నసుషుప్త్యవస్థలునులేవు. హృదయాకాశమున క్షణకాలము నిలిచి దేవనాగరత్నములను భక్షించి, మానససరోవరము లోని సుధాపానముఁజేయుదు. నీవునాకేమియాహారముపెట్టెద? వని పలికెను. ఆమండలాధిపతి యద్భుతమునొంది యారాజహంసకు నమస్క రించి, యోహోహో! త్రిలోకపావనమైనపక్షీంద్రమా! నీవర్తమానముమిగుల నద్భుతముగానున్నది, సత్యలోకముఁబాలించువారెవ్వరు? అందుండు విశేషములెట్టివి? దయతో నెఱింగించుమనివేఁడిన నామరాళంబిట్లనియె.

రాజేంద్రా! సత్యలోకమునుజైతన్యస్వరూపిణియను నమ్మవారు పాలించుచున్నది. ఆలోకమును శ్వేతద్వీపమనియును జెప్పుదురు. అందు దివారాత్రులని తెలియంబడక కోటిసూర్యచంద్రు లేకకాలమునఁ బ్రకాశించునటులగొప్పవెలుఁగు ప్రకాశించుచుండును. ఆముక్తికాంతామణియైనసత్యవేణి దివ్యరత్నపీఠంబుపైన శ్వేతపద్మసింహాసనము మీఁదఁ గూర్చుండిముముక్షులకుదర్శనమిచ్చుచుండు. ఆదేవినివర్ణించిచెప్పుటకుఁ ద్రిమూర్తులకైననలవికాదు. ముముక్షులుతలంచినతలంపులట్లు పెక్కురూపములఁబొంది నిత్యానందసుఖముల నిచ్చుచుండు. మఱియునచట ముముక్షులకుఁ దొమ్మిదివిధముల దివ్యరత్న సోపానములుండును. ఆ సోపానములు వ్యత్యస్తపుఁబ్రభావతేజోకాంతులచేత విలసిల్లుచుండు. అందుమొదటిసోపానముమీఁద జ్ఞానులును, రెండవసోపానముమీఁద యోగులును, మూఁడవసోపానముమీఁదఁ బ్రణవధ్యానపరులైన భక్తులును, నాల్గవసోపానముమీఁదజితేంద్రియులును, నైదవసోపానముమీఁద నభ్యాసపరులును, నాఱవసోపానముమీఁద వైరాగ్యపరులును, నేడవ సోపానముమీఁద గురుశుశ్రూషాకైంకర్యపరులును, నెనిమిదవసోపానముమీఁదసూనృతవాక్కులును, దొమ్మిదవసోపానముమీఁదనేకపత్నీవ్రతస్థులును గూర్చుండి సంతత మాదేవిని సేవించుచుందురు. నేఁజెప్పిన యీతొమ్మిదివిధముల భక్తులలోనీవొకఁడవుగానుండినయెడల నిన్నుఁ గొనిపోదుననిపలికెను. ఆరాజేంద్రుఁడు కడుసంతసమున నాయంచం జూచి, రాజహంసమా! నేనుసూనృతవాక్యపరిపాలకుఁడను, నన్ను దయతోఁ గొనిపొమ్మనివేఁడిన నామరాళము మంచిదని యాతనిందన మూపుమీఁదఁగూర్చుండఁబెట్టుకొని యతిరయంబునం బోవుచుండెను. ఆరాజేంద్రుఁడు మిగులధైర్యముతో నాహంసనెక్కిపోవుచు, నామార్గమునఁగాంచనరత్నములతో భాసిల్లుచుండుపట్టణమును, దానికిమధ్యభాగముననాధారకమలమును, నాకమలమునకునాలుగు దళములయుండును, వ-శ-ష-స-అను నాలు గక్షరములు, కలిగి, మధ్యభాగమున నొప్పు ఓం-కారబీజాక్షరంబును, నందుఁగనకరత్నపీఠంబునం గూర్చుండిన యొకపురుషునింగాంచి యద్భుతమునొంది, రాజహంసమా! ఇది యే లోకము? ఈమహాత్ముండెవఁ? డనియడిగిననామరాళము, పుణ్యాత్మా! ఇది

భూలోకము. ఇతఁడు సర్వవిఘ్నములకుఁ గారకుండును నధిదేవతయునైన విఘ్నేశ్వరుఁడు. నీ వీమహాత్ముని ధ్యానించుమని చెప్పి యారాజహంస యటనుండి రెండువేల యోజనముల దూరముపోయెను.

అచ్చటనా రాజేంద్రుఁడు దివ్యవజ్రములతో మిగుల ధావళ్యమై ప్రకాశించు పట్టణమును, దానికి మధ్యభాగమున స్వాధిష్ఠానకమలమును, నాకమలమునకు నాఱుదళములయందును, బ-భ-మ-య-ర-ల-అనునా అక్షరములుకలిగి, మధ్యభాగమునమిగులఁ దేజోవంతమైవెలుఁగుచుండు న-కారబీజాక్షరంబును, నందు శ్వేతపద్మంబునంగూర్చుండిన యొకదివ్యపురుషునింగాంచి యాశ్చర్యమునొంది, రాజహంసమా! ఇది యేలోకము? ఈమహాత్ముండెవఁ? డనియడిగిన, నాయంచ, పుణ్యాత్మా! ఇది భువర్లోకము. ఇతఁడుసర్వప్రాణులను సృజియించుసృష్టికర్తయు నధిదేవతయునైనబ్రహ్మదేవుండు, నీ వీమహాత్మునిధ్యానించుమని చెప్పి యా రాజహంసయచటనుండియెనిమిదివేలయోజనముల దూరముపోయెను.

ఆమండలాధిపతియచటఁగాంచనరత్నములచేతఁ దళతళమెఱయుచు మిగుల వినోదకరమైన పురముసుదానికి మధ్యభాగమున-మణిపూరక కమలమును. నాకమలముయొక్క పదిదళములందును, డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-అను పదియక్షరములుగలిగి, మధ్యభాగమున నత్యంతకళలతోఁ దేజరిల్లెడు మ - కారబీజాక్షరముగలిగికుక్కుటాండాకృతియైనదివ్యసింహాసనమునంగూర్చుండిన మహాత్మునింగాంచియద్భుతమొంది, రాజహంసమా! ఈలోకమెయ్యది? ఈమహాత్ముఁడెవఁ? డనియడుగ, నామరాళ, రాజేంద్రా! ఇదిసువర్లోకము, ఇతఁడుసర్వభూతములనుబెనుచుకర్తయు [illegible]వయునైన విష్ణుదేవుండు. నీవీమహాత్ముని ధ్యానించుమనిచెప్పియా [illegible]సముచటనుండిపండ్రెండువేలయోజనములదూరముపోయెను.

ఆచక్రవర్తియచటదివ్యరత్నకాంతులచేత నొప్పుచుండెడు పురమును, దానికి మధ్యభాగమున ననాహతకమలమును, నాకమలముయొక్క పండ్రెండుదళములయందును, క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-అను పండ్రెండక్షరములుగలిగి, మధ్యభాగమునదివ్యకళలతో వెలుఁగుచుండెడు శి వర్ణమను-బీజాక్షరముగల దివ్య సింహాసనము మీఁదఁగూర్చుండినమహాత్మునింగాంచివిస్మయమునుబొంది, రాజహంస

మా! ఇది యేలోకము? ఈమహాత్ముఁడెవఁడనియడిగిన, నామరాళము, రాజేంద్రా! ఇదిమహర్లోకము. ఇతఁడు సంహారకర్తయు నధిదేవతయు నైన శివదేవుండు. నీవీమహాత్ముని ధ్యానించుమనిచెప్పి యారాజహంస యచటనుండి పండ్రెండువేలయోజనములదూరము పోయెను.

ఆరాజేంద్రుఁ డచట దివ్యరత్నములచేతఁ దేజరిల్లుచు మిగుల మనోహరమైనపట్టణమును, దానికి మధ్యభాగమున-విశుద్ధకమలమును, నాకమలముయొక్క పదియారు దళములయందును, అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః-అను పదియారక్షరములుగలిగి, మధ్యభాగమునఁగడు తేజంబై వెలుఁగుచుండెడు హా-యనుబీజాక్షరముకలిగి, హేమతామరసముమీఁదం గూర్చుండినదివ్యపురుషునింజూచి యద్భుతమంది, రాజహంసమా! ఇది యేలోకము? ఈమహాత్ముఁడెవఁ డనియడిగిన నాయంచ, రాజేంద్రా! ఇదిజనర్లోకము. ఇతఁడుసర్వభూతములకుఁ గార్యస్వరూపుఁడైన-జీవుండనియు, నధిదేవతయనియుఁ జెప్పి, యచటనుండి యామరాళము పదివేలయోజనములదూరముపోయెను.

ఆమండలాధిపతి మిగులధైర్యముతోడం బోయి యచట నాగమణులతో భాసిల్లుచు రవిచంద్రులకాంతులకుమించి వెలుఁగు చుండెడు మాణిక్యమంటపమును, దానికిమధ్యభాగమున నాజ్ఞేయకమలమును, నాకమలముయొక్క రెండుదళములయందును, హం- క్షం-అను రెండక్షరములుకలిగి, మధ్యభాగమునఁ దళుకుతళుక్కని వెలుఁగుచుండెడు, యకారబీజాక్షరముగలతమ్మిగద్దియపైఁగూర్చుండిమహాతేజంబుతో నొప్పు దివ్యపురుషునింగాంచి యాశ్చర్యానందభరితుండై, రాజహంసమా! ఇదియేలోకము? ఈమహాత్ముండెవఁ? డనియడిగిననాయంచ, రాజేంద్రా! ఇదితపోలోకము. ఇతఁడాత్మస్వరూపుఁడు, కారణపురుషుఁడు, మాయాశక్తింగూడినమహాత్ముఁడు. నీవిచటదిగి యీమంటపములో నుండుము. ఇచటకి రెండువేలయోజనములదూరములో నాసత్యలోకముండును. ఇచటనుండి యాసత్యలోకమువఱకు మహాప్రకాశముకలిగియుండును. నేనుజెప్పినతొమ్మిదివిధములభక్తులందఱు దివ్యవిమానములెక్కి యాసత్యవేణిని దర్శింపఁ బోవుచుందురు. నీవు నిజముగా సూనృతవాక్యపరిపాలకుండవైనయెడల నీకుదశవిధనాదంబులును దోఁపడవచ్చును. ఈ

గంగాయమునలలో మజ్జనమాడి దివ్యవిమానమునెక్కి నీవును సహస్రార కమలమను సత్యలోకమునకుంబోయి నియమితి సోపానముమీఁదఁ గూర్చుండి యమృతపానముచేయుచు నానందాబ్ధిలోఁ దేలుచుండుము. నేనుమగుడిక్రిందిలోకములకుంబోయెదనని చెప్పి యచట నుండిమఱలెను.

అంతనాహరిశ్చంద్ర చక్రవర్తి తనభాగ్యమేభాగ్య మని మిగుల నుత్సాహముఁబొందుచు, మహాత్ములఁదర్శించుచుఁ, దానెంతకాలమునిరీక్షించియుండినను దనకు దశవిధనాద్యములుతోడ్పడిరాకుండుటకు వగచి, యయ్యో! యిదియేమన్యాయము! రాజహంస చెప్పిపోయినప్రకారము దశవిధనాదములు సహాయముగరాకుండెను. నాదౌర్భాగ్యమేమో తెలియదు, నేనెవరితోఁజెప్పుకొందును? నాకిచట దిక్కెవ్వరు? ఏమి సేయుదు? నని మనంబునవిచారమునొందుచు, నాగంగాయమునలలో నైన స్నానముచేయుదమని యోచించి సమీపమునకుంబోయిననా దేవనదులు రెండునుగనుపించకుండెను. అతనాహరిశ్చంద్రచక్రవర్తికిభయమును దొట్రుపాటునుగలిగి పట్టఁగూడని దుఃఖముతో, నకటా! నన్నాదరించి రక్షించువారెవ? రని యేడ్చెను. ఆరాజేంద్రునకుఁ గుండలీశక్తిప్రత్యక్షంబై, రాజేంద్రా! నీవేలదుఃఖించెదవు? నీవుసత్యశీలుండవని మెచ్చివచ్చితివి గాఁబోలును. అకటా! నీనిశ్చయమునీకులేకపోయెనా? పుత్రునివిషయమై వరుణదేవునితో బొంకినబొంకు నీచిత్తమునకుందెలియదా? వృథా భ్రమలెందుకు? నీకు సత్యవేణిదర్శనము కలుగనేరదు. అసత్యవేణి దర్శనము కలుగుటకు సందియము లేదు, నీమనోదుఃఖమునువిడిచి, యజ్ఞానభూమికిం బోయి యాయసత్యవేణితో సుఖించు మని పలికి యాభూత మతనినెత్తుకొనివచ్చియజ్ఞానద్వీపమున విడిచి మటుమాయముగఁబోయెను.

అంతనాచక్రవర్తినలుదిక్కులుపరికించి యెవ్వరినిఁగానక దూరములోనొకపట్టణమునుగాంచివిచారపడుచు, నోదైవమా! పుత్రుని విషయమై నేనెక్కడఁగపటము వహించితిని? బిడ్డమీఁదిగారాబముచేతదినములుగడిపితినేగాని బలిపెట్టుటలేదని చెప్పలేదుగదా! ఈవిషయములో నన్నుబద్ధునిఁగానెంచుటె? ట్లని విచారమునొంది యేమియుఁదోఁచక, యీద్వీపమున నన్ను రక్షించువారెవ్వరు? నేనేమిచేయుదు? నని దుఃఖించుచుండిన, నతనియొద్దకొక స్త్రీరత్నము వచ్చి తనదేహకాంతులచే నతని

డొందమునుగరఁగించి, యమ్మా! మీరెవ్వారలు? ఎచ్చుండివచ్చితిరి? దుఃఖించుటకు గతఁబెయ్యెది? మీవృత్తాంతమంతయు దాఁచకవినిపించుఁడనియడిగిన నతఁడు తనవర్తమానమంతయుం జెప్పి విచారమునొందిన తన్నుఁదానిందించుకొనిన, నావనజనేత్రియాదరముతో నతనికిట్లనియె.

రాజేంద్రా! వంధ్యాసూనుఁడను మహేంద్రునకు సత్యవేణి యనియు, నసత్యవేణియనియు, హులికవేణియనియు, ముగ్గురుపుత్రి కలుగలరు. వారిలోఁబెద్దపుత్రిసత్యవేణి. అదినేముక్తికాంత. మహా మహిమలుగలది. విశేషమైనభ్రమలకు హేతుభూతురాలు. యుగముల పర్యంతము సమాధినిష్ఠలు సాధించినజ్ఞానులును, యోగులును, భక్తులును, నాదేవివలనమోసపోయియాభ్రమలలోఁ గులకొని, పునర్భవములను బొందుచుందురుగాని జన్మశూన్యము కలుగనేరదుగదా! వివేకపరులు జన్మశూన్యమైన యచలమార్గమునేకోరుదురు, గాని కల్పనాసహితముల్తైన పదవులనుగోరరు. భ్రమనువిడుచుటే జన్మశూన్యము. కాఁబట్టియసత్యవేణికంటెను సత్యవేణియందుభ్రమవిశేషము. ఆసనాభ్యాస నాది సాధకములే బంధమోక్షములకుమూలము. కాఁబట్టి సత్యవేణి శ్రేష్ఠమనియును, నసత్యవేణి తక్కువయనియును నీవెంచవలదు. పదార్థములయొక్క చవిగొనినవారికిఁబదేపదే భ్రమపుట్టనేరదు. రుచి చూడనివారికి జ్ఞప్తివిశేషముగాఁగలుగుచుండును. మా యసత్యవేణి యద్భుతమైన రూపలావణ్యములుగలిగిత్రిమూర్తులకునసాధ్యంబై యీ ద్వీపమంతయుఁబాలించుచున్నది. ఒకయబద్ధికునింగోరియున్నది. నీభాగ్యవశముననిన్నువరించునని తోఁచుచున్నది. నేనాదేవియొక్కచెలికత్తియను. మాద్వీపముననించుకైనమన్నునుఱాళ్లనుదొరకవు. మన్నంతయునుస్వర్ణమే. ఱాళ్లన్నియునురత్నములేయని సంభాషించుచుండెను.

ఇంతలో నాయసత్యవేణి దివ్యరత్నసువర్ణఖచితంబైన పల్లకిలోఁ గూర్చుండి మంగళవాద్యములతో బయలుదేరివచ్చుచుండెను. వేలకొలఁదిచేడియలు బరాబరులుచేయుచు నాయుధములుధరియించిముందుగావచ్చుచుండిరి. విశేషముగాగుఱ్ఱములును నేనుఁగులును వచ్చుచుండెను. నూర్గురు మత్తేభయానలు దివిటీలవలె గొప్ప దేవనాగరత్నములను దమ హస్తములలోఁబెట్టుకొని పల్లకివెంబడి మంగళములు

పాడుచు రాఁగాఁ, గొంద ఱిందువదనలు గుప్పుగుప్పున సుగంధపుష్పాదినిఁ జల్లుచు రాఁగా, మఱికొంద ఱుకలువకంటులు కుసుమములను జల్లుచు రాఁగా, దశవిధవాద్యములతోడ నాబిసరుహదళాక్షివచ్చి క్రొక్కారు మెఱుంగు తెఱంగునఁ బల్లకిలోనుండి బైటవచ్చినంజూచి, యారాజేంద్రుఁడు, వెఱఁగుపడినేత్రములనుమూసికొని నిశ్చేష్టితుండై భూమిమీఁదంబడెను. ఆకన్యకామణిత్వరితముగ నతనిదగ్గఱకువచ్చి ముఖమందుఁబన్నీరుచల్లి లేవఁదీసికూర్చుండఁబెట్టి, పుణ్యాత్మా! నేనుగన్నియనుగాని మెఱుపుఁదీఁగనుగాను, నన్నుఁజక్కఁగా దృష్టించిచూచి భ్రమనువిడువుము. సత్యవేణివలె దృష్టిపథమునకుందగులని మాయలాడినిగాను, సంతోషముతోఁబట్టపుటేనుఁగునెక్కి పురిలోనికిరమ్మని ప్రార్థించెను. అతఁడు గజమునెక్కెను. ఆయసత్యవేణి మఱలఁ బల్లకిలోఁగూర్చుండెను. చేడియలు మంగళములుపాడుచు నాయిరువురిమీఁదనుబుష్పాదినిఁజల్లుచు మంగళవాద్యములను భోరుకొల్పించుచు, నూరేగింపుతో వెంటఁబెట్టుకొని పోయి యంతఃపురమునుజేర్చి యావధూవరులకు మంగళస్నానములు చేయించి దివ్యవస్త్రాభరణముల నలంకరించి భోజనంబులుపెట్టి యావధూవరులచేతఁ బ్రమాణములుచేయించి గాంధర్వవివాహమును గావించిరి. ఆరాజేంద్రుఁ డత్యంత రూపసియు యౌవనియునైన యసత్యవేణితో సుఖానందము లనుభవించుచుఁ బ్రతిదినము నూతనవస్త్రాభరణముల నలంకరించుకొనుచు, నూతనపదార్థములను భుజయించుచు, దివారాత్రులని యెఱుంగక కేళికాగృహమును విడిచిరాక సుఖించుచు, నామీడకుదాపించిన వజ్రములనునవరత్నములను జూచి యద్భుతమునొందుచు, నెల్లవేడుకలు చేయుచుండెను.

ఇటులనుండఁగాఁ గొన్నిదినంబులకు నాయసత్యవేణి గర్భమును ధరించి, నవమాసములునిండి యొకపుత్రునింగనెను. ఆబాలున కబద్ధమనిపేరుపెట్టిరి. అంతనాయసత్యవేణిక్రమప్రకారము, దబ్బర, హుళిక్కి మోహ, భ్రమ యను నలువురుపుత్రులనుగనిన, నారాజేంద్రుఁడు మిగులనుప్పొంగి యాయైదుగురుపుత్రులతో నానందించుచు, నాద్వీపమున ముప్పదిసంవత్సరములు తనరాజ్యమందును బుత్ర కళత్ర బంధు మిత్రామాత్యభృత్యవర్గంబు నందును జ్ఞప్తిలేక, యందుండునద్భుతమైన

వింతలను జూచుటకే కాలముచాలక యేమియుందోఁచక, యొకనాఁడు భార్యనుంజూచి, ప్రియురాలా! నేనువచ్చినిన్నువివాహముచేసుకొని ముప్పదిసంవత్సరములాయెను. బిడ్డలకువిద్యాబుద్ధులేగఱపితినిగాని వేటాడ వలసినక్రమములు చెప్పనైతిని. ఱేఁపటికి బిడ్డలతోడవేఁటకుం బోయెద ననిచెప్పిన, నాయసత్యవేణి, నేనునుమీవేఁటవేడుక చూడవచ్చెద నని పలికి తయారుచేయించెను. ప్రభువునుబుత్రులును గుఱ్ఱములనెక్కిరి, యసత్యవేణిపల్లకిలోఁగూర్చుండి వేఁటకత్తియలతోడ నందఱునడవికిం బోయిరి. హరిశ్చంద్రచక్రవర్తిబిడ్డలకు మృగములవేఁటనుం జెప్పుచు, దుష్టమృగములను బాణములతోఁబడఁగొట్టుచు, వినోదముగవేఁటలాడుచు, భార్యకుసంతోషమునుబుట్టించుచు, పంతములాడిమృగములను బట్టితెచ్చుచు, త్రిమూర్తులునువేఁటకువచ్చినంగాంచి వారికినమస్కరించి తానుబత్నిపుత్రులతోడవేఁటకువచ్చిన వర్తమానమునుజెప్పి వారిచేత దీవనలుగైకొని యాసాయంసమయమునఁ బత్నిపుత్రులనువేఁటకత్తియలనువెంటఁబెట్టుకొని పురిలోనికివచ్చుచు, నాప్రదీచిదిక్కునదివ్యరత్నగోపురప్రాకారములును దివ్యభువనములునుగలిగి తళతళమెఱయుచుండు గొప్పపట్టణమునుజూచియాశ్చర్యపడి భార్యకుంజూపించి, ప్రియురాలా! ఆపట్టణమెయ్యెది? ఎవ్వరుపాలించుచున్నా? రనియడిగెను. ఆయిందుముఖి పాణనాథా! అదియాశ్చర్యపట్టణము. నాతండ్రిసంధ్యాసూనుండను మహేంద్రుఁడు, దారుపురుషుఁడనుమంత్రితోఁ బాలించుచున్నాఁడు. అతనిభార్య భ్రమాదేవి యనునుత్తమురాలిగర్భమున నాయక్క సత్యవేణియు, నేనును, నాచెల్లెలుహుళిక్కివేణియునుబుట్టితిమి. సత్యవేణియును నేనును జ్ఞానాజ్ఞానభూములను బాలించుచున్నారము. హుళిక్కివేణి వివాహములేకయేయున్నది. ఏడేడుపదునాల్గులోకములకు నాతండ్రియే కర్త. అతనిమాయయేసర్వమును. త్రిమూర్తులుసహాసర్వదేవతలకు నతఁడే దేవోత్తముండనెను. ఆరాజేంద్రుఁ డాశ్చర్యపడి, ప్రియురాలా! మనమాదేవునింజూచివత్తమురమ్మనిన, నాయసత్యవేణి, ప్రియుఁడా! మధ్యసాగరమున్నది. మనమెట్లుపోవచ్చును? కొద్దిదినములలో నావ సిద్ధము చేయించుకొని దానిమీఁదనెక్కిపోయి యామహాత్ముని దర్శించి వత్తమనిచెప్పి పురికింబోయి పరిచారకులనురప్పించి, నావనునిర్మించుఁ

డని యాజ్ఞాపించెను. అనంతరముకొన్నిదినములలోనావనివాండ్రోడను నిర్మించి, వారిలోఁ గొందఱు నావనునడిపించువారుగాను, మఱికొందఱోడకురక్షకులుగాను నేర్పడియాయసత్యవేణికిం జెప్పిన, నావనజనేత్ర భర్తకుంజెప్పి యతనియిష్టప్రకారము భోజనపదార్థములన్నిఁటినాయోడలోనికిం జేర్పించి, భర్తను నేవురుబిడ్డలనువెంటఁబెట్టుకొనిపోయి యానావలోఁగూర్చుండి, యోడరక్షకులగు నడిపించువారినింజూచి మీరతిజాగ్రతతో నావనునడిపించుఁడని యాజ్ఞాపించి, భర్తతోఁ బిడ్డలతో సంతోషవార్తలాడుచు మిగుల నానందముతోఁ బోవుచుండెను.

ఆనావికులు మిగులజాగ్రతతో నావను నడిపించు చుండినను, నాయోడకు నడుగుతట్టున నొకరంధ్రిమేర్పడి క్రమేణ నాద్వారమువెంట నీళ్లువచ్చుచు మిగులభారమై మునుఁగుచుండుటను గ్రహించియానావికులోడమునిఁగెమునిఁగె నని గొప్పకంఠధ్వనులతో నేడ్చిరి. హరిశ్చంద్రచక్రవర్తియాయార్తధ్వనులనువినితత్తరపాటుతో భార్యను బిడ్డలనువెంటఁబెట్టుకొని యోడపైభాగమునకుంబోయి, ప్రాణనాయకీ! యోడమునుఁగుచున్నది. అయ్యో! ముప్పదిసంవత్సరములద్భుతమైన సుఖానందములనుభవించి, బిడ్డలముచ్చట్లుచూచితిమి. మనమందఱముసముద్రములో మునిఁగిపోవుటకున్నారము. మొలబంటినీళ్లువచ్చినవి, యింకేమిచేయువారమని తనహస్తములతోఁ బత్నీపుత్రులను గవుఁగొని పెరెలుంగున నేడ్చెను.

ఆయింద్రజాలముతిరిగిపోవుటచే నిక్కడ నాసభలోనిమంత్రిప్రధానసామంతరాజులు రాజేంద్రుని యేడ్పునకువెఱఁగుపడి దిగ్గునలేచి యాప్రభువునుబట్టుకొనివీవుతట్టిరి. ఆరాజేంద్రుఁడు నేత్రములఁదెఱచి తన సభికులనందఱింజూచి నేత్రములవెంటజలబాష్పముల విడుచుచుండెను. ప్రథమమంత్రియైనసత్యకీర్తి, రాజేంద్రా! దేవరువారేడ్చుటకుఁ గారణమేమి? గొప్పకంఠధ్వనిచేయుటకుఁ గతంబెయ్యది? సుమారైదునిమిషములకాలము నేత్రములమూసుకొంటిరి. ఇంతలోనేమిదుస్స్వప్నము గలిగెను? దయతో నెఱింగించుఁడని వేఁడెను. ఆరాజేంద్రుఁడు మంత్రింజూచి తనదుఃఖముఁబట్టఁజాలక, మిత్రుఁడా! స్వప్నముకాదు, నిజముగా జరిగిన వర్తమానము. అబ్బా! నేనేమిచెప్పుదునని పలికెను. ఆమంత్రి, దేవరవారు తాంబూలముచేయుచు నాకుమడుపుకరమునంబుచ్చుకొని, నేత్రముల

చూచితిరి. మేమునందఱిచేయకనిశ్శబ్దముగానుంటిమి. ఇంతలోజరిగిన సమాచారముగాఁబట్టి యదిస్వప్నముగానేయుండును, మాకుంజెప్పుఁడని ప్రార్థించిన, నారాజేంద్రుఁడు ముప్పదిసంవత్సరములకుముందు తానురాజ హంసనెక్కిపోవుచు నామార్గమునందలిలోకములను మహాత్ములనుజూచు టయు, సత్యవేణిదర్శనమునకై తానుబొందినదుఃఖమును, నసత్యవేణిని వివాహంబై పొందినయద్భుతమైన సుఖానందమును, నబద్ధము, ఠక్కర, హుళిక్కి, మోహా, భ్రమయనునైదుగురుపుత్రులుపుట్టుటయు, ఆవ సముద్రములో మునిఁగిపోవుటయు, సర్వమునెఱిఁగించెను. ఆమంత్రియు సభికులునువిని యొకరిముఖమొకరుచూచుకొనియాశ్చర్యపడుచుండఁగా, నాప్రథమమంత్రి ప్రభువుంజూచి, రాజేంద్రా! దేవరవారికిస్వప్నమున నట్లుతోఁచెనేగానినిజముకాదనిపలికెను. ఆమండలాధిపతి, మిత్రుఁడా! నీవిటులఁబలుకఁదగునా? నేననుభవించివచ్చిన యదార్థమును నీవు స్వప్నమనుటెట్లు? స్వప్నముకాదునిజమైనయనుభవమనిచెప్పెను. ఆ మంత్రి దేవరవారుమమ్ములనువిడిచియుండలేదే,ముప్పదిసంవత్సరములెప్పు డుండివచ్చితిరి. అసత్యవేణి యెటువంటిదోదానిపుత్రులునటువంటివారే. అంతయునబద్ధము, ముందుమీరుధరించినవస్త్రాభరణములేగాని, దివ్య వస్త్రాభరణములు కావనిపలికెను. ఆరాజేంద్రుఁడు తనవస్త్రాభరణముల నుజేతిలోని తాంబూలపు మడుపునుజూచికొని యేమియుఁదోఁచక యోచించుచుండఁగా నాయింద్రజాలకుఁడు, రాజేంద్రా! నేనుజలజనాభుఁడను నింద్రజాలకుండను, నావిద్యావిశేషమువలన మీచిత్తమట్లు వ్యాపించెనే గానినిజముగాజరిగినదికాదు. స్వప్నముంగాదు మీశరీరమొందునుబోలేదు సర్వమునామహిమయనిపలికెను. ఆరాజేంద్రుఁ డద్భుతమునొంది, మోహా! నీమాటలమేమెట్లునమ్మవచ్చును? నాకు ముందుగాఁ దెలయఁ జేయకయింద్రజాలమెట్లుచేసితివి? నామంత్రిస్వప్నమనివాదించుచున్నాఁడు, నేనునిజమనిపలుకుచున్నాను, నీవునీమహిమయని చెప్పుచున్నావు, మనముగ్గురిలోనెవరునిజము? ఎవరబద్ధ మనిపలికిన, నతఁడుదేవరవారి యిష్టప్రకారము మఱల నావిద్యావిశేషము జూఁపెదను. మిగులదృఢమైన చిత్తముతోనుండుఁడనిచెప్పి, యామాయకుఁడుతనచేతిలోనినెమలియీక లకుంచెను ద్రిప్పిచిత్తసంకల్పమునొందించి మహేంద్రజాలముగావించెను.

అంత నారాజేంద్రుఁడు మఱలనిద్రమైకముకలిగి నేత్రముల మూసెను. ఆక్షణకాలమునకంతయు నామండలాధిపతికిగొప్పవెలుఁగును ననేకోద్యానవనములును,దివ్యమంటపములును,దానుగూర్చుండినచోటు నవరత్నవేదికగానుగనుపించిన, నతఁడచ్చెరువందిచూచుచు, నదాటున నొకశ్వేతాశ్వమునుజూచి యాశ్చర్యపడి, యాహా!యిదిమిగులరమ్యము గానున్నది.ఇటువంటి శ్వేతాశ్వము నేనిదివఱకుఁజూడలేదు. ఇది యేలోకము నుండివచ్చెనో తెలియదు. మహాత్ములెవరోయెక్కి స్వారిచేసినట్లు గంత యమర్చియున్నది. ఇట్టితురగము నెక్కనివానిజన్మమెందుకని మిగులఁ దెంపుతో లేచియాగుఱ్ఱముయొక్క కళ్లెముపట్టుకొనిదానిదేహమును దడవుచు, దానిపై నెక్కికూర్చుండెను. అంత నామాయాతురగము భూమిమీఁద నిలువక యంబరవీధికెగసి యతివేగముగాఁ బోవుచుండెను. ఆచక్రవర్తిగుఱ్ఱపువేగమునకుభయపడక, ధైర్యముతో నటనటఁదోఁచెడు వింతలనుజూచుచునీతురగమెక్కడికిఁ గొనిపోవునోయని వితర్కించుచుం బోవుచుండెను. ఆయశ్వము బహుదూరము పోయియందొకయుద్యానవనములో నతనిడించి చూచుచుండఁగానేమటుమాయముగాఁబోయెను.

అంతనారాజేంద్రుఁడు వివిధఫల కుసుమభరితంబులైనవృక్షలతలనుజూచి యాశ్చర్యపడి, యాహా ! యిట్టిఫలవృక్షములనులతలను మనదేశమునఁజూడలేదు. ఫలములుమిగుల మనోహరములై యున్నవి. రుచియెట్లుండునోచూతమనిచూచి, వానిమాధుర్యమునకుసంతసించుచు, నాఫలములనుగోసిభక్షించుచు, సుగంధతావినాఘ్రాణించుచు, మలయమారుతమునకుప్పొంగుచుంబోయిపోయి, యావనమధ్యభాగమునసువర్ణరత్నఖచితంబైన విచిత్రమంటపమునుదానికిఁ బూర్వదక్షిణంబునం దష్టకోణములుకలిగి, బంగరుపద్మములతో భాసిల్లుచుండెడు దివ్యమైన సరస్సును, దానికింబడిగట్లుగాదాపించియుండిన నవవిధరత్నములనుజూచి, ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొని విస్మయమునొంది, యాహా ! యిది దేవవనముగానుండుటకు సందియములేదనియోచించి, యందుండు పూపొదరిండ్లయందును, నామంటపమునందును విశ్రమించుచును, నొకకొలనిలోదిగి జలపానముచేసి పొగడమ్రానిక్రిందంగూర్చుండి, నానావిధములైన దేవవాద్యములనువిని, యాహా ! యీవింతవాద్యములెందుండివినవచ్చు

చున్నవని నలుదిక్కులుపరికించుచుఁ, బిమ్మట గజ్జలధ్వనులనువిని, యామండలాధిపతి యచ్చెరువంది స్త్రీలెవ్వరో సీకోలనిలో జలక్రీడలాడుటకు వచ్చుచున్నారనియును, మనమిందుండిన నవమానపఱతురనియును యోచించి యందొకబొదురుచాటున డాఁగి చూచుచుండెను.

అంతటఁ గ్రొక్కారుమెఱుఁగుతెఱంగున నొకకన్యకామణి తన దేహకాంతులష్టదిక్కులవ్యాపించునటుల నూర్గురుచెలికత్తియలతోడనా సరస్సునకువచ్చివస్త్రములనువిచ్చి యొడ్డునంబెట్టిచెలికత్తియలుం దాను గొలనిలోదిగిజలక్రీడలాడుచుండెను. హరిశ్చంద్రచక్రవర్తి తనభార్య యసత్యవేణియనియోచించి, యాలతాంగులునీరు వెడలివచ్చినవస్త్రములనుధరించినపిమ్మట తానుమెల్లగలేచిపోయి యెదుటనిలిచి, యోహో! ప్రాణనాయకీ! నీవెట్లుప్రాణములఁదప్పించుకొంటివి? బిడ్డలేమైపోయిరి? నేను నీభర్తయైనహరిశ్చంద్రచక్రవర్తినిగానా? నీకునాయందుఁబ్రేమ లేకుండుటకుఁగారణమేమి? ఇందుముఖీ! నీవింతలోనన్నుమఱచితివా? యని కౌఁగిలింపవచ్చెను. ఆకన్యకామణిచిఱునగవుతో వెనుకకుంబోయి, పుణ్యాత్మా! నీకుగుఱ్ఱుతెలియక భ్రమచే నీభార్యయనియెంచి పలుకుచున్నావు. అకటా! నేనుబెండ్లిలేనికన్నియను. నాపేరుహంసళిక్కవేణి. నీభార్యకుంబేరెయ్యది? నీవృత్తాంతమంతయు నెఱిఁగించు, మనిననతఁడు చక్కఁగాజూచివ్రేలుగొఱికికొని, యోహో! నీమాటలునిక్కము. నేను భ్రమచేనాభార్యవనితలంచితి, నాతప్పుక్షమింపుము. నాభార్యయసత్యవేణి మిగులసుందరి, మహేంద్రునిపుత్రి, దానివలెనేనీవును బ్రకాశించుటం బట్టి త్వరపడిపలికితినని తనవర్తమానమంతయు నెఱిఁగించి, నీవెవ్వరు? నీవర్తమానమునుజెప్పుమనిన, నాబిసరుహదళాక్షి, పుణ్యాత్మా! నేను మహేంద్రుఁడను దేవోత్తమునిపుత్రిని, నాపేరుహంసళిక్కవేణియనిచెప్పెను. అతఁడుపక్కుననగి, మఱఁదలా! నేనునీయక్క యసత్యవేణిభర్తను, నీవునాకుమఱఁదలవు. తొల్లింటిబంధుత్వమువిడువక, నన్నువివాహము చేసుకొనుమనిపలికి, యసత్యవేణినిందలంచిదుఃఖించెను. అకన్యకామణి యతనినూరడించి, నీవుపురిలోనికివచ్చి నాతండ్రినిఁబ్రార్థించిన నతఁడు వివాహముగావించునని చెప్పి యాకన్నియ తనమేడకుంబోయెను. అంత నారాజేంద్రుఁడు సమీపమందుండిన దివ్యపట్టణమునుగాంచి యద్భుత

మంచుచు, నందుండునాశ్చర్యములకుఁ బ్రత్తరపాటునొందుచు, నామ
హేంద్రునిసభకుంబోయియామహాత్మునకునమస్కరించి, తనవర్తమాన
మును,నసత్యవేణివర్తమానమును జెప్పిదుఃఖించి, మహాత్మా! త్రిలోక
నాయకా! దేవరవారిచిన్నపుత్రియైన హంళిక్కవేణినిచ్చి వివాహము
గావించుఁడని ప్రార్థించెను. ఆమహేంద్రుఁడు నీవుమిగులజాగ్రతగలవాఁ
డవు, సత్యసంధుఁడవు, నీయిష్టప్రకారము చేయుదుననిపలికి పురిశృంగార
మునుగావించి, త్రిమూర్తులను దేవగణములనురావించి శుభముహూ
ర్తంబునవివాహమహోత్సవముగావించెను.ఆహంళిక్కవేణిరాజేంద్రుని
యిష్టప్రకారముభోగించుచు, భర్తనుద్రిమూర్తులపురములకును, నింద్ర
వరుణాద్యష్టదిక్పతుల పురములకును గొనిపోయి యందలి వింతలను
జూపించుచు, నవరత్నఖచితంబులైన కేళికాగృహముల యందును,
బూపొదరిండ్లయందును, సైకతభూములయందును వివిధబంధములతోఁ
జెంగిప్రభువును మహదానందాబ్ధిలో వాలలాడించుచుండెను. ఆరాజేం
ద్రుఁడు తనరాజ్యమును బత్నీపుత్రహితబంధ్వమాత్యజనంబులనుమఱచి,
యిరువది సంవత్సరములుండెను. ఆయింద్రజాలకునిమహిమవలన నొక
నాఁడుజ్ఞప్తికివచ్చిమామగారికింజెప్పి భార్యనుముప్పురుచెలికత్తియలను
దేవనాగమణులను వివిధవస్తువులను బుచ్చుకొని దేవవిమానముమీఁదం
గూర్చుండి తనపురికివచ్చి యందొకమంటపమునదిగి మంగళవాద్యముల
తో గృహప్రవేశముచేయుదమనియోచించి, పట్టపుటేనుఁగునుముత్యాల
కుచ్చులపసిఁడిపల్లకిని శృంగారించితెచ్చి పుణ్యస్త్రీలు మంగళవాద్య
ములతోడవచ్చి వెంటఁబెట్టుకొని పొందనియాజ్ఞాపించి భార్యనుబల్లకి
లోఁగూర్చుండఁబెట్టుకొని, తానేనుఁగునెక్కి మేళతాళములతోఁబోవుచు
నాయింద్రజాలకుని మహిమవలన నాజాలముయొక్క మైకమువదలి
నేత్రములనుదెఱచి తానెక్కినయేనుఁగును, ముత్యాలకుచ్చులపసిడి
పల్లకిని, హంళిక్కవేణిని, దానిచెలికత్తియలను, నంతఃపురస్త్రీలనుగానక
దిగ్భ్రమఁజెంది, తనమంత్రిప్రధానసామంతరాజులనుజూచి, యోహో
మిత్రులారా! నేనెక్కివచ్చుచుండిన యేనుఁగెందుఁబోయెను? హంళిక్క
వేణియును దానిచెలికత్తియలునునాచేతిలోని నాగమణియునెందుఁబోయె
ననియడిగెను. ఆపెద్దమంత్రి, రాజేంద్రా! దేవరవారునేత్రములనుమూసికొని

రైయెదునిమిషములాయెను. ఇంతలో నేమేమివింతలనుజూచితిరి? హరిశ్చంద్ర వేణియెవ్వరు? జరిగిన వర్తమానమంతయునుజెప్పుఁడని ప్రార్థించిన, నామండలాధిపతి సర్వమునెఱింగించి దుఃఖించెను. ఆయింద్రజాలకుఁడు, రాజేంద్రా! మహేంద్రుఁడిచ్చినవస్త్రాభరణములెక్కడ? సర్వము నామాయగాని నిజముగా జరిగినదికాదు, స్వప్నముకాదు, నామహేంద్రజాలమనిచెప్పిన, నారాజేంద్రుఁడు ముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని, యా మహాత్మునిఁ బెక్కువిధములను వినుతించి యాలింగనముచేసుకొని సువర్ణరత్నములతోఁబూజించి, యతఁడుకోరిన వస్తువులెల్లనిచ్చి పుచ్చెనని చెప్పెను, ఆరామచంద్రుఁ డత్యద్భుతమంది, మునీంద్రా! హరిశ్చంద్రచక్రవర్తి సత్యసంధుఁడనివినియున్నానుగాని, యనృతమాడినట్లునేనిదివఱకువినలేదు, మీవలనవింటిని. పుత్రునివిషయమై వరుణదేవునితో నేటులబొంకెను. ఇంద్రజాలకునివలనఁ దెలియవచ్చి యాపుణ్యపురుషుఁ డేమిచేసె? నతనివృత్తాంతమంతయు నెఱిఁగించుఁడనివేఁడిన నాతపోధనుండిట్లనియె.

శ్రీరామచంద్రా! హరిశ్చంద్రచక్రవర్తిపుత్రార్థియైవరుణదేవునిం గూర్చితపంబుచేసిపుత్రునింబడసెను. ఆవరుణదేవుఁడు హరిశ్చంద్రుని వాచాయబద్ధమాడించుట కిదిసమయ మని మనంబున యోచించి, రాజేంద్రా! పురుడుతీఱఁగానేవచ్చెద, నాయిష్టమును దీర్చెదవాయని యడిగెను. అతఁడుమంచిదని వాగ్దత్తముచేసెను. ఆవరుణదేవుఁడువచ్చి, పుణ్యాత్మా! నీపుత్రునినాకుబలి పెట్టుమనియడిగెను. ఆరాజేంద్రుఁడు తనమనంబున దుఃఖించి కాపట్యమొంది యదిబయటికిందోపనీయక, మహాత్మా! నీయిష్టమునుదీర్చుటకు సందియంబులేదు. అకటా! దంతములుమొలువనిశిశువునుబలిపెట్టుటయుత్తమముకాదని ప్రియములువలికి యంపెను. అంతనావరుణదేవుఁడు గొన్నిమాసములుజరిగినపిమ్మటమఱల వచ్చియడిగిన, నారాజేంద్రుఁ డైదుసంవత్సరములవఱకు బిడ్డబ్రహ్మముతోసమానుఁడనిచెప్పియంపెను. అనంతర మావరుణదేవుఁడు సప్తమవర్షమునవచ్చి బలిపెట్టుమనియడిగెను. ఆరాజేంద్రుఁడు, మహాత్మా! పదునెనిమిదిసంవత్సరములపర్యంతము బాలుఁడజ్ఞానియని చెప్పంబడును గాఁబట్టి యవివేకింబలిపెట్టుట యుత్తమపక్షముకా దనిచెప్పెను. ఆ వరుణదేవుఁడుసమ్మతించి తనలోకమునకుంబోయి, పందొమ్మిదవ సంవత్స

రమునమగుడివచ్చి చక్రవర్తింజూచి బలిపెట్టుమనియడిగెను. ఇంతలో నా రాజేంద్రుఁడు పుత్రునకు విద్యాబుద్ధులుగఱపి భూమండలమంతయు సంచరించిరమ్మనిపంపుటనుబట్టి, వరుణదేవునకునమస్కరించి తనబిడ్డ భూసంచారమునకుంబోయిన వర్తమానమునుజెప్పియంపెను. ఇందువలన నాహరిశ్చంద్రునకు ననృతదోషముసంభవించెను. ఇంద్రజాలకునివలన తా నసత్యమాడినటులఁ దెలియవచ్చి మిగులసంకటమునుబొంది, తన మంత్రులను సామంతరాజులనుసభికులనుముఖమెత్తిచూడక, తలవంచుకొనిఖిన్నుఁడై మనంబున విచారమునొందుచుఁ దనపెద్దమంత్రింజూచి, మిత్రుఁడా! నా కనృతదోషము సంభవించెను. అట్టిదురిత మెట్లువాపికొందును? రాజ్యమునువిడిచియడవికింబోయి యుగ్రతపంబుచేసి నిష్కల్మషుండనై మోక్షంబుబొందెద ననిపలికి విరక్తిమార్గముతోనుండుటఁ జూచి మంత్రిభయభ్రాంతుఁడై, వెంటనే నాకు సమాచారమంపెను. నేనతనియందుఁబుత్రవాత్సల్యతగలవాఁడనై వచ్చి యారాజేంద్రుని నాదరించి మంచివాక్యములతో, బిడ్డా! నీవేలదుఃఖించెదవు? నీకుజననమరణంబులును, సుఖదుఃఖంబులును, స్వర్గనరకంబులును, బంధమోక్షంబులును, బుణ్యపాపంబులునులేవు. నీ నిజస్వరూపమును దెలియఁజాలక భ్రమస్వరూపమైనమూలము లేని యీమాయాశరీర మీవనిభావించి, లేనిదుఃఖమొందుచున్నావేగాని, నీనిజస్వరూపమేమియులేని, యెద్దియుఁగాని, యచలపరిపూర్ణమై యెందును స్వతస్సిద్ధముగానున్నది. మదించిన గంధనాగము తనపైనమన్ను దానేవేసుకొనునట్లు లేనిదుఃఖమును నీవేలపొందెదవు? అచలపరిపూర్ణ బ్రహ్మమువలనఁబుట్టనిదే యీమాయ యెఱుక. అదితల్లిదండ్రులులేక తనంతటఁదానేవచ్చి భ్రమరూపకమై భ్రమింపఁజేయుచుండును. భ్రమయే యెఱుక, భ్రమయేమాయ, భ్రమయేమహేంద్రుఁడు, భ్రమయే నారాయణుఁడు, భ్రమయే సదాశివుఁడు, భ్రమయేకల్పనాసహితములైనమోక్షాదిపదవులు, భ్రమయే ముక్తికాంత, నీ కింద్రజాలమందుఁ దోఁచినయసత్యవేణిమొదలగుసర్వమును భ్రమరూపకములేగానిస్థిరములుకావు. ఈప్రపంచము నట్టిదేయని పెక్కువిధములబోధించి యతనినిజస్వరూపమును సాజ్ఞచేసి, కలలో వచ్చినశరీరములుమేల్కనిననేమిలేవని చెప్పి యతనిభ్రమనుదొలంచి

యశరీరుఁగావించిమజులరాజ్యమునవిల్పితినని చెప్పెను. ఆరామచంద్రుఁ డద్భుత మొంది, స్వామీ! మునీంద్రా! మీవాక్యములు మిగులనాశ్చర్యకరములుగా నున్నవి. 'అయమాత్మా బ్రహ్మ' యనియు 'ప్రజ్ఞానం బ్రహ్మ' యనియు "అహంబ్రహ్మాస్మి" యనియు 'తత్వమసి' యనియు, సచ్చిదానందమనియు, నాదబిందుకళలనియు, భక్తివైరాగ్య యోగజ్ఞానములే ముఖ్యములనియు, మోక్షాదిపదవులే యనుభవములనియు వేదములుపలుకుచున్నవి. కొందఱు మహర్షులు భక్తియోగజ్ఞానములే విశేషములనియు, వేదములేప్రమాణము లనియుఁ జెప్పిరి. దేవరవారు సెలవిచ్చినమార్గము వానికి విరుద్ధముగా నున్నదనిపలికెను. ఆమునీంద్రుఁడు చిఱునగవుతో నతనినాలింగనముచేసికొని, బిడ్డా! నేనుజెప్పిన యచలమార్గమును భక్తివైరాగ్య యోగజ్ఞానులును, శ్రుతులును స్మృతులును శాస్త్రములును దెలియఁజాలవు. వేదము లంతమొందుట చేతనే వేదాంత మని ప్రసిద్ధంబయ్యెఁ గావున వేదాంతమైన యచల మార్గమును వేదములెట్లెఱుంగును? వేదప్రమాణులైన భక్తియోగజ్ఞానులు వేదాంత మెట్లు తెలియుదురు? వేదము లంతమొందిన పిమ్మట వేదములతోఁబనియేమి? వేదాంతమును గనఁజాలక యే మాయావాదులైన భక్తియోగజ్ఞానులు సిగ్గులేక మేము వేదాంతుల మనియును, మాకువేదములేప్రమాణములనియును, నహంకారముతో వచించుచున్నారు. వేదములు మాయయెఱుకకే ప్రమాణములుగాని, యచలపరిపూర్ణబ్రహ్మమునకుఁ బ్రమాణములుగావు. వేదము, లెఱుకయేయాత్మ యనియు, నాత్మయే యెఱుకయనియు, నెఱుకయే పరబ్రహ్మమనియు, నెఱుకయే బ్రహ్మమనియు, నెఱుకయే నారాయణుండనియు, నెఱుకయే సదాశివుండనియు, నాత్మయే బ్రహ్మమనియు, నాత్మశరీరమునకు వే ఱని యుఁ జెప్పుచున్నవి. ఆత్మ శరీరమునకు వేఱైనయెడల, నాత్మయీశరీరమును విడిచియుండఁగూడదా! ఆత్మసంబంధములేక శరీరమునకు వృద్ధిక్షీణంబులెట్లుసంభవించెను? ఆత్మసంబంధము లేనియెడల గర్భమునఁ బిండమెటుల వృద్ధిపొందెను. ఆత్మయే శరీరమునకాధారము. ఆత్మయే శరీరమును బుట్టించుచున్నది. ఆత్మతో శరీరవృత్తులును బోవుచున్నవి. కనుక నాత్మయేశరీరము, శరీరమేయాత్మ. ఆత్మశరీరములకు భేదము

లేదు. శరీరము సగుణము. ఆత్మనిర్గుణమని చెప్పుదురు. ఆత్మబ్రహ్మము కాదు. ఆత్మబ్రహ్మమైనశరీరముబ్రహ్మమే. ఆత్మకు స్థూల సూక్ష్మ కారణ మహాకారణశరీరములున్నవి. అచలపరిపూర్ణమునకుస్థూలసూక్ష్మకారణ మహాకారణశరీరములులేవు. ఇఁకమీఁదనుగలుగవు. ఆత్మకేవృద్ధి క్షీణం బులుగాని బ్రహ్మమునకు వృద్ధిక్షీణంబులులేవు. వృద్ధిక్షీణంబులుండిన బ్రహ్మమెట్లగును? "నిర్వికారోనిరంజన" యనియున్నది గనుక నేకాల మందును వికారమునొందలేదనుట సిద్ధము. ఆత్మకుగుణభేద రూపభేద నామభేద వృత్తిభేదములు, విశేషముగాఁ గలిగియుండుటనుబట్టియాత్మ యేమాయాస్వరూపము. అదియేమాయయెఱుక. ఎఱుక బ్రహ్మ మేకాల మందునుగాలేదు. ఇఁకమీఁదను గాఁబోదు. రూపనామంబులు గలిగి త్రిగుణసంబంధులైన, బ్రహ్మవిష్ణుమహేశ్వరు లెఱుకలోనివారు, మఱు మాయముగాఁ గనుపించి మఱుమాయముగానే మాయమైపోదురు. మాయాశరీరములకు నిల్కడలేదు, గాఁబట్టి యశరీరియైన యచలపరి పూర్ణ బ్రహ్మముతప్పఁ దక్కనశరీరములన్నియు మఱుమాయాముగానే పోవుటకుసందియము లేదు. సర్వము భ్రమరూపకములు. పట్టిచూచిన నెందునుగనుపించక మఱుమాయముగాఁ బోవుచుండును. అచల పరి పూర్ణబ్రహ్మము స్వతస్సిద్ధముగా నందఱికింబోదువుగా నెందునునిండి నిబిడీకృతమై యాపోజ్యోతులవలనఁ దెలియంబడుచుండును. ఏయుక్తినే సాధన యేయోగముపనిలేదు. గురుకటాక్షమునకంటె నెక్కువలేదు. సర్వకాల సర్వావస్థలయందును నేత్రములను మూసిగాని తెఱచిగాని సర్వత్రసమదర్శనముగా నచలపరిపూర్ణబ్రహ్మమునుజూడవచ్చును. శరీర మేయాత్మ. ఆత్మయే ప్రజ్ఞానము. ప్రజ్ఞానమే చైతన్యము. ప్రజ్ఞానచైత న్యములే జీవేశ్వరులు. జీవేశ్వరులే ప్రకృతిపురుషులు. ప్రకృతి పురుష ద్వయమే నాదబిందువులు. నాదబిందువులకూడికయే కళగాని, కళ బ్రహ్మముకాదు. సద్రూపచిద్రూపముల కూడికయే యానందము గాని యానందము బ్రహ్మముకాదు. నేత్రద్వయమే సూర్యచంద్రులగుటం జేసి యాతేజస్సులు లేకున్న జ్యోతియులేదు, గాఁబట్టి జ్యోతిబ్రహ్మము కాదు. ప్రకృతి పురుషద్వయమే దోష స్వరూపములు. ఈ రెంటిని బ్రహ్మ మని వేదములు చెప్పటనుబట్టి వేదములు మాయయెఱుకకే

ప్రమాణములుగాని బ్రహ్మమునకుఁ బ్రమాణములుగావు. అంధకుఁడు సూర్యునిం జూడలేనటుల, వేదములు వేదాంతమును దెలియఁజాలవనిస్పష్టముగాఁ దెలియవచ్చునుగదా, భక్తివైరాగ్య యోగజ్ఞానులు మాయనేనమ్మి మాయనే ధ్యానించుచు, మాయకే సమాధినిష్ఠలు సలుపుచు, నామాయనేగనఁజాలకిసిగ్గుపడి తమసిగ్గును బయలుపఱచక తామేమోకన్నటుల నితరుల భ్రమింపఁజేయుచుఁ, దప్పువాదములాడుచు, నామాయకేమటుమాయముగాఁబోవుచుందురు. జననమరణప్రవాహము వారినివిడువంజాలదు. వేదములుకర్తలేకకర్మమునే చెప్పినవి. మూలములేనియెఱుకయేకర్తకర్మములుగాను, కారణకార్యములుగానునున్నది. చక్కఁగావిచారించిన నీరెండెందునుగనుపించక మటుమాయముగాఁబోవుచున్నవి. ఈమాయయెఱుకయే యింద్రజాల మహేంద్రజాలములు. ఎఱుకయేప్రపంచము. ఎఱుకయేనీవునునేనును. ఎఱుకయే శ్రీమన్నారాయణుండు. ఎఱుకయే సదాశివుఁడు. ఎఱుకయే కల్పనాసహితములైన మోక్షాదిపదవులు. ఎఱుకయేబంధమోక్షములుగాఁబట్టి వేదప్రమాణులైన జ్ఞానులు యోగులు భక్తులు మొదలగుమహాత్ములందఱు వేదాంతమైన యచలపరిపూర్ణబ్రహ్మమునుగనఁజాలక మాయాస్వరూపమైన యెఱుకయే బ్రహ్మమనియు, నాదేవుఁడెవ్వరికిఁ గనుపించఁడనియు, నానందస్వరూపమే దేవుఁడనియు, నాదబిందుకళలేదేవుఁడనియు, సచ్చిదానందుఁడనియు నానావిధములుగాఁబలికిరేగాని యవియన్నియు గాబారువాక్యము లనిచెప్పెను. ఆరామచంద్రుఁడు ముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని యతనిపాదములమీఁద వ్రాలి, మహాత్మా! మాయావాదులవచనములనమ్మి దేవరవారితో వాదించిసంభాషించితిని, నాతప్పుక్షమించి యాహరిశ్చంద్రచక్రవర్తిని జననమరణ ప్రవాహమునుండిదొలఁగించినట్లు నన్నుఁ దప్పించుభారముమీదియని పెక్కువిధములవినుతించి, మహాత్మా! యింద్రజాలపుఁగథలుమిగుల రమ్యముగాను వినోదముగను నున్నవి. నామనం బింకను నింద్రజాలమునే వినఁగోరుచున్నది. నలచక్రవర్తిదినములలో నాయింద్రజాలకులువచ్చి గావించిన వినోదములంతయును జెప్పుఁడనిప్రార్థించిన నామునీంద్రుండిట్లనియె.

మొదటికథముగిసెను.

---

—*(నలచక్రవర్తికథ)*—

శ్రీరామచంద్రా! వినుము, తొల్లినలచక్రవర్తియఖండమండలాధిపతియైభూమండలమంతయును బాలించుచు, నొకనాఁ డంగవంగకళింగ



బంగాళఘూర్జరసౌరాష్ట్రకాశ్మీరపతులును, నష్టమంత్రులును, విద్వజ్జనంబులును, నార్యులును, దన్నుంబరివేష్టించియుండఁగానిండుకొలువు కూటంబునం గూర్చుండెను.

ఆసభకుఁబద్మనాభుండను నింద్రజాలకుఁడు వచ్చి జాలమును గావించి ప్రభువునుంజూచి, రాజేంద్రా! నేను బీదబ్రాహ్మణుండను, నా పేరు పద్మనాభుఁడు, వేదాంతప్రవర్తకుండను, నాయందు వైదికము మెండుగాఁగలదు, నాకిప్పుడు సంభవించినదుఃఖమునువిని నన్నాదరించి కాపాడవలయును. నాభార్య విమలాంగియను సుందరీమణిని మత్స్యదేశమునుండి వెంటఁబెట్టుకొనివచ్చుచు మొన్నటిరేయి యడవిలోని వటవృక్షముక్రిందం బరుండినిద్రించితిమి, సూర్యోదయమున నిద్రలేచి చూడఁగా నాభార్యలేకపోయెను, నాకుభయమును శరీరకంపమును గలిగితడఁబడుచు, నోటఁదడిలేక యాసమీపమందుండిన మిట్టపల్లములం బొదలం దిరిగిచూచిచూచి యెందునుగనుపించనందున గొప్పకంఠధ్వనితోఁ బిలుచుచు, కుయ్యోమొఱ్ఱోయని పేరెలుంగున నేడ్చుచు, నాసాయంసమయమువఱకు నాచుట్టుప్రక్కల వెదకి యెందునుంగానక రోదనశబ్దములను జేయుచువచ్చితిని. అకటా! అట్టిదివ్యసుందరియును, బతివ్రతాశిరోమణియునునైన భార్యనువిడిచి నేనెటులజీవించియుందును? అట్టికులాంగనను మోసపుచ్చి యెవరు దోడ్కొనిపోయిరో, లేక మృగములచేతంజచ్చెనో, లేక నన్నుంగనఁజాలక యడవియందే దిరుగుచు నేడ్చుచుండెనో, నేనేమిచేయువాఁడను? మీకంటెనునాకు దిక్కెవ్వరు? నన్నురక్షించుభారము నీదియనిపలికినఁ బ్రభు వాబ్రాహ్మణుని నాదరించి, మహాత్మా! నీవువిచారపడవలదు, నీభార్య ప్రాణసహితమై యెందుండిననురప్పించి నీకిచ్చెదనని వాగ్దత్తముచేసి, చిత్రలేఖకులను బిలిపించి, యాబ్రాహ్మణుఁడుచెప్పిన గుఱ్ఱులప్రకారము పటములనువ్రాయించి, తనదూతలయొద్దనిచ్చి మీరు నలుదిక్కులకుంబోయి యడవులు కొండలు బిలములు పట్టణములు గ్రామములు దిరిగి యాగుఱ్ఱుల ప్రకార మాబ్రాహ్మణినింగనిపట్టి తోడ్కొనిరండని యుత్తరువిచ్చెను.

అంత నాయింద్రజాలకుఁడు ప్రభువునుంగాంచి, పుణ్యాత్మా! భార్యావియోగ మెట్లుభరింతు? దానిరూపము నాకన్నులకుంబొడగట్టు

చున్నది. నేనునుబోయివెదకివచ్చెదను. ఇంతలోపల నాభార్యవచ్చిన యెడల దాని నెందునుబోనీయక భద్రపఱచి దేవరవారివాగ్దత్తమును నెఱవేర్చుకొనుఁ డని చెప్పిపోయెను. అంతంగొంతసేపటికి కొందఱు భటులు పరుగునవచ్చి యాప్రభువునకు నమస్కరించి, దేవరవారి యాజ్ఞప్రకారము మే ముత్తరపుదిక్కునకుంబోయి వెదకుచు నందొక చెట్టుక్రిందంగూర్చుండి యేడ్చుచుండిన యాబ్రాహ్మణింగాంచి యా పటములోని గుఱ్తులన్నింటిని బరిశీలించి యాబ్రాహ్మణునిభార్యయని తెలిసికొని యామెవర్తమానమునువిచారించి, యమ్మా, నిన్ను నీభర్తకు నొప్పగించునటుల మండలాధిపతి వాగ్దత్తముచేసెను. మా యదృష్టమువలన మేముసమీపములోనే నిన్నుంబొడఁగంటిమి, పురిలోనికి రమ్మని మేమెంతసేపు ప్రార్థించిపిలిచినను నాయిందుముఖి వచ్చుటలేదనియును బ్రొద్దుగ్రుంకులోపలఁ దనభర్తరాకుండినఁ దానగ్నిలోఁబ్రవేశింతుననియును బలుకుచున్నది. మాలోఁగొంద ఱచటనే యున్నారు. మేము పరుగువచ్చితిమని చెప్పిరి. ఆరాజేంద్రుఁడు సభికులనుజూచి, మిత్రులారా! నే నాబ్రాహ్మణునకు వాగ్దత్తముచేసితిని. ఆబ్రాహ్మణుం డెచట వెదుకంబోయెనోతెలియదు, ప్రొద్దుగ్రుంకులోపలఁ దనభర్త రాకుండినఁ దానగ్నిలోఁబ్రవేశించునఁట, మనమిందుకేమిచేయుదము. ఏమికీడుసంభవించునోతెలియదు. ఇదియద్భుతపుఁగార్యముగానున్నది. మనమేపోయి యాలతాంగినిం దోడ్కొనివత్తము, లేకుండిన నన్నృత దోషము సంభవించుననియోచించి, యాచక్రవర్తిత్వరితముగమంత్రులను, ప్రధానసామంతరాజులను, విద్వజ్జనంబులను, బరిచారకులను వెంటఁబెట్టుకొని యాస్థలమునకుంబోయి యామెసుందరమునకునాశ్చర్యపడి, యమ్మా! నేను నచలచక్రవర్తిని. నిన్ను నీ భర్తకు నొప్పగించు నట్లువాగ్దత్తముచేసియున్నాను. బ్రాహ్మణ విశ్వాసపరుండను. పరస్త్రీలను బిడ్డలుగాభావింతును. నీవు సంశయింపక నీ తండ్రితో భాషించు నటుల నాతో భాషించి నీ వర్తమానమంతయుఁ జెప్పిపురిలోనికిరమ్మ. నీ భర్త నిన్ను వెదకుటకై మగుడ యడవికిం బోయెను. మాపో లేక రేపో వచ్చును. అంతవఱకుఁ బురిలోనికి వచ్చియుండుమనెను. ఆకంజదళాక్షి కన్నుల నీళ్లు దుడిచి కొనుచు ముఖమెత్తి ప్రభువునుం జూచి,

పుణ్యాత్మా! ‘‘బుద్ధిఃకర్మానుసారిణి’’ యను పలుకుప్రమాణము తప్పక నా కిట్టిదుఃఖముసంప్రాప్తమాయె. నన్ను నాతల్లిదండ్రులు మిగులఁ బ్రేమ తోఁబెనుచుచు, ధనవంతులను రూపవంతులను గోరుమని పెక్కువిధ ములఁ బ్రేరేపించి చెప్పినను నేను వినక వేదాంతి ప్రవర్తకుండును గుణవంతుండును దరిద్రుండునునైన భర్తనుంగోరి వివాహముచేసికొని మిగులఁ గష్టము లనుభవించితిని. మొన్నప్రాతఃకాలమున నిద్రలేచి జల మలబాధలుదీర్చుకొనుటకై యోచించి భర్తకు నిద్రాభంగముగావిం చుట పాపమనితలంచి, జలాశయమునకుంబోయి జలమలబాధలదీర్చు కొని పరిశుద్ధురాలనై వచ్చి చూడఁగా నాభర్తయచటలేనందున దిగులు పడి యెందుఁబోయెనో లేక మృగములవాతింబడెనో యనివెదకుచు, దిక్కులేనిపక్షివలెఁదల్లాడుచు, రోదనశబ్దములఁ జేయుచు, నిద్రాహార ములులేకవటించుచు, నీవృక్షముక్రిందఁగూర్చుండి దుఃఖించుచున్నాను. నేటిదినము ప్రొద్దుగ్రుంకులోపల నాభర్తరాకున్న నేనగ్నిలోఁబడుటకు యత్నించి యున్నాను. నేను బురిలోనికిరాను, సుఖముల నొల్లను. పుణ్యాత్మా! నన్నుఁబిలువవద్దుపొండనిపలికిన, నామండలాధిపతి, యమ్మా! యాబ్రాహ్మణునియందు లేశమైనఁదప్పులేదు, నిన్నుఁగాన కతఁడును, నతనింగానక నీవునుదుఃఖములనొందితిరేగాని యెవరియందునుదోషము లేదు, మీసంకటములు నేటితోనివర్తించెను. ఇఁకమీఁదుమేలుకల్గు టకుసందియములేదు. నీకుసారెలు, చీరలు,మాడలు, సొమ్ములు, నీవు కోరినట్టులిచ్చి నీభర్తవెంటఁ బ్రయాణముచేసియంపెదను. నామాట సత్యముగానెంచి నీభర్త వచ్చునంతవఱకు నీవు పురిలోనికి వచ్చియుం డుము. లేనియెడల నీ భర్తవచ్చునంతవఱకుఁ బ్రాణముల నిలుపుకొని యుండుమనిపలికిన, నాతలోదరి, రాజేంద్రా! సూర్యచంద్రులకు గతులు తప్పినను, నాకసము భూమిమీఁదం బడినను, భూమి దద్దరందిరిగిపాతాళ మునకంటినను, నేను నాప్రతిజ్ఞను జెల్లించక విడువననిపలికెను. అమండ లాధిపతికిభయమును దొట్రుపాటును దేహకంపమునుగలిగి, యోపతివ్రతా రత్నమా! నీవు నాప్రాణములను గాపాడవలయును. నిన్ను నీభర్తకు నొప్ప గించునటుల నాబ్రాహ్మణునకు వాగ్దత్తము చేసియున్నాను. అదినీవు తప్పిం చుటచేతనాకుఁబ్రాణాంతమవును.దీర్ఘాలోచనచేయుమనిప్రార్థించెను.

అంతట మింటియందుఁ గూతలార్భాటములును సింహనాదము లును, గర్జింపులు వీరాలాపంబులును ధనుష్టంకారంబులును విశేష ముగాఁగలిగి, దిక్కులు ప్రతిధ్వనులిచ్చునట్లు వినవచ్చెను. ఆరాజేం ద్రుఁడు తనసభికులనుజూచి, మంత్రులారా! మింటియందు దేవదాన వులకు యుద్ధముసంభవించినట్లులున్నది, మనశిరస్సులకుఁబైగానే యు న్నటు లున్నది. అందువలన మనకేమి యుపాధిసంభవించునో మనమం దఱము చెట్లమఱుగున నుందమనిచెప్పెను. ఆసభికులును సరేయని యందఱు ఛత్రములనుబట్టుకొని చెట్లమఱుఁగుననిలిచి చూచుచుండిరి. అంతట మహామేఘములు గర్జిల్లునట్లొకరితో నొకరు తిగ్గసభర్జనాదు లను జేయుచు, రుధిరములను దొఱఁగించుటను, దునిసిపడెడు కాలు సేతులను, ప్రేవులు వ్రేలాడుచుం బడెడువికృతములైన గాత్రములను, బంట్లుగొఱుకుచుంబడెడు శిరస్సులనుజూచి యారాజేంద్రునకును, సభి కులకును నోటఁదడిలేక చిత్రించినప్రతిమలవలె నిలిచియుండఁగా, నా బ్రాహ్మణియాగాత్రములలోఁ దనపురుషుని శరీరమును, నా శిరస్సుల లోఁదినభర్తశిరస్సునుదెచ్చి యాప్రభువునకుం జూపి, రాజేంద్రా! నాభర్తనిజముగా వచ్చునని చెప్పితిరే? దురాత్ములెవ్వరో నాప్రాణ నాథుని రెండుతుండెములుగా ఖండించి భూమిమీఁదం బడవైచిరి. ఇట్టి యన్యాయమెందైనను గలదా? నేనేమిచేయుదానను! ఈ ఘోరకృ త్యముఁజూచి యెట్లుసహింతును? భర్తవియోగమెట్లుభరింతును?నని భూమి మీఁదంబడి ఘోరముగా విలపించుచుండెను. ఆమండలాధిపతియును, సభికులును, నాబ్రాహ్మణుని శిరస్సును, శరీరమును జక్కఁగాఁ జూచి గుఱ్ఱుపట్టి, యకటా! యీ యకృత్యమెవ్వరుచేసిరి? ఇది యేమి యన్యా యము? ఇందుకు మనమేమిచేయవచ్చు? నని మనంబునయోచించి చింతించుచుండఁగా, నాబ్రాహ్మణిలేచి నేనొక నిమిషమైన నీదుఃఖమును భరింపఁజాలను, భర్తతోడ సహగమన మర్యాద ననిపలికి యాచెట్ల క్రింది యాకులను, సమిధలను ప్రోగుచేసి యగ్నిదేవునిఁ బ్రార్థించి, యగ్నిదరికొలిపి పురుషశరీరమును శిరస్సును, నాయగ్నిలోఁ బడవైచి వలదువలదని ప్రభు వెలుఁగెత్తిచెప్పినను వినకయామాయలాడి యా యగ్నింబడి భస్మమాయె.

అంత నా సభికులందఱు ప్రభువునుంజూచి దేవరవారికి, విపత్తు తొలఁగెను. ఆయిరువురునశించుటచే మంకుమేలుగలిగెను. పురిలోనికిం బోదము రండనిపలుకుచుండఁగా, నాబ్రాహ్మణుఁడు పరుగునవచ్చిప్రభువు నెదుటనిలిచి, రాజేంద్రా! నేను పద్మనాభుండను బీదబ్రాహ్మణుఁడను, నాభార్యయూరిబైటనున్నదనియు, దానిందోడ్కొనివచ్చుటకై ప్రభువు సభికులతోడం బోయిరనియు భటులు చెప్పఁగా విని పరమానందము తోడఁ బరుగునవచ్చితిని. ఆబ్రాహ్మణి యెందున్నది? ఆహా! నేను జూచియానందింతు నని పలికెను. ఆమండలాధిపతియును సభికులును నాబ్రాహ్మణునిఁ జక్కఁగాఁజూచిగుండెలుఝల్లని భయాశ్చర్యములుగల వారలై నోటమాటరాక నివ్వెఱపాటుతో నిలిచియుండినంజూచి, యా బ్రాహ్మణుఁడు దుఃఖావేశముతో, రాజేంద్రా! దేవరవారు నాతో భాషించక, నామాటకుబదులు చెప్పక దిగులుపడియుండుటకుఁ గారణమేమి? నాముద్దులభార్యయెందున్నది? త్వరితముగఁజెప్పకుండిన నా ప్రాణములు నిలువవు, దుఃఖము పొర్లిపొర్లి వచ్చుచున్న దనిపలికిన, నతఁడు తనదుఃఖ మడఁచికొని జరిగినవర్తమానమంతయు వినిపించిన, నాబ్రాహ్మణుఁడు రౌద్రాకారుండై పండ్లు పటపటం గొఱుకుచుఁ దనచేతినెమిలి యీకలకుంచెను భూమిమీఁదంబడవైచి, యోహోహో! యిట్టియన్యాయ మెందైనను గలదా? దేవదానవులకు మింటియందు దారుణమైనయుద్ధముగలుగుటెట్లు? ఆహా! యిదివింతకార్యముగానున్నది, మానవుండనైన నాకళేబరమును, శిరస్సును, దేవదానవుల గాత్రశిరములతోడభూమిమీఁదంబడుటకుఁ గారణమేమనియు, మానవుండెట్లు మింటికింబోయెననియు, బిడ్డలకుసహితము తెలియవచ్చునే! ఇట్టియన్యాయము మీకెందుకుఁదెలియఁబడకుండెను? ఆహా! మీమాటలుమిగులఁ జిత్రములు, నేనెట్లునమ్మును? బొంకినను జక్కఁగా బొంకవలయునేగాని యిట్లుబొంకంగూడునా? నిన్నుఁబరస్త్రీపరధనాపేక్షలులేని సత్యవంతుఁడ వనినమ్మితిని. అకటా! గౌతమునిభార్యను దేవేంద్రుఁడును, గురుపత్నినిఁ జంద్రుఁడును వ్రతభంగముగావించియు నంతటితోఁ దృప్తిపొందకదాని విడఁజాలక, రహస్యప్రదేశములోదాఁచి యగ్నిలోఁబడి భస్మమాయెనని యబద్ధమాడుచున్నావుగాని నిజమైనవర్తమానముకాదు. చిత్తవ్యాప్తి

వలన దోషమే కాని శరీరవ్యాప్తివలన దోషము కలుగనేరదు. ఇంతటి దైన నాధర్మపత్నిసంపర్కము వల్ల వానియందు దోషమెంచక నిన్ను దీవించి నా దేశమునకుం గొనిపోవుటకు సిద్ధపడియున్నాను, నీవు నన్ను మోసపుచ్చుట న్యాయము కాదు, నా మాట నెవ్వరితోం జెప్పకొందును. అర్ధరాత్రివేళఁ బరమపతివ్రతయును, పుణ్యశాలినియు నైన నీభార్యను నడవుల పాలుగావించి యల్లాడఁబెట్టిన దుర్నీతిపరుండవని తెలిసియును, బుద్ధిహీనతచేత నన్ను నమ్మిపోయినందులకుం దగిన ప్రాయశ్చిత్తమును గావించితివని పలికి పొర్లిపొర్లి యేడ్చుచుండెను. ఆచక్రవర్తియును సభికులును, నేమియుం బలుకనేరకుండిరి. అంత నాయింద్రజాలకుఁడు లేచి ప్రభువునుం జూచి, పుణ్యాత్మా! దేవరవారు బదులుమాట చెప్పకుండుటకుం గారణమేమనిన, నతఁడు, బ్రాహ్మణోత్తమా! నేఁజెప్పినదంతయు నిజము లేశమైన నబద్ధముండనేరదు, నీకోపమునకు వెఱచుచున్నాను, శాంతమును బొందుము, నాపురిలో నీకిష్టమైన కన్నియను వివాహము గావింతును, సువర్ణరత్నభూషణములను, మోయునంతధనమును, నగ్రహారములను, వేయిధేనువులను నిత్తునని పలికిన, నా యింద్రజాలకుఁడు, రాజేంద్రా! నాకు వివాహము వలదు, సత్యసంధుండవును ధర్మాత్ముండవును, బ్రాహ్మణ విశ్వాసపరుండవును, మండలాధిపతియు నైన నిన్ను దుఃఖావేశముతో దుష్టవచనములాడితిని, నాతప్పు క్షమించవలెను. అగ్నిదేవుఁడు నాకు మిత్రుఁడుగా నుండియు నా భార్యనెట్లు భస్మము గావించెను? అకటా! యతనికిం దెలియక నడచిన కార్యముగా నుండును. నాకా యగ్నిగుండము జూపుఁడని యచటికిం బోయి, సర్వభక్షకుండవైన యగ్నిభట్టారకా! నేను భస్మనాభుండను పేరుగల నీమిత్రుండను, పరమపతివ్రతయైన నాభార్యను దెలియక దహించినాఁడవు. ఈమండలాధిపతియైన బలచక్రవర్తి సత్యసంధుండయ్యెనేని నీవు నాభార్యను బునర్జీవితురాలింగాఁ జేయుమని యగ్నిసూక్తములతో నతనిం బ్రార్థించెను. ఆరాజేంద్రుఁడును, సభికులును నీబ్రాహ్మణుఁడు వెఱ్ఱివాఁడుగా నున్నాఁడు, వైదికబ్రాహ్మణునకు నేపకాయంత వెఱ్ఱియుండునన్నసామెత నిజముగానే యున్నదని, యొకరితో నొకరు చెప్పకొనుచు నాయగ్నిగుండమును జూచుచుండిరి. అంతనా మాయలాడి సుపూర్ణచంద్రికవలె

సాయగ్నిగుండములోనుండి బైటవచ్చినంగాంచి, యా మండలాధిపతి యును సభికులును ముక్కులమీఁద వ్రేళ్లు పెట్టుకొని, ఆహాహా! యితఁడు సామాన్యుఁడుగాఁడు దేవోత్తముం డని పెక్కువిధముల స్తోత్రపాఠము లం గీర్తించి నమస్కరించిరి

అంత నాయింద్రజాలకుఁడు ప్రభువును సభికులను దీవించి, పుణ్యాత్ములారా! నేనింద్రజాలకుండను, నావిద్యావిశేషమునుజూపితిని. ఈ బ్రాహ్మణిమాయలమాయ, తపోనిష్ఠుఁడనైన నాకు భార్యయెందుకు? మింటియందుఁ గలిగినయుద్ధమును, భూమిమీఁదం బడిన రుధిరమాంసాస్థులును, డొక్కలును, దలలును, నగ్నిగుండమును, బ్రాహ్మణియు, సర్వమునామాయవలన మీకన్నులకట్లు దోఁచెనని చెప్పెను. ఆరాజేంద్రుండును సభికులును నద్భుతమొంది యా బ్రాహ్మణియు యుద్ధభూమి సహా సర్వమును గాన రానందున విస్మయమునొంది, హాహా! మన మెన్నఁడిట్టిజాలమునుజూచి యెఱుంగమని యావిప్రునిం గొనియాడి పురిలోనికి వెంటఁబెట్టుకొనిపోయి యతనికి విందులు గావించుచుండె నని చెప్పిన, నారామచంద్రుఁడు ముఖవికాసముతో మునీంద్రునింజూచి, పావనచరితా! నలచక్రవర్తి యీబాలముతోనే తృప్తిపొందెనా? లేక మగుడి దానిం బరీక్షించెనా? యెఱిఁగించవే యనియడిగిన, నావసిష్ఠమహర్షి, శ్రీరామచంద్రా! సత్యము జనవిరోధమనియు, నసత్యముజనరంజకమనియుఁ బలుకుశ్రుతివాక్యములు దబ్బరగునా? సత్యమనునది మిగులఁజేదు. ముష్టికాయవంటిది. లేశమైనను దీపులేదు. సుఖములేదు. ఆనందములేదు. పంచలోహములును నవరత్నములును లేవు. కాఁబట్టి యదిజనులకువిరోధము. ఇదియే యచలపరిపూర్ణబ్రహ్మము. ఇదియేలోకవిరుద్ధము. అసత్యము మిగుల రుచ్యము, మధురము విశేషము. పంచలోహములును నవరత్నములును గలిగియుండును. మిగుల సుఖానందమును బొందించును గాఁబట్టి యిదిజనులకురంజకము. ఇదేయెఱుక. ఇదియే భ్రమరూపంబైనమాయ. ఇంద్రజాలము స్వప్నమువంటిది. ఇట్టివినోదమైనయింద్రజాలమును మగుడి దర్శించక నలచక్రవర్తి యేలవిడుచును? ఆ రాజేంద్రుఁడా మఱునాఁడు కొలువుకూటమునంగూర్చుండి యాయింద్రజాలకునింజూచి, మహాత్మా! నీ విద్యావినోదమును జూపుమనిన నతఁడు

ప్రభువునుం గాంచి దేవరవారికని నైదుగురుమంత్రులకును, నాల్గురు
సామంతరాజులకును మహేంద్రజాలముగావించెను. మీరుపన్నిద్దఱు
జాగ్రతగానుండుడనిపలికి తనహస్తమందుండిన నెమిలియీకలకుంచెను
వారిమొట్టనుద్రిప్పి చిత్తసంకల్పమును బొందించెను.

ఆవెంటనే ప్రభువునకును మంత్రులకును సామంత రాజులకును,
నిద్రమైకముగలిగి నేత్రములను మూసి, సువర్ణరత్న ఖచితమైన యొక
మంటపమును జూచి యాశ్చర్యపడి యామంటపములోనికింబోయి యం
దుండువింతలను జూచియచ్చెరువంది, యాసమీపమునం దిరుగుచుండిన
శ్వేతగజమును శ్వేతాశ్వములను జూచి మనకు సమముగా వాహన
ములు వచ్చియున్నవి. జీన కళ్లెములు మొదలైనవి యమర్చి యున్నవి
యెక్కుడనిచెప్పి రాజేంద్రుడు డేనుంగు నెక్కెను, సభికులందఱశ్వముల
నెక్కిరి. అంత నావాహనములు వారి నతివేగముగాం గొనిపోయి యం
దొకరమ్యమైన వనముసమీపముననడించి మటుమాయముగాం బోయెను.
చక్రవర్తియును సభికులును నాశ్చర్యపడి యాశృంగారవనములోనికిం
బోయి యందు వివిధకుసుమఫల భరితంబై మనోహరములై యొప్పు
చుండిన వృక్షలతాదులను జూచి వాసినుగంధతావి నాఘ్రాణించుచు,
మాధుర్యఫలములంగోసిభక్షించుచు, నావనమధ్యభాగమున నవరత్నసో
పానములతో నొప్పుచుండెడు దివ్యమైన సరస్సును జూచి యుద్భుతము
నొంది, యాసరస్సులోదిగిజలపానముచేసి, యాహా! యిదెవరివనమో,
యిదేలోకమోయని యొకరితోనొకరు సంభాషించుచు నావనమునకుం
బూర్వభాగమున నేత్రములకు మిఱుమిట్లుకొలిపెడు దివ్యమైనమేడను
గాంచి, దానియొద్దకుంబోయి, యెందునుద్వారమును గనిపట్టంజాలక
విస్మయమునొంది, యాహా! యిట్టిమేడను మనమెన్నడుం జూచి యె
ఱుంగము, మనభాగ్యవశమున నేండీ వింతమేడను జూడంగంటిమి, దీని
లోపల నెవరుందురో తెలియదు, దీనికిద్వారమెందును గనుపించలేదని
యాలోచించుచుండంగా, నచటికొకపురుషుండు వచ్చి యాచక్రవర్తికి
నమస్కరించి, పుణ్యాత్మా! దేవదేవుండగు మహేంద్రునిపుత్రియైన
త్రిలోకమోహిని యను కన్యకారత్నము త్రిమూర్తులను నింద్రాదిదేవత
లను గోరక భూలోకచక్రవర్తియైన నలమహారాజునుం గోరుటచేత

నామహేంద్రుఁడు ద్వారములేని యీమేడలోఁ దనపుత్రినుంచెను. ఆ కాన్యకామణికిని దానిచేడియలకును క్షుత్పిపాసలులేవు, ముదిమిలేదు, ప్రొద్దుగ్రుంకినసిదపఁ దెల్లవాఱుపర్యంతము దివ్యవాద్యములను జేయుచు, శ్రోత్రముల కానందముగాఁ బాడుచుండును. త్రిమూర్తులును నింద్రాది దేవతలును వచ్చి వినుచుందురని చెప్పిపోయెను.

ఆసలచక్రవర్తి తనసభికులనుజూచి, మిత్రులారా! మీరీవింత సమాచారమునువింటిరిగదా యని చెప్పి యానందించుచుండఁగాఁ బ్రొద్దు గ్రుంకెను. ఆమేడలోనుండి దివ్యవాద్యములరవములును, మనోహరము లైనపాటలును వినవచ్చిన, నతఁడును సభికులును నానందముగావిను చుండిరి. అంత నామేడయొద్దకుం ద్రిమూర్తులు వారిభార్యలతోడను, నష్టదిక్పతులు వారిపత్నులతోడనువచ్చి శ్రోత్రానందముగవినియానం దించి సలచక్రవర్తియొక్క భాగమేభాగ్యమని యతనింగీర్తించి వారి వారిలోకములకుంబోయిరి. తెల్లవాఱినపిమ్మట నామహేంద్రుఁడు చతు రంగబలంబుల తోడను, మంగళ వాద్యములతోడను నామేడకువచ్చి భూలోకచక్రవర్తిని నతనిసభికులనుదీవించి, యామేడకు ద్వారమును గావించి, పుత్రికారత్నమా! నీవుకోరిన యానలచక్రవర్తివచ్చెను, నీవు బైటవచ్చి చూడు మనిపిలిచిన, నాత్రిలోకమోహిని తనదేహకాంతు లనేక సూర్యచంద్రులపగిదిఁ బ్రకాశించునట్లు నేత్రములకు మిఱుమిట్లు గొలుపుచు, నుత్సాహముతో బైటవచ్చినం జూచి భయభ్రాంతులై నేత్రములనుమూసికొని నిశ్చేష్టితులై నిలిచిన యాచక్రవర్తిసభికులను జూచి, యాయిందుముఖి యారాజేంద్రునిముఖమునందుఁ బన్నీరుచల్లి కంఠమునఁ బుష్పహారమునుధరింపఁజేసి వారివారి విమానములమీఁదం గూర్చుండఁబెట్టుకొనిరి. మహేంద్రుఁడు వారి నందఱిని మంగళవాద్య ములతోడం బురిలోనికివెంటఁబెట్టుకొనిపోయి త్రిమూర్తులనునింద్రాది దేవతలను సప్తమహర్షులనురావించి ముహూర్తము నిశ్చయించి పురి శృంగారమును గావించి శుభదినంబున వివాహ మహోత్సవములు గావించెను. ఆత్రిలోకమోహిని తనభర్తను వివిధలోకములకుం గొని పోయి పూఁబొదరిండ్ల యందును, సైకతభూముల యందును, కేళీకా గృహములయందును, సుఖింపఁ జేయుచు నెల్లవినోదములను జూపించి

ఐశ్వర్యభోగము నొందించుచుండెను. ఆచెలికత్తియలును దమభర్తలను సుఖింపఁజేయుచు నానందాబ్ధిలో నోలలాడించుచుండిరి. ఆసభికు లొక నాఁడు ప్రభువును గాంచి, రాజేంద్రా! మన మీలోకమునకు వచ్చి యిరువది సంవత్సరములాయెను, మన కేమియుఁ దోఁచఁబడక మిగుల సుఖానందముతో నుంటిమి. ఇఁకనైన మనలోకమునకుం బోకుండిన లోకులచేత నిందింపఁబడుదు మనిపలికిన, నాచక్రవర్తి యాశ్చర్యపడి, యయ్యో! యిరువదిసంవత్సరములాయెనా! మహదానందముతో నుంటిమి, భూలోకమున మనకింతటి సుఖముగలుగునా! ఎన్నటికైనం బోకతీఱదు. మీరును యత్నముతో నుండుఁడని చెప్పి యారాజేంద్రుఁడు తన యిష్టమును భార్యకును మామకును దెలియపఱచెను. ఆమహేంద్రుఁడు వ్యసనపడి చక్రవర్తిని సభికులను నాలింగనముచేసికొని, యల్లునకు దివ్యరత్న కిరీటంబును, సూర్యచంద్రహారములను, దివ్యమాణిక్యములను, సభికులకు వెలలేనివస్త్రాభరణము లనిచ్చి దేవవిమానములమీఁదం గూర్చుండ నియమించెను. ఆరాజేంద్రుఁడును సభికులును వారివారి భార్యలతోడఁ గూర్చుండిరి. ఆవిమానము లన్నియు, భూలోకమునకు వచ్చి నిలిచిన, నాచక్రవర్తియు సభికులును వారివారి భార్యలతోడ విమానములనుదిగి, మంగళవాద్యములతోడం బురిప్రవేశమయ్యెదమని యోచించి, వానిసిరప్పించి ప్రభువుపట్టపుటేనుఁగునెక్కెను. సభికులు తురగములనెక్కిరి, త్రిలోకమోహిని ముత్యాలకుచ్చులపసిఁడి పల్లకిలోఁ గూర్చుండెను. చెలికత్తియలు సామాన్యపల్లకీలలోఁ గూర్చుండిరి. పుణ్యస్త్రీలు మంగళములు పాడుచు వెంబడిరాఁగా, మంగళవాద్యములతోడఁ బురిలోనికిం బోవుచు నాయింద్రజాలకుని మహిమవలన నందఱు నేత్రములను దెఱచి యేమియుఁగానక విభ్రాంతినొంది యొకరిముఖ మొకరు చూచుకొనుచుండిరి. ఆరాజేంద్రుఁడు సభికులనుజూచి, మిత్రులారా! మన మెక్కిన వాహనములును, మన భార్యలును, వా రెక్కిన పల్లకీలును, పుణ్యస్త్రీలును, మంగళవాద్యములును నెందుఁబోయెను? మన మీసభయందే కూర్చుండియుంటి మిటకుఁ గారణమేమని యడిగిన, నాసభికులును దిగ్భ్రమఁజెంది మా కేమియుఁ దోఁచలేదు, మనభార్యలెందుఁబోయిరి? ఇది మిగుల మటుమాయముగా నున్నదని పలికి తక్కిన సభికులకుజరిగిన

వర్తమానమంతయు సాంగముగాఁజెప్పి మీరు మాభార్యలను జూడలేదా? యనియడిగిరి. తక్కినమువ్వురు మంత్రులును సామంతరాజులును బకపక నవ్వుచు, నోహో! యిది మిగులఁజిత్రము. మీరు నేత్రములను మూసికొని యైదునిమిషములై యుంటిరి. ఇంతలోపల దేవలోకమునకుంబోవుటెట్లు? దేవకన్నియలవివాహము చేసికొని యిరువది సంవత్సరములుండుటెట్లు? మిగుల సుఖానందము లనుభవించుటెట్లు? సర్వముదబ్బర. అంతయువాలిక్కి. ముందుమీరుధరియించిన వస్త్రాభరణములేగాని, మహేంద్రుఁడిచ్చిన వస్త్రాభరణములు కావు. నిజము కొంచెమైనను లేదు. ఈయింద్రజాలకుని మహిమగా నుండునని పలికిరి. ఆయింద్రజాలకుఁడు, రాజేంద్రా! దేవరవారినిసభికులను, జాగ్రతగా నుండుఁడనిచెప్పి మహేంద్రజాలము గావించితిని, నావిద్యావిశేషము వలన మీచిత్తము లటుల వ్యాపించెను గాని మీశరీరము లెందును బోలేదు, చిత్తవృత్తియనిచెప్పెను. ఆమండలాధిపతి, యోహో! యిది యేమివింతకార్యము మేము దేవలోకమున భార్యలతోడ ననుభవించిన యనుభవ మంతయు నేత్రములనుదెఱచిన నేమియును లేకపోయెను. ఆహా! యిదిమిగులఁజిత్రమని వారువారుధరియించియుండిన వస్త్రాభరణములనుజూచుకొని యచ్చెరువంది ముక్కులమీఁద వ్రేళ్లుపెట్టుకొని యద్భుతమునొందుచు, నాయింద్రజాలకునిఁ బెక్కువిధముల వినుతించి, యతఁడు కోరినవస్తువులను నగ్రహారములను ధనమును నిచ్చిపుచ్చెనని చెప్పెను. ఆరామచంద్రుఁడద్భుతమునొంది, మునీంద్రా! మహేంద్రుఁడెవ్వఁడు? త్రిమూర్తులు నింద్రాదిదేవతలు నతినింగొలుచుటకుఁ గారణమేమి? కనుపించిన శరీరములన్నియు నెందుండివచ్చె? నెందుఁబోయె? నాకుదయతో నెఱింగింపుఁడనినఁ జిఱునగవుతో నామునీంద్రుఁ డిట్లనియె:

రాజేంద్రా! మహేంద్రుఁ డనఁగా మాయ యెఱుఁగుము. అతఁడు తల్లిదండ్రులులేక తనంతటఁదానే వచ్చిన మూలమాయ. అతఁడేభ్రాంతిస్వరూపకమైన మాయాశబలితబ్రహ్మము. ఆమహేంద్రునకుమూలము లేదు. ఆమాయకునివలనఁజిదాకాశమును, పంచబ్రహ్మలును, త్రిమూర్తులుసహా దేవతలును, నర మృగపక్షి క్రిమికీట కాదులును, వృక్షలతాదులును బుట్టెను. అనఁగా భ్రాంతివలన నటులఁ దోచెను, సర్వము

మాయ. పదవులుమాయ. లోకములు మాయ. ప్రపంచము మాయ. మాయకుమూలము లేదు. మూలము లేని దానికి నిల్కడయును లేదు. ఇంద్రజాలముభంగిఁ గనుపించుచుండును ఈరొమెటుక లేనిదిగనుక నెవ్వరి కిని గనుపించదు. యుగములపర్యంతముసమాధినిష్ఠులుగావించిన మహార్షు లెవ్వరు నాత్మను నిల్కడగా దర్శించలేదు. ఆత్మఁడేరొమెటుక. అతఁడే మహేంద్రుఁడు. అతఁడే భ్రమరూపకమైన మాయ. అతెఁడేమూలము లేనివాఁడు. త్రిమూర్తులు, నింద్రాది దేవతలుసహా సర్వజనులు నతని మాయను గనఁజాలక తపించుచుందురు గనుకనే, త్రిమూర్తులు నతని సేవించుచుందురు. పఁడేఁడుపదునాల్గులోకములకు నామాయకుఁడేకర్త, గిల్లిదంద్రులులేకయే యీమాయకుఁడు తనంతటఁ దానే వచ్చుటను బట్టియతనికి మూలమును, నిల్కడయు లేదు. కలలోశరీరము లెందుండి వచ్చెను? ఎందుఁబోయెను? రప్పించిన వారెవ్వరు? ఎవ్వరుపొమ్మనిరి? మూలములేకతనంతటఁదానే వచ్చితనంతటఁదానే కొన్నిసంవత్సరము లుండి తనంతటఁదానేపోయెను స్వప్నమునకును నింద్రజాలమునకును భేదములేదు. కలయందును నింద్రజాల మందును వచ్చిన శరీరములు మేల్కనినమేమిలేదు. సర్వముభ్రమ. ఈపరిపూర్ణమునకంటె నేమిలేదు. అంతయునీబట్టబయలు దీనికంటె నేమిలేదు. త్రాటియందుఁ జలనము లేనిదే సర్పభ్రాంతి పుట్టుచున్నది. కాఁబట్టి యచలపరిపూర్ణబ్రహ్మము వలన నీమాయరొమెటుకపుట్టనేలేదు. పుట్టించుఁ బడను లేదు. రాకపోక లకు భ్రమయేకారణము. పంచమహాభూతములుమాయ. పంచశక్తు లుమాయ. పంచబ్రహ్మలుమాయ. పంచలోహములుమాయ. పదవులు మాయ. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు మాయ. ప్రపంచములు మాయ. నవరత్నములుమాయ. మాయయందే తీపున్నది. అచలమందుఁదీపించు కైపనులేదు, ముష్టికాయవంటిది. సత్యముజనులకువిరోధము. అసత్యము జనరంజకము, గాఁబట్టి యీపరిపూర్ణమునకంటె నేమిలేదు. అంతయు మాయశక్తి. సర్వముడబ్బర. దేవత్వమనఁగాద్వైవికము; అదికల్ల. రూపనా మంబులుమిధ్య. అబద్ధపుఁబంచాంగమున కలువదిగడియలు త్యాజ్య మని చెప్పినట్లు స్వప్నమున వచ్చిమేల్కొనినం బోవువారును స్వప్న మందేపోవువారును, రాకపోకలుగలవారును దేహమునుమానమును

నామమును బొందిన వారును దేవులు గారు. దేవుఁడు నిర్వికారుఁడు గనుక నేవికారము లేనివాఁడు, బ్రహ్మయు విష్ణువును శివుఁడును శక్తియు మహాశక్తియు మొదలగుదేవతలందఱు నబద్ధపుఁ బ్రపంచమునకు దేవులుగానేయుందురు. కాఁబట్టి ప్రపంచమునకంటెను వారియందేమి సత్తయుండును? ప్రపంచముతోడ నాదేవులును దబ్బర దేవులుగాఁ దెలియుము. సర్వ మబద్ధము. సర్వము భ్రమ. భ్రమకు మూలము చిత్తుఁడు. ఆచిత్తుని వృత్తులే ప్రపంచమును, స్వప్నమును, నింద్రజాలమును. నేత్రములమూసినయెడలఁ బ్రపంచము లేకపోవుచున్నది. నేత్రములను దెఱచిన స్వప్నమును నింద్రజాలమును లేకపోవుచున్నవి. చక్కఁగా నాచార్యుని కటాక్షముచేత విచారణచేసినవారికి నెండమావులందు నీరులేనటుల, నచలపరిపూర్ణ బ్రహ్మమందుఁదోఁచెడు నీప్రపంచమే లేక పోవుచున్నది. ప్రపంచరహితమే ప్రకృతిద్వయదోష రహితము. ప్రకృతిద్వయదోషుఁడే శ్రీసదాశివుఁడు. ప్రకృతిద్వయదోషుఁడే శ్రీమన్నారాయణమూర్తి. ప్రకృతిద్వయదోషుఁడే బ్రహ్మ. ప్రకృతిద్వయదోషుఁడేసృష్టికర్త. ప్రకృతిద్వయదోషుఁడేపోషణకర్త. ప్రకృతిద్వయదోషుఁడేసంహారకర్త. కార్యకారణములరెంటికిఁ బ్రకృతిద్వయముండుటనుబట్టి వారే దోషులు. జననమరణములు, సుఖదుఃఖములు, బంధమోక్షములు గలవారు. జననమరణ ప్రవాహమునుండి దప్పింపఁబడువారుగారు. ఉపాధిద్వయ దోషరహితుఁడే యీశ్వరుఁడు, వికారము లేనివాఁడేయీశ్వరుఁడు. వికారరహితమేపరిపూర్ణము. వికారరహితమే పరమపదము. పరమపదమనఁగాఁజావుపుట్టుకలులేని యిరువదియాఱవది యైన పరతత్వ మగుటంజేసి దానికి మితిమేర లుండవు. కల్పనారహితమైన పరతత్వ మనిచెప్పిన నారామచంద్రమునీంద్రుని బెక్కువిధముల వినుతించి, త్రిలోకపావనుండవైన మునిసత్తమా! మనంబింకను నింద్రజాలపుఁ గథలనే వినఁగోరుచున్నది. పురుకుత్సచక్రవర్తి దినములలో నింద్రజాలకులువచ్చి యేమేమివింతలనుగావించిరి? ఆజాలమంతయు నాకు సాంగంబుగ వినుపించుమనివేఁడిన నామునీంద్రుఁడిట్లనియె.

నలచక్రవర్తికథ ముగిసెను.

---

పురుకుత్స చక్రవర్తికథ.

శ్రీరామచంద్రా! తొల్లి పురుకుత్సచక్రవర్తిమంత్రులును, సామంతరాజులును, విద్వజ్జనంబులును గొలువ నిండుకొలువు కూటంబునం



కూర్చుండియుండఁగా నాసభకు నింద్రజాలకుఁడు వచ్చి ప్రభువునకుఁ దనవర్తమానమును జెప్పుకొనుచుఁ జేతిలోని నెమలియీఁకలకుంచెను ముమ్మారుద్రిప్పి చిత్తసంకల్పమునొందించెను. ఆవెంటనే రాజేంద్రుఁడు నిద్రచే మైమఱచి నేత్రములు మూసెను. మంత్రులును సామంతరాజులును బ్రభువునకు నిద్రాభంగము కలుగఁగూడదని నిశ్శబ్దముగా నుండిరి. ఆరాజేంద్రునకుఁ దనసభయు సభికులును గొప్పవెలుఁగుచు గనుపించెను. ఆహా! యిదియేమి వెలుఁగు! అని యూహించుచుండఁగా శ్రోత్రములకానందముగా దివ్యవాద్యములరవములు, గజ్జలధ్వనులును వినవచ్చినందున నతఁడద్భుతము నొందవిశేషములు పరికించుచుండెను. అంతటఁ గ్రొక్కారు మెఱుపుఁదీగలవలె, నలువురు దేవకన్నియలు వచ్చి నమస్కరించి, రాజేంద్రా! మేము దేవవేశ్యలము. రంభోర్వశీ మేనకా తిలోత్తమలను పేళ్లుగలవారము, దేవేంద్రుఁ డంపగా దేవరవారిం దోడ్కొనిపోవ వచ్చితిమి, మిమ్మాదరించి మావెంట దేవలోకమునకు రావలయును, దేవరవారి సభలో మేము గొంత నృత్యగీత గానములు చేయునటులనుత్తరువిండని యతని యాజ్ఞనుబడసి, యానలువురు వేఱువేఱుగా నృత్యగీతములనుజేసి యాప్రభువున కత్యంత సంతోషమును బుట్టించి, దేవవిమానము మీఁదం గూర్చుండఁబెట్టుకొనిపోయి, యందొకచోటవిమానమునునిలిపి దేవేంద్రునిసభకు వెంటఁబెట్టుకొనిపోయి, యితఁడే భూలోకచక్రవర్తియనిచెప్పిరి. ఆ దివిజపతి యతని నాలింగనముఁజేసుకొని సన్మానించి యుచితాసనముమీఁదం గూర్చుండఁబెట్టి, పుణ్యాత్మా! నిన్నుఁదోడ్కొనివచ్చిన యీనలువురు దేవవేశ్యలు, మా సభలోనృత్యగీతములనుజేయుదురు, నీవువారివిద్యలను జక్కఁగాఁబరిశీలించి యెవ రధికులో చెప్పవలయునని చెప్పి యావేశ్యలకు నుత్తరువిచ్చెను. అంత నానలువురును వేఱువేఱుగా వారిశక్తులనుజూపించి సభవారికి మిగుల నానందమును బుట్టించిరి.

దేవేంద్రుఁడు చిఱునగవుతో ధర్మదేవతయైనయమధర్మరాజుం జూచి, మహాత్మా! వీరిలోనెవ్వరధికురా? అనియడిగిన, నతఁడు రంభయధికురా లనిచెప్పెను. కుబేరుని నడిగిన నతఁ డూర్వశినిం జెప్పెను. అగ్నిదేవుని నడిగిన నతఁడు నలువురు సమానులే యని పలికెను

లెక్కించ వారందఱు వారివారికిం దోఁచినటులఁ జెప్పిరి. అంత నాదేవేంద్రుఁడు పురుకుత్స చక్రవర్తిని నడిగిన, నతఁడు తిలోత్తమ కడము మువ్వురి కంటెను మిక్కిలి ప్రమాణ మధికురాలని చెప్పెను. ఆదివిజపతి నీవు నిజముగాఁ జెప్పితి వని చేతులుదట్టుచు గొల్లునంగ్రించి యాలింగనము చేసుకొని దివ్యరత్నాభరణములను దేవతాశ్వమునునిచ్చి యా భూలోకచక్రవర్తినిఁ బ్రయాణముచేసియంపెను. ఆపురుకుత్సచక్రవర్తి యుత్కంఠతో సంతోషముతో నాదివిజపతికి నమస్కరించి యాదేవ తాశ్వమునెక్కి భూలోకమునకు వచ్చుచుండెను. ఆమాయా తురగము కొంతసేపు మెల్లఁగానడిచి పిమ్మట వాయువేగముగావచ్చుటచేత నతఁడు భయభ్రాంతుఁడై గుఱ్ఱముమీఁద నిలువఁజాలక తనశక్తికొలఁది కళ్లెమును బిగియంబట్టియు, నది నిలువనందున నా ప్రాణాంతమువునని రోదించి, దైవమా! నాప్రాణములను గాపాడుమని పెక్కు విధములఁ బ్రలాపించుచు, నో తిలోత్తమా! నీవిషయములో నిజము చెప్పినందుకై తక్కిన యామువ్వురు నాకిట్టిదురవస్థను గలిగించియుందు రేమో, నీవైనవచ్చి యాదరింపరాదా యనివిలపించుచు, సూర్యకిరణముల కోర్వలేక తపించుచు, క్షుత్పిపాసలకుం దపించుచు నేమియుఁదోఁచక యేడ్చుచుఁ, గుయ్యోమొఱ్ఱోయని కూతలు పెట్టుచు నాయశ్వమును బ్రార్థించుచు, నీప్రకారము భయోత్పాతమును దుఃఖమునొంది యా పట్టపగలింటి వేళఁ దనకెదుటం గనుపించిన వటవృక్షమును గాంచి, యాహా! యీమఱ్ఱిచెట్టువూడలను గట్టిగాఁబట్టుకొన్న నశ్వమునిలుచు నని మనంబునరోూచించి యతిశీఘ్రముగా రెండుహస్తములతో రెండూడలను గట్టిగాఁబట్టుకొనెను. ఆయశ్వము పోఁజాలక నిలిచి త్వరితముగాఁ గ్రిందికిఁ బ్రాలి యాప్రభువును బ్రేలాడు నటులఁజేసి యది వేగముగాఁబోయెను. ఆమండలాధిపతి తనగుఱ్ఱముపోవుటను జూచి వెఱఁగుపడి, యోహో! యిదియేమి యన్యాయము! మన తలంపులేవి, జరిగినదేవిని దుఃఖించుచు, నీయూడల గట్టిగాఁ బట్టుకొనకున్న భూమి మీఁదంబడి ప్రాణములను బోఁగొట్టుకొందునని యు, నెంతకాలమిటుల వ్రేలాడుదునని యు, జేతులోర్వఁజాలవే యనియు మిగుల దుఃఖమును బొందుచుం బ్రాణమును జిక్కఁబట్టి, చేతులసత్తు గట్టిగాఁ బట్టుకొని

దైవమును నిందించుచు నేడ్చుచు నుండెను. ఆయెడ నొక చండాల
కన్నియయివిని యచటికి వచ్చి వ్రేలాడుచుండిన యాప్రభువునుం జూచి,
పుణ్యాత్మా! మీరిటుల వ్రేలాడుచుండుటకుఁ గారణమేమనియడిగెను.
అతఁడు, పుణ్యాత్మురాలా! కారణమును వెనుకఁ దెలిసికొందువు గాని
త్వరపడినన్ను రక్షించుమని ప్రార్థించిన నాకన్నియ, స్వామీ! నేను
మాలదానను. పెండ్లిలేనికన్నియను. దేవరవారి నంటఁగూడదు. కన్య
నగుటంజేసి మాజాతిలో దూష్యము. నన్నెవ్వరును వివాహముచేసు
కొనరు, దేవరవారే నన్ను వివాహము చేసుకొనుటకు సమ్మతించిన
యెడల నేనురక్షించఁగలననిపలికెను. ఆరాజేంద్రుఁడు, దయ్యో! యిది
దేమియన్యాయము! నేనుభూలోకచక్రవర్తినై యుండి యీచండాల
కన్నియనెట్లు వివాహము చేసుకొందును? రాజ్యభార మెటులవహిం
తును? బంధువులును, మిత్రులును, లోకులునునిందించరా? నేనిందు
కేమిచేయుదును? దైవమా! ఇట్టిప్రాణవియోగకాలమునరక్షించువాఁడే
గురుఁడనిపెద్దలుపలుకుచున్నారు. ఇచ్చట నీమాలదానికంటె వేఱొక
రక్షకులులేరు. ఈకన్నియయును మిగులఁజక్కనిదిగానున్నది, మన
కులదేవుండైన వసిష్ఠమహర్షి మతంగకన్నియను వివాహము చేసుకొని
త్రిలోకపూజ్యుండుగాకుండెనా? శ్యామలాశక్తి మాతంగకన్యకాదా?
మతంగ మహాముని ఋషి శ్రేష్ఠుఁడుగాఁడా? లోకులు నన్నుమాత్ర
మేలనిందింతురు? అట్లునిందించినయెడల రాజ్యమునువిడిచి యీసుందరీ
మణితో నెందైన వర్తింతుననియుఁ, బ్రాణవియోగ సమయమున నేమి
చేసినను దోషములేదనియు, మనంబుననిశ్చయించుకొని, యోహో!
సుందరీ రత్నమా! నేనుభూలోకచక్రవర్తిని నీవరుంధతివలె సుగుణ
సంపత్తికలిగియుందు వనియును, నీకీర్తివలననాయధర్మమునశించి పుణ్య
లోకములు గలుగు ననియును నిండు మనంబుతో నిశ్చయించి నిన్ను
వివాహము చేసుకొనుటకు సమ్మతించితిని. నీ పేరెయ్యది? త్వరపడి
నన్ను రక్షించుమనిన నాతలోదరి, రాజేంద్రా! నాపేరు భ్రమతి,
మూలములేనిమాలను నన్నంగనెను. మూలమెవ్వరికిని లేదని త్వరి
తముగాఁ దననెత్తిమీఁది యంబటికుండను భూమిమీఁదంబెట్టి యా
రాజేంద్రుని పాదములక్రిందికింబోయి యతనిపాదములనుబట్టి తన

భుజంబులమీఁదం బెట్టుకొని, స్వామీ! దేవరవారు మెల్లఁగాఁ జేతులను జాఁచుచు భుజముల మీఁదం గూర్చుండుడని చెప్పిన నతఁడట్లు గావించెను. ఆకన్నియ మెల్లఁగా భూమికిఁ గ్రుంకి రాజేంద్రుని మెల్లఁగా భూమిమీఁదికడించి కూర్చుండఁబెట్టిన, నామండలాధిపతికి భయము విడిచి యాకన్నియనుజూచి, పుణ్యాత్మురాలా! నేను మిగుల బడలి యున్నాను. అన్నరసముచే నాప్రాణముల నిలుపుమనిన నాయిందు ముఖి కుండలోనియంబలినింగలిపి యతనిదోసిటంబోసెను. అతఁడా యంబలిని గడుపునిండఁ ద్రావి భుక్తాయాసముచే నాచెట్టుక్రిందంబరుండి నిద్రించెను. ఆభ్రీమత యారాజేంద్రునిశిరంబుఁ దనతొడల మీఁదం బెట్టుకొని పైటచెఱంగుతో విసరుచుండెను. ఆరాజేంద్రుఁడు, డలసట తెఱుసట్లు నిద్రించిలేచి యాకన్నియనుజూచి దాని సుందరమునకు నాశ్చర్యపడి, యోప్రాణనాయకీ నీవుండుపల్లెకుంబోదమనిన నాకన్నియ, ప్రాణనాథా! నాతండ్రివచ్చి మనలను వెంటఁబెట్టుకొని పోవునని చెప్పు చుండఁగా నామాలఁడువచ్చి తనపుత్రిని నారాజేంద్రునిఁ జూచి, యమ్మా! యితఁడెవ్వఁడనిన నాకన్నియ చక్రవర్తియని జరిగిన వర్తమానమును జెప్పెను. అమాలఁడత్యంత సంతోషముతో నాయిరువురను వెంటఁ బెట్టుకొనిపోయి తనబంధువులకుంజెప్పి శుభముహూర్తంబున వివాహ మహోత్సవము గావించెను.

అంతనాచక్రవర్తి మిగులసుందరియైనభార్యతో నెల్లసుఖముల ననుభవించుచుఁ దనయాభరణములలో నొక్కొక్కటి విక్రయించి జీవించుచుండెను. ఆభ్రమతయు భర్తమాటకుబదులుచెప్పక యతనిం దేవునిఁగా నెంచి వివిధశుశ్రూషలుచేయుచు, నెల్లసుఖముల ననుభ వించుచు సుగుణసంపత్తితోఁ బ్రకాశించుచు నత్యంతభయభక్తులతో వర్తించుచుఁ, గ్రమముగా నలుగురు మగబిడ్డలను, మువ్వురాడు బిడ్డలనుగనెను. ఆమండలాధిపతి మిగుల నుత్సాహమునొంది బిడ్డల యందు మమకారముగలిగి తనకిరీటమును మకరకుండలములను వివిధా భరణములను విక్రయించి యిరువదిసంవత్సరములు మహదానంద సుఖముల ననుభవించుచుండెను. ఆపల్లెయందు వర్షములు కుఱియ నందున మిగుల క్షామముసంభవించి యందుండు మాలవాండ్రందఱు

నలుదిక్కులకుం బొటిపోయిరి. ఆభామతియొక్క తల్లిదండ్రులును మరణంబునొందిరి. పిమ్మట రాజేంద్రుఁడు భార్యనుంజూచి, ప్రాణనాయకీ! మనమొంటరిగా బిడ్డలతో నిచటనుండవలసినదేమి? త్రాగుటకెందును నీళ్లులేవు. ఎందైన నొకపట్టణమునకుం బోదము, బిడ్డలకు విద్యాబుద్ధులు గఱపింతమని చెప్పిన నాభామతియును సమ్మతించెను. ఆరాజేంద్రుఁ డెడబిడ్డలనిరువురను గావడిగట్టుకొని చేతిబిడ్డను భార్యకు నొప్పగించి పెద్దబిడ్డలనలువురను మెల్లమెల్లఁగానడిపించుకొని ప్రయాణమైపోవుచు, నచ్చటచ్చటఁ దియ్యనిఫలములఁగోసి బిడ్డలకునిచ్చుచుఁ, ద్రాగుటకు నీళ్లుదొరకక మిగులసంకటపడుచు, సూర్యకిరణములకుఁ బరితపించుచు, నడవలేనిబిడ్డలను జెట్లనీడలం గూర్చుండఁబెట్టుచు నీప్రకారము మూడుదినములెందును నీరుగానక ఫలములనుమాత్రము వారికిఁదెచ్చియిచ్చుచుండిన నానలువురు పెద్దబిడ్డలును బెనుదాహముతో మృతిఁబొందిరి. అందుకారాజేంద్రుఁడును భామతియు ఘోరముగా దుఃఖించుచుఁ దక్కినయిువ్వురు బిడ్డలతోడంబోవుచు, నాలవదినము కావడిలోనుండు బిడ్డలిద్దఱును జచ్చుటనుజూచి యారాజేంద్రుఁడు భూమిమీఁదంబడి ఘోరముగా నేడ్చుచుండిన, నాభామతి భర్తను లేవఁదీసి, పురుషరత్నమా! మాయాశరీరములు నిల్కడగా నుండునపిగావు మటుమాయముగాఁబోవుచుండును. కలలోఁజుచ్చుటను మేలుకొనిన నేమిలేదు, సర్వముమాయ, పరిపూర్ణమునకంటెను వేఱొండులేదు. మూలములేని పెనుమాయ భ్రాంతరూపమనిచెప్పి, శాంతవచనమొప్పఁజే నూరడించి, చంటిబిడ్డతోడ నాయిరువురు ప్రయాణమై పోవుచుండఁగా నాబిడ్డయును బాలులేక నలమటించి యైదవదినముగతించెను. ఆభ్రమతతనభర్తనుంజూచి, మహాత్మా! మధ్య వచ్చినబిడ్డలు మధ్యనే పోయిరి. పుట్టినవారికిఁ జావుసిద్ధము. మాయ యెఱుకేయాత్మ యగుటంజేసి శరీరాత్మలకు నిల్కడలేదు. మూలము లేని మాయను గుఱించి మనము వగవఁబనిలేదనిచెప్పి వెంటఁబెట్టుకొనిపోవుచు, నాఱవదినము మధ్యాహ్నమున నాభ్రమతియు భూమి మీఁదంబడి భర్తనుజూచి, పుణ్యాత్మా! నీకు మధ్యసంభవించిన చండాల సంసర్గమధ్యనే నశించెను. నాకుఁ గాలము సమీపించివచ్చినది. నీవు

పరిశుద్ధుండవై నీపట్టణమునకుంబొమ్ము. నేను బోయివచ్చెద నని చెప్పి కన్నీళ్లు రాల్చుచు నాయువతీమణి ప్రాణములను విడిచెను. అంత నారాజేంద్రుఁడు పెనుదుఃఖముతోఁ బత్నిమీఁదంబడి దానిగుణవిశేషములం బెక్కువిధముల స్మరించుచు, నకటా! నాకు దిక్కెవ్వరని విలపించుచుం గొంతకాలము నిరీక్షించి, యిట్టి సుగుణసంపత్తియుఁ బతిభక్తియుఁగల భార్యతో నగ్నితప్తమై పోవుటచేతఁ బుణ్యగతి సంభవించునని యోచించి కట్టెలంజేర్చి యగ్నిదరికొలిపి భార్య శవమును బడవైచి తానును నాయగ్నిలో దుమికెను. ఇక్కడనీసభామంటపంబున రత్న సింహాసనమునుండి భూమికిలంఘించి యింద్రజాలకుని మహిమవలన నేత్రములు దెఱచెను. సింహాసనమునుండి భూమికి లంఘించిన యాప్రభువును మంత్రులును సామంతరాజులును లేవఁదీసి, సింహాసనముమీఁదం గూర్చుండఁబెట్టిరి. ఆరాజేంద్రుఁడు వారింజూచి కన్నులవెంట నీళ్లుగాల్చుచుఁదలవంచుకొనియున్నఁజూచి మంత్రులును బ్రధాన సామంతరాజులును నాశ్చర్యపడి, యిది యేమివింతకార్యమో విచారింతమని పెద్దమంత్రి దగ్గఱకుంబోయి, రాజేంద్రా, దేవరవారు సింహాసనమునుండి భూమికిలంఘించుటకును, దుఃఖముచేతఁ దలవంచుకొని యుండుటకును గారణమేమి? దేవరవారు నేత్రములను మూసుకొని రమారమి పదినిమిషములై యుండును. ఇంతలో నెంతటిదుస్స్వప్నమునుగంటిరో దయతో నాకెఱిఁగించుఁడనివేఁడెను. ఆరాజేంద్రుఁడు కన్నీళ్లుతుడుచుకొనుచు, మిత్రుఁడా, స్వప్నముకాదు, నిజముగాజరిగిన వర్తమానము, నేనిరువదిసంవత్సరములు భర్తమతయ్యంచె చండాలకన్నియతో నెల్లసుఖము లనుభవించి యేడ్గురు బిడ్డలనుగని, వారినిఁ బోఁగొట్టుకొని దుఃఖించుచు, నాభార్యశవమును నగ్నిలోఁబడవైచి యాయగ్నిలోఁబడుటకు యత్నించి దుమికిన నన్నుమీరేల పట్టుకొంటిరి? నేనురాజ్యమునకుందగను, వేఱొకప్రభువు నేర్పఱచుకొండని జరిగిన వర్తమానమంతయు నెఱిఁగించెను. ఆమంత్రి ముక్కుమీఁదవ్రేలుపెట్టుకొని, యోహో! యిదియేమి వింతకార్యము! దేవరవారు మిగుల దుస్స్వప్నముగంటిరి. అబ్బా! యిదిమిగుల నాశ్చర్యమును బొందించుచున్నది. అంతయునబద్ధము, జరిగినదించుకైనను లేదు. కలలో మీ

కటులఁదోఁచె ననిపలికెను. ఆరాజేంద్రుఁడు, మిత్రుఁడా, నే ననుభవించి వచ్చిన వర్తమానమును నీవు దబ్బరయనిచెప్పుటెట్లు? ప్రత్యక్షానుభవంబని పలికిన నామంత్రి, రాజేంద్రా, దేవరవారు నేత్రముల మూసుకొని పదినిమిషములుండుటను, నిద్రాభంగము చేయఁగూడదని మే మందఱమును నిశ్శబ్దముగా నుంటిమి. ఇంతలో మాసభ కెన్నఁడు దేవతాస్త్రీలువచ్చి నృత్యగీతములనుజేసి దేవరవారిని దేవలోకమునకుఁ దోడ్కొనిపోయిరి? మీ రెన్నఁడు మమ్ముం బాసిపోయి యిరువదిసంవత్సరములు చండాలకన్నియతోడ సుఖించితిరి? ఆమృతశవమెక్కడ? ఆ యగ్నిగుండమెక్కడ? దేవరవారు సింహాసనమునుండి దుమికిన కారణమేమి? కిరీటముసహా యాభరణములన్నియు విక్రయించి జీవించినటులఁ జెప్పితిరి. సర్వముదబ్బర. అంతయు హుళిక్కి, దేవరవారు ధరియించిన భూషణములలో నొక్కటియైనఁ దక్కువలేకయున్నవి, చూడుఁడని నిలువుటద్దమును దెచ్చి ముందర నిలిపిరి. ఆరాజేంద్రుఁడు తనవస్త్రాభరణ కిరీటములనుజూచి యద్భుతమునొంది యేమియునుదోఁచక భ్రమాన్వితుఁడై యుండఁగా, నాయింద్రజాలకుఁడు ప్రభువునుంగాంచి, రాజేంద్రా, నే నింద్రజాలకుండను, నాజాలమువలన దేవరవారిచిత్తమున కటులఁదోఁచెనేగాని శరీర మెందునుబోలేదు, చిత్తవ్యాప్తియేగాని శరీర మనుభవించలేదు. నిజముగాదు, స్వప్నముగాదు. సర్వము నాజాల మనిచెప్పెను. అంత నా రాజేంద్రుఁ, డోహో! యిదిమిగులఁజిత్రము, నీ వింద్రజాలమని చెప్పుచున్నావు, నామంత్రి స్వప్నమనిచెప్పెను, నేను నిజముగా జరిగినటులఁజెప్పితిని. ఇందులో నెవరిమాటలునిజము? ప్రత్యక్షముగా ననుభవించివచ్చిన నాకు మీవాక్యములు మెప్పునకురావు, నాయనుభవమే సత్యమనిపలికిన, నా యింద్రజాలకుఁడు నిశ్చయముగా నాజాలమనిపలికిన, నా రాజేంద్రుఁడు, శ్రీ మహావిష్ణువు వచ్చి చెప్పిన నేను నమ్మెదనేగాని తక్కిన వారిమాటల నేను నమ్మననిపలికిన, నాయింద్రజాలకుఁడు, పుణ్యాత్మా! దేవరవారి యిష్టప్రకారము శ్రీమహావిష్ణువే వచ్చి చెప్పును. దేవరవారును సభికులును జాగరూకులై యుండి యా దేవునిదర్శింపుఁడని చెప్పి, తనచేతిలోని నెమిలియీఁకలకుంచెను సభికులతోఁడ ప్రభువునకుంజుట్టి చిత్తసంకల్పము నొందించెను. అంతనా ప్రభు

వును సభికులును నిద్రచే మైమఱచి నేత్రములను మూసినవెంటనే వారు గొప్పవెలుఁగునుగాంచి దివ్యవాద్యముల రవములనువిని యద్భుతమునొంది దిక్కులుపరికించుచు ననేక ఘంటికారవంబులతోఁడ గరుడవాహనారూఢుండై వచ్చిన శ్రీవిష్ణుదేవునింగాంచి, దిగ్గున లేచి నమస్కరించి యా దేవదేవుని రత్నసింహాసనముమీఁదం గూర్చుండఁబెట్టి యామండలాధిపతియును సభికులును జేతులనుగట్టుకొనినిలిచి యాదేవునిం బెక్కువిధముల వినుతించిరి. శ్రీమహావిష్ణువు చక్రవర్తినిం జూచి నీకు నిజముచెప్పుటకై వచ్చినాను, నీవిరువదిసంవత్సరము లనుభవించివచ్చిన యనుభవమంతయు హుళిక్కి, స్వప్నము, దబ్బర. ఇంద్రజాలమే సత్యమనిచెప్పి చూచుచుండఁగానే యాదేవుఁడు మటుమాయముగాఁ బోయెను. అంతనా సభికులును ప్రభువును నేత్రములను దెఱచి, యాహా! మనభాగ్యమే భాగ్యము శ్రీవిష్ణుదేవునిదర్శించి యతనివలన నిజమెఱింగితిమని యాయింద్రజాలకుఁ బెక్కువిధముల వినుతించి రని చెప్పిన నా రామచంద్రుఁ డద్భుతమొంది, మునీంద్రా! మగుడి యా రాజేంద్రుఁడా యింద్రజాలమును బరీక్షించెనా? యనిన నాతాపసోత్తముండిట్లనియె.

రాజేంద్రా, భ్రమస్వరూపకమైన మాయయెఱుక నే నేమని చెప్పుదు! మిగులదట్టముగానున్నది. రాకపోకలకు భ్రమయేకారణము, పురుకుత్సచక్రవర్తి తాను ముందనుభవించిన యనుభవమంతయుమిథ్య యనితలంచియును, మగుడిశ్రీమహావిష్ణువును నిజముగా దర్శించితిమను భ్రాంతిపొందిన యాభ్రమికుఁడేల యూరకుండును. మఱునాఁడు తనసభకాయింద్రజాలకుని రప్పించి, మహాత్మా, నీవిద్యావినోదమును జూపుమనిన నతఁడు మంచిదని మహేంద్రజాలమును గావించెను.

ఆజాలమువలనం బ్రభువును సభికులును నిద్రచేమైమఱచి నేత్రములను మూసుకొని దమ కొలువుకూటంబున గొప్పవెలుఁగునుగాంచి, ప్రణవాది దశవిధనాదములనువిని యద్భుతమునొందుచు, మహర్షులును నింద్రాదిదేవతలును వచ్చినంగాంచి, దిగ్గునలేచి వారికి నమస్కరించి యుచితాసనములమీఁదం గూర్చుండఁబెట్టి, మహాత్ములారా, తామువిజయముచేయుటకుఁ గారణమెయ్యది? మేముధన్యులమైతిమని ప్రార్థించిన, నామువ్వురుమూర్తులు దేవదేవుఁడగు మహేంద్రుఁడు వచ్చుచున్నాఁడని

చెప్పిరి. వెంటనే విశేషవాద్యములతోడ భక్తియోగిజ్ఞానులు సేవిం పఁగా నామహేంద్రుఁడు వచ్చినంగాంచి త్రిమూర్తులుసహా సభికులంద ఱునులేచి యాదేవునకునమస్కరించిరి, చక్రవర్తి యత్యానందముతో నామహాత్ముని నాపుణ్యపురుషులను నుచితాసనంబులం గూర్చుండఁబెట్టి వినుతించి, దేవరవారువచ్చుటకుఁ గారణమేమి ? మేము ధన్యులమైతి మని పలికిన నామహేంద్రుఁడు, రాజేంద్రా, నీవుమిగులఁ బుణ్యుండవు, నాపుత్రి త్రిలోకభ్రమ దేవతలంగోరక నిన్నుంగోరి వచ్చుచున్నదని చెప్పిన వెంటనే గొప్పయుఱుములును గన్నులు మిఱుమిట్లు గొనెడు మెఱుపులునుగలిగి యద్భుతంబైన తేజంబుతోడ నాకన్యకామణి యిరు వదినలువురు చేడియలతో వచ్చినిలిచినంజూచి యామహేంద్రుఁడు దక్కందక్కన సభవారందఱును నేత్రములనుమూసుకొని మైమఱచిరి. అంతనాత్రిలోకభ్రమ త్రిమూర్తులను నింద్రాదిదేవతలను సరకుగొనక మందగమనంబునఁ జక్రవర్తిదగ్గఱకుఁబోయి యతనికంఠమునఁ బుష్ప హారమువైచెను. అంతనాసభికులందఱు మూర్ఛలుదెలిసిలేచియాచక్ర వర్తినిఁగీర్తించిరి. అంతనామహేంద్రుఁడు మంగళవాద్యములను బోరు కొల్పించి త్రిలోకభ్రమకును జక్రవర్తికినిమంగళ స్నానములఁజేయించి సువర్ణరత్నఖచితంబగు వివాహవేదికనుగావించి, శుభముహూర్తంబున వివాహమహోత్సవమొనర్చెను. దేవతలందఱు గొల్లునఁగీర్తించి యా వధూవరులను దీవించి మహేంద్రునకు నమస్కరించి వీడ్కొనిచనిరి. మహేంద్రుఁడు పుత్రికిని నల్లునకును దివ్యవస్త్రాభరణములనిచ్చి తనలోక మునకుంబోయెను. అంత నాచక్రవర్తిసభికులనుజూచి, మిత్రులారా, మనభాగ్యమే భాగ్యము. మహాత్ములదర్శించుటచేత మనముధన్యులమై తిమి. ఈత్రిలోకభ్రమను మంగళవాద్యములతో నంతఃపురంబుఁ బ్రవే శింపఁజేయుదము, వాద్యములను రప్పించుఁడనిచెప్పి భార్యను దనతొడ మీఁదం గూర్చుండంబెట్టుకొని మంగళవాద్యమున కెదురుచూచుచుం డఁగా నింద్రజాలకునిమహిమవలన నందఱునునేత్రములనుదెఱచిరి.

చక్రవర్తి తనతొడపైనున్న భార్యంగానక తత్తరపడుచు సభికు లనుజూచి, మిత్రులారా, నా తొడలపైనుండిన యాత్రిలోకభ్రమ యెందుఁబోయె ? నిది బహుమాయగా నున్నదనిపలికిన, నాసభికు

లందఱు దేవర వారి తొడమీఁద నుండఁగాఁ జూచితిమి. ఆదేవి యిప్పు డెందుఁబోయెనో మాకుం దెలియ దనిపలికిరి. ఆమండలాధిపతి పెను దుఃఖమున సింహాసనమునుండి దిగి, యోత్రిలోకభ్రమా! త్రిలోక భ్రమా! యనిపిలుచుచు నలుదిక్కులం బరికించుచుండెను. ఆసభికు లందఱు నలుదిక్కులకుం బాఱి వెదకుచుండిరి. ఇంద్రజాలకుఁడు వారిం జూచి మీరేల యిట్లు తత్తరపడుచున్నారు? త్రిలోకభ్రమయు మ హేంద్రుఁడు సహా దేవతలును నామహిమవలన మీచిత్తమున కట్లుదోఁచి రేగాని వేఱొండుకాదు, నిజముగా దనిపలికెను. ఆమండలాధిపతియును సభికులును నాశ్చర్యపడి ముక్కులమీఁదవ్రేళ్లిపెట్టుకొని పెక్కువిధ ములపినుతించి యాయింద్రజాలకుని నాలింగనముచేసుకొని, సువర్ణ రత్నములతోఁ బూజించి, కోరినవస్తువులను, నగ్రహారములను నిచ్చి పుచ్చెనని చెప్పెను. ఆరామచంద్రుఁ డద్భుతమంది, యావసిష్ఠ మహర్షికి నమస్కరించి, మహాత్మా, యింద్రజాలకునివలన నింతటిమాయ కలుగుటకుఁ గారణమేమని యడిగిన నా మునీంద్రుండిట్లనియె.

రాజేంద్రా! యింద్రజాలకులు బహుసంవత్సరములు గురుశుశ్రూ షలుసలుపుచుఁ జిత్తమును నారాధింతురు. అందువలనఁ జిత్తము వారికి వశంబై వివిధంబులగు వేడుకలను జేయును. ఆచిత్తుఁడే మూలమాయ. అతనిసంకల్పవికల్పములే లోకాలోకములు. సంకల్పవికల్పములు లేనిదే బ్రహ్మము. అదియే యచలపరిపూర్ణము. అదియే ప్రకృతిద్వయదోష రహితమైన శుద్ధనిరాలంబము, వికారరహితమైన పరతత్త్వము.

మహేంద్రుఁడును, జైతన్యస్వరూపిణియను నమ్మవారును, జిదా కాశమును, బరబ్రహ్మంబును, జీవేశ్వరులును, ద్రిమూర్తులుసహా దేవర్షి గణంబులును సర్వముమాయయే గాని బ్రహ్మము కాదు. అచలబ్రహ్మ మువలన నీమాయపుట్టినదగాదు. తల్లిదండ్రులులేక తనంతటఁదానే వచ్చినది. భ్రమస్వరూపముగుటం జేసి మాయ యెవరికిం జిక్కక మటు మాయముగానే పోవుచుండును. మాయకుమూలము లేదుగనుకనే శరీర మునకును మూలము లేదు. మూలము లేనిదానికి జననమరణములు లేవు. సర్వము భ్రమ. పరిపూర్ణమునకంటె నేమిలేదు. అంతయు నింద్ర జాలము, గురువాక్యముచేత మేలుకొనినవారికిఁ బరిపూర్ణమునకంటె

నేమియునులేదు, మహిమయందును, సుఖతరమైనపదవులయందును, బంచలోహములయందును, నవరత్నములయందును లోకాలోకములయందును, క్షేత్రాక్షేత్రములయందును, స్థానాస్థానములయందును, నామరూపములయందును, గుడిగోపురములయందును, స్వర్గనరకములందును, బంధమోక్షములందును, సుఖదుఃఖములందును, బుణ్యపాపములందును, జ్ఞానకర్మములందును, బ్రకృతిద్వయము లందును, నియమనిష్ఠలందును, నుపవాస జపములందును, యజ్ఞయాగములందును, యోగ తపములందును, భక్తి వైరాగ్యములందును, హరిహరాదులందును, శక్తిద్వయమందును, త్రిగుణములందును, భావాభావములందును, భేదాభేదములందును, నీర్ష్యాసూయతలందును, జననమరణములందును, జాతినీతులందును, గులగోత్రములందును, సగుణనిర్గుణములందును, గోరికలుగల విధినిషేధపరులను మాయయొక భ్రమస్వరూపమై వేధించుచుండును. ఇది పునరావృత్తిమార్గము. సచ్చిదానందరహితమైన యచలపరిపూర్ణబ్రహ్మమే నిజస్వరూపముగా నెందునుదర్శించుచు, మూలములేనిమాయ భ్రమరూపక మనియును, గలలోవచ్చినశరీరము వేఱొక్కన్ననేమిలేదనియును, సద్గురు వాక్యమునునమ్మి యచలమునకంటె నేమిలేదని నిశ్చయమైనవారే భ్రాంతిరహితులు. నిత్యానిత్యములను దర్శించినపుణ్యాత్ములే ప్రకృతిద్వయదోషరహితులు. వారేయచలులు. వారేయశరీరులు. వారే చావుపుట్టుకలులేనివారు. వారేదేవభ్రాంతి, లోకభ్రాంతి, లోకాంతరభ్రాంతులులేనివారు. వారేపుట్టనిచావనివారు. వారికిఁగులగోత్రములులేవు, వారికివేదశాస్త్రములు ప్రమాణములుకావు. వారేసర్వకాలములందును సర్వలోకములందును సమస్తవస్తువులందును బరిపూర్ణముగనుండి స్వతస్సిద్ధమైయుండువారు. వారే శరీరాత్మలు లేనివారు. వారేనివృత్తిమార్గస్థులనిచెప్పిన నారాజేంద్రుఁ డానందభరితుండై యామునీంద్రుని పాదములమీఁదఁబ్రాలి, మహాత్మా, దేవరవారి వాక్యములమృతతుల్యములు. నాభాగ్యవశమునవచ్చి నాకు శుద్ధవేదాంతమార్గమును నింద్రజాలపుఁగథలనుజెప్పి యత్యానందమునుబుట్టించితిరి. ఆహా! మిగులనాశ్చర్యము! పురూరవచక్రవర్తిదినములలో నింద్రజాలకులు

వచ్చిచేసినజాలమంతయును జెప్పుఁడనినేఁడిన నామునీంద్రుండిట్లనియె.

పు రు కు త్స చ క్ర వ ర్తి క థ — ము గి సె ను.

---

—*(పురూరవచక్రవర్తి - కథ.)*—

శ్రీరామచంద్రా ! ఎఱుక ప్రభావమును నేనెంతనిచెప్పుదును ! మిగులఁజిత్రము మహాద్భుతము. అతిమాధుర్యము. అసత్యమందుండు తీపుసత్యమందు లేదు. సత్యము ముష్టిపండువంటిది, మిగులఁజేఁదుకాఁ బట్టి యింద్రజాలము మిగులనానందకరమని చెప్పుటకుసందియము లేదు. పురూరవచక్రవర్తి సుమంతాద్యష్టమంత్రులును సామంతరాజులును, విద్వజ్జనంబులును బరివేష్టించియుండఁగా నిండుకొలువుకూటంబునఁగూర్చుండి తాంబూలమునుధరియించుచుండెను. ఆసభకుఁ గమలాత్ముఁడను పేరుగల యింద్రజాలకుఁడువచ్చి యాప్రభువునుసభికులనుదర్శించి, రాజరాజోత్తమా, నేనుబీదబ్రాహ్మణుండను వనవాసిని వైదికుండనని చెప్పుచుం దనచేతిలోని నెమిలియీఁకలకుంచెనుద్రిప్పి మహేంద్రజాలమును గావించెను. ఆవెంటనే తాంబూలముచేయుచు నాకుమడుపునుగరంబునం బుచ్చుకొనినప్రభువునకు నిద్రమైకముసంభవించి నేత్రములనుమూసుకొనెను. మంత్రులును బ్రధానసామంతరాజులును బ్రభువునిద్రించుచున్నాఁడని సందడిచేయక నిశ్శబ్దముగానుండిరి. ఆమండలాధిపతికి నింద్రజాలకునిమహిమవలన గొప్పప్రకాశమును, గజ్జలందియలు మొదలగు నాభరణములధ్వనులును వినవచ్చినందుననతఁడచ్చెరువంది, యాహా ! యీవెలుఁగెందుండివచ్చెనని దిక్కులుపరికించుచుండఁగా మెఱుపుఁదీఁగవంటి యొక కన్యకారత్నమువచ్చి యెదుటనిలిచెను. ఆమండలాధిపతి యాకన్నియ దివ్యరూపమునుజూడఁజాలక నేత్రములను మూయుచుం దెఱచుచుఁ గొంతసేపు ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొని యాశ్చర్యము నొందుచుఁ గొంతవడికిధైర్యమును దెచ్చుకొని, యోహో ! సుందరీరత్నమా, నీవెవ్వరిదాన ? వెందుండివచ్చితివి ? నీవృత్తాంతమంతయు నెఱిఁగించుమని ముఖమునం దానందరస మొలుకునటులఁ గ్రీఁగంటితో మెల్లనసడిగిన, నాకంజదళాక్షి యిట్లనియె.



పురూరవచక్రవర్తి. ఇంద్రజాలకుఁడు. సామంతరాజులుసహా-మంత్రులు.

పుణ్యాత్మా! నేనువంధ్యాసూనుఁడను మహేంద్రునకుంబుత్రిని. నాతండ్రియే దేవదేవుఁడు. మిగులమహిమలుగలవాఁడు. ఇంద్రాది దేవతలకును త్రిమూర్తులకును బ్రభువు ధారుపురుషుఁడనుమంత్రితో నాశ్చర్య

పురమును బాలించుచున్నాఁడు. నా దేవునకుముద్దులకూతురను, నా పేరుజగద్భ్రమ. నేనుబెండ్లిలేనికన్నియను. నాచెలికత్తెలతోడనాడుచు బుద్ధిజాడ్యముచేత భూలోకమునకుంబోయి పుష్పములను గోయుటకై యోచించి వచ్చి పుష్పములనుగోయుచు, చెట్టుచెట్టునకుందిరుగుచు గొంతవడికి నేనుదలయెత్తిచూడఁగా, నాచెలికత్తెలలో నొక్కరైనను గనుపించనందున దిగులుపడి యాప్రదేశమంతయు వెదకిచూచియెవ్వరిని గానక యేమియుఁదోఁచక భయాకులితచిత్తనై దుఃఖించుచుండఁగా నొకయువతీమణి నన్నాదరించి దుఃఖముడిపి భూలోకచక్రవర్తి మిగుల ధర్మాత్ముఁడు, సత్యసంధుఁడు, పుణ్యమూర్తి, యాప్రభువుదగ్గఱకుంబోయి నీవర్తమానమును జెప్పినయెడల నిన్నతఁడాదరించి నీదుఃఖముడిపి నీ తండ్రియొద్దకుం బంపునని చెప్పిపోయెను. అంతటనేను నీసభకువచ్చి నిన్నుఁ గాంచితిని, దయతో నాతండ్రియొద్దం జేర్చుమని పలికిన, నారాజేంద్రుఁ, డోహో! కన్యకారత్నమా, నీమాటలుమిగులఁ జిత్రములు! యౌవనమంకురించని కన్నియలుతల్లిదండ్రుల యాదరమునేగోరుదురు. ఋతుమతులైన నీవంటియౌవనకన్నియలు పురుషులయాదరమునే గోరుదురుగాని జననీజనకుల యాదరమును గోరరు. నీకు నాపురియందేమియును గొఱఁతయుండదు, నిన్నునారాజ్యలక్ష్మిగాఁగైకొని భూమండలమంతయును నీయాజ్ఞప్రకారము పాలించెదను. నన్ను వివాహముచేసికొనిన నీయిష్టప్రకారము వర్తించుటకు సందియములేదు. దయతో నన్ను వివాహముచేసికొనుటకుసమ్మతింపుము. నీయందుభ్రమగొనియున్నాను. పూవిలుకాఁడు పొంచిపొంచి బాణములేయుచున్నాఁడు. ఎప్పటిసుఖమప్పుడు, తామసింపవలదు. త్రిలోకనాయకీరత్నమా, నన్ను నీభర్తగా గ్రహింపుము. అకటా! నేనెట్లు మన్మథాగ్నిభరింతు నని ప్రార్థించెను. ఆకన్నెపక్కునవ్వి, యోహో! రాజేంద్రా, నీమంచితనమునుధర్మగుణమును ద్వరలోనేగనుపఱచితివి. ఇట్టివిపర్యాస మెందైనఁగలదా? ధర్మాత్ముండవనిచెప్పఁగావిని వచ్చి ప్రార్థించినందుకు వివాహముచేసుకొమ్మని నీవునన్నుంబ్రార్థించెదవా? ఆహా! యిదియేటిధర్మువు? నాతండ్రిమిగుల మాయకుఁడు.నీరులేని-చోటనీరును, నగ్ని లేనిచోటనగ్నియుఁబుట్టించును. లోకములనన్నింటిని నిమిషకాలంబున నశియింపంజేయును, నశించిన

లోకముల నామహాత్మ్యుఁడు నిమిషములోన నిర్మాణము సేయును, సూర్యచంద్రులనుబట్టి బంతులాడును. అతఁడలిగిన మూఁడులోకములు తల్లడిల్లును. కాఁబట్టి, క్రమముఁదప్పక నలవిగాని కోరికను విడిచి నన్ను నా తండ్రియొద్దకుం బంపుము. నాతండ్రి శరణాగతరక్షకుఁ డగుటంజేసి నీ వా దేవుని శరణు వేఁడిన నతఁడు నీయిష్టప్రకారము వివాహము గావించినను గావించును, గాఁబట్టి, త్వరితముగా నన్నుం బంపుమని పలికెను. ఆరాజేంద్రుఁ డా నీతివచనములవినక పెడచెవులంబెట్టి, యోహో సుందరీరత్నమా, నీ వాక్యములకు నేను వెఱఁగుపడను. నీవు నాయందుఁ బ్రేమయుంచుము, నీకోపమునకు భయపడుదునేగాని మఱెవ్వరికిని భయపడువాఁడనుగాను. నీతండ్రిగాఁ డాతనితోడ మూఁడులోకము లేకీభవించి నామీఁదికి దండెత్తివచ్చినను నన్ను జయించుటకలవిగాదు. నాకుం దెలియని దివ్యాస్త్రములు లేవు. ప్రాణములయం దపేక్షయు లేదు. నన్ను నల్పునిఁగా నెంచవలదు. నీజననీజనకులందుఁ బ్రేమయుంచవలదని పలుకుచుండిన నొకదూత వచ్చి యారాజేంద్రునకు నమస్కరించి, పుణ్యాత్మా, నేను త్రిలోకనాయకుండైన వంధ్యాపుత్త్రునిదూతను, జగద్భ్రమనిమిత్తముగా వచ్చితిని మా రాజపుత్త్రినిఁ ద్వరితముగా నంపుమనెను. ఆరాజేంద్రుఁ డతనికి మర్యాదలు గావించి నే నీకన్నియను విడుచుటలేదు, వివాహముఁ జేసుకొనుటకు యత్నించియున్నానని పలికిన, నాదూత, మానవేంద్రా, నీవలవికాని కోరికలు గోరవద్దు. అకటా! మహేంద్రుఁడు మిగులమాయలుగలవాఁడు, ప్రపంచమంతయు నతనిమాయగా నెఱుంగుము. అతఁ డలిగిన లోకములన్నియుఁ బాడై పోవును, గొప్పమనంబుతో నీరాజపుత్త్రిని విడువుము, తేనియెడలఁ గీడు వాటిల్లునని పలికిన, నా చక్రవర్తి కోపించి యాజగద్భ్రమను నంతఃపురంబునకుం దోడ్కొనిపోయి యాలతాంగిని నొకసువర్ణపు మందసములోనుంచి, తనపడకటింటిలోనం బెట్టించి బీగముద్రలు వేయించి, మహాశూరులతోడఁ దనపెద్దమంత్రి నచటఁ గావలియుంచి, యుద్ధమున కాయత్తులై యుండుఁ డని చెప్పి తనసైన్యాధిపతిం బిలిపించి, మిత్రుఁడా, మనమీఁదికి మహేంద్రుఁడను దేవవోత్తముఁడు దాడెత్తి వచ్చునఁట. అతఁడు మిగులమాయలుగలవాఁడఁట. నీవు మిగుల జాగ్రతతో నుండుము. వాయుస్తంభన, అగ్నిస్తంభన, జలస్తంభన, కజకర్ణ, గోకర్ణ, మోహ

నాదివిద్యలుగలమంత్రవాదులను, దంత్రవాదులను ముందునిలుపుకొని ననము జయింపవలయును, మూలబలముతోడరప్పించి శత్రువులనుహత ము గావింపవలయునని దిట్టముగాఁజెప్పి మఱలఁ గొలువుకూటమునకుం బోయి సింహాసనముమీఁదంగూర్చుండి దేవవాద్యములరవమునురణభేరీ శబ్దములనువిని మహేంద్రుఁడుయుద్ధమునకువచ్చినాఁడనియోచించి తన సభికులనుజూచి, మిత్రులారా, మీరునానిమిత్తముగామహేంద్రునితోఁ బోరాడి నాకుజయము గోరవలయును. త్వరితముగా లేచియుద్ధసన్నద్ధు లై రండనియుత్తరువిచ్చి, యారాజేంద్రుఁడుమూడులక్షలచతురంగ బల మును, నేఁబదివేలు మహాశూరులైనమూలబలమును, మూడువేల రథ మహారథ సమరథులను, మున్నూటిద్దఱుమంత్రవాదులను వెంటఁబెట్టు కొని దిక్కులు ప్రతిధ్వనులిచ్చునటుల ఘూర్ణిల్లఁజేయుచు, ముప్పది యిద్దరుసామంతరాజులను నేఁగురుమంత్రులం దనకుఁజక్రరక్షకులుగాఁజేసి కొనివచ్చి యుద్ధభూమిని నిలిచినంగాంచి, యామహేంద్రుఁడు కోపించి, దురాత్మా, నీవుమదగర్వముచేనాపుత్త్రినినంతఃపురమునదాఁచి, నాతోడ యుద్ధముచేయుటకు వచ్చితివిగదా ! అహా! నీవుమిగులశూరుఁడవు. నా ప్రభావమెఱుంగకవచ్చితివి, నేనులోకారాధ్యుఁడను. నిమిషములోపల నాపుత్త్రినిరప్పించి నిన్నును నీసైన్యములహస్తములను గట్టించెద నని పలికి హుంకరించినమాత్రముననే యాజగద్భ్రీమవచ్చి తండ్రియొద్ద నిలి చెను. ఆమండలాధిపతియును మంత్రులును ప్రధానసామంతరాజులును నతిరథమహారథ సమరథులును, మంత్రతంత్రవాదులతోడ సర్వజనులు నాయుధముల విడిచి హస్తములఁగట్టుకొని చిత్రించినబొమ్మలవలెఁ గద లక మెదలక నిలిచిరి. వారియవయవములు వారికి సాధ్యపడకపోయెను. ఎక్కడియేనుఁగు లక్కడనే, యెక్కడిరథము లక్కడనే, యెక్కడి గుఱ్ఱము లక్కడనే, యెక్కడిభటులక్కడనేనిలిచియుండినంజూచి, యాచక్రవర్తి యాశ్చర్యపడి, యబ్బా'యిది మిగుల నద్భుతమనియోచించుచుండఁగా, నామహేంద్రుని ప్రభావమువలన వికారస్వరూపములుగలమిగులభయం కరములైనయనేకభూతములుద్భవించి,యామండలాధిపతినిందప్పఁదక్కిన చతురంగబలములను శూరులను మంత్రవాదులనుమంత్రులను ప్రధాన సామంతరాజులను బట్టుకొని మింటికెగసిపోవుటంజూచి చక్రవర్తి

మిగులదిగులొందికన్నీరు విడుచుచు, నాజగద్భ్రమనుంజూచి, యాహా! నిన్నునమ్మినందుకు దైవమునన్నిటులఁగావించె, నేనేమిచేయువాఁడనని దుఃఖించుచుండినచటికిబ్రహ్మవిష్ణుమహేశ్వరులువచ్చిచక్రవర్తినింగాంచి యాదరించి, రాజేంద్రా, మేముత్రిమూర్తులము. వంధ్యాసూనుఁడైన మహేంద్రునిమంత్రులము. మే మాదేవునియాజ్ఞను నడిపింతుము. అతని మాయనుగనఁజాలకతపించుచున్నారము.లోకములతనిసంకల్పమువలనం బ్రకాశించుచున్నవి.వికల్పముదోఁచినసర్వమునశించును. నీవునునీసైన్యములును నతనికోపదృష్టికెంతమాత్రము, త్వరితముగా నామహాత్ముని బ్రార్థించి ప్రాణములను నిలుపుకొనుము.లేకుండిన,నపాయముసంభవించు నని చెప్పియామువ్వురుమూర్తులదృశ్యులైరి.అంతనాచక్రవర్తిమహేంద్రుని ధ్యానించుచు మెల్లఁగా రథమునుండిదిగి పాదచారియైపోయియామహేం ద్రుని పాదములమీఁదఁ వ్రాలివినుతించిన, నామహాత్ముఁడతని నాలింగనము చేసుకొని, కోరినవరములిత్తునడుగుమనిన, నాచక్రవర్తి, స్వామీ, దేవ దేవోత్తమా, నాకీజగద్భ్రమతప్ప వేఱొండుకోరికలేదు, దయతో నాకిచ్చి వివాహముగావించుఁడనివినుతించెను. అమ్మహాత్ముఁడుసంతసించి యతని కభయమిచ్చిచక్రవర్తినిజగద్భ్రమను దనవిమానముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనిపోయిమంగళవాద్యములతో డంబురప్రవేశముచేయించి, శుభ ముహూర్తంబుననావధూవరులకుమంగళస్నానములుచేయించి, వివాహ మహోత్సవము గావించెను. త్రిమూర్తులును నింద్రాది దేవతలును మహర్షులునాదంపతుల దీవించి వారివారినిలయములకుం బోయిరి.

అంత నాచక్రవర్తి దేవకన్నియయైన జగద్భ్రమంగూడి మహా దానందసుఖములనుభవించుచు, నాపడకటింటికిదాపించిన దివ్యరత్నము లనుజూచిచూచి యద్భుతమునొందుచు, దేవవిమానముమీఁద భార్య నుగూర్చుండఁబెట్టుకొని తలఁచినలోకములకుంబోయి యందుండువింతల ను జూచుచు, దివ్య రత్నమంటపములయందును కేళికాగృహముల యందును బూపొదరిండ్లయందును గ్రీడించుచు, సైకతభూములయందు సుఖనిద్రఁజెందుచు, నూతనవస్త్రాభరణములనుఁ బ్రతిదినము ధరించు కొనుచు, నీప్రకారము ముప్పది సంవత్సరములు దేహమును, బత్నీపుత్ర హితబంధువామాత్యులను, రాజ్యమును మఱచియుండెను.

ఒకనాఁడాయింద్రజాలకుని మహిమవలనజ్ఞప్తికివచ్చి భార్యనుం జూచి, యోత్రిలోకసుందరీరత్నమా, నేనీలోకమునకువచ్చి నిన్ను వివాహముచేసుకొని ముప్పదిసంవత్సరములయ్యె, మహదానందసుఖములనుభవించితిమి, మనలోకమునకుంబోవుటకుసమ్మతించు మని ప్రార్థించిన నాకంజదళాక్షియునుసమ్మతించెను. ఆరాజేంద్రుఁడు మహేంద్రునకు నమస్కరించి యతనికిందనయిష్టమునుజెప్పి సెలవుపొంది వివిధవస్తువులను దేవనాగరత్నములనుముప్పఁదుచెలికత్తియలనువస్త్రాభరణములనుబుచ్చుకొని విమానమునిూఁదనాజగద్భ్రమను నామెముప్పదుచేడియలను వివిధ వసువులను బెట్టుకొని తానునుం గూర్చుండి భూలోకమునకువచ్చి యూరిబైటవిమానమునుదిగి మేళతాళములంతోడఁబురప్రవేశముచేసిజగద్భ్రమను దానిచెలికత్తియలను నంతఃపురములో నునిచి తానుకొలువుకూటమునకువచ్చి తనసింహాసనమునిూఁదంగూర్చుండి యింద్రజాలకుని మహిమ వలన నేత్రములందెఱచి తనసభికులను బెద్దమంత్రియైన సునీతునింగాంచి, యోహో! మిత్రులారా, మీరందఱుమహేంద్రునిమాయకుఁ గదలక మెదలకబంధింపఁబడి, రాక్షసులవాతంబడితిరేమఱలనెట్లువచ్చితిరి? నిన్నుం బెద్దమంత్రివనినమ్మిశూరులతోడంగావలి యుంచియుండఁగా,నాయాజ్ఞను జెల్లింపకబీగముద్రలువేసిదాఁచినయీజగద్భ్రమనునెట్లువిడిచితి?యనిపలికిన, నాపెద్దమంత్రియుసభికులును నాశ్చర్యపడి, రాజేంద్రా, దేవరవారిమాటలు మిగులఁజిత్రములుగానున్నవి, నేనెన్నఁడు మీయాజ్ఞకుమీఱితిని ? సభికులెన్నఁడురాక్షసులవాతంబడిరి ? ఆమహేంద్రుఁడెవఁడు ? ఆజగద్భ్రమ యెవ్వతె? మాకేమియుం దెలియదనిపలికిన నారాజేంద్రుఁ, డోహో! మీరీ ముప్పదిసంవత్సరములకే మఱచితిరా? యనిన, నామంత్రి యాశ్చర్యముతోనప్పుడు జరిగినవర్తమానమంతయు దేవరవారే వినిపించుఁడనివేఁడిన, నాచక్రవర్తిజరిగినవర్తమానమంతయుఁ జెప్పెను. ఆమంత్రియుసభికులును నొకరిముఖమొకరుచూచుకొనియాశ్చర్యపడిరి. అంతనాసునీతియోచించి, రాజేంద్రా, దేవరవారు నిద్రమైకమువలనఁ బది నిమిషములకాలము నేత్రములనుమూసితిరి. అప్పుడు మీకు స్వప్నము కలిగియుండునేగాని నిజముగాజరిగిన వర్తమానముగాదు, మీరెన్నఁడు ముప్పదివత్సరములు మమ్ములవిడిచి యుండివచ్చితిరి? ఆహా! మిగులఁజిత్రమైన కలనుగంటిరని

పలికిన, నారాజేంద్రుఁడు, మిత్రుఁడా, నీవునిదానమునుదప్పిపలుకుచున్నావు. నేను బ్రత్యక్షముగా ముప్పది సంవత్సరములనుభవించివచ్చిన యనుభవమంతయుంగలయని చెప్పెదవు. ఆహా! యిదిప్రత్యక్షవిరుద్ధము. నిజమైన వర్తమానమును నేనుజెప్పియుండఁగా నీవుస్వప్నమనిసాధించుటె? ట్లని పలికిన, నామంత్రి ప్రభువు కోపమునకు శంకించక కొంతసేపుయోచించి, రాజేంద్రా, దేవరవారు గోపింపవలదు. మీరుచెప్పినదంతయునబద్ధము. నిజముకొంచెమైనను లేదు, వంధ్యయనఁగా గొడ్డురాలు, గొడ్డురాలికి బిడ్డయుండునా? అతఁడు దేవోత్తముండెట్లయ్యె? కొయ్యపురుషుఁడు మంత్రియెట్లయ్యె? జగద్భ్రమనిజమైన భ్రమయేగాని స్త్రీకాదు. సర్వము భ్రమరూపకమైనస్వప్నము. అనుభవమంతయుహుళిక్కి, దేవరవారు ముందుధరియించి యుండినవస్త్రాభరణములేగాని మహేంద్రుఁడిచ్చినవి కావనిపలికిన, నారాజేంద్రుఁ,డో హో! మంత్రీ,నీవిటులసాధించుచున్నావనిపలికెను. ఆయింద్రజాలకుఁడుపకపకనవ్వుచు, నోహో! రాజేంద్రా, నేనింద్రజాలకుండను, నామహేంద్రజాలమువలన దేవరవారిచిత్తమున కటులఁదోచెనేగాని నిజముగాఁజరిగినదికాదు, స్వప్నమునుగాదు,స్వప్నేంద్రజాలములకుఁ జిత్తుఁడేకారణము. కాఁబట్టి, మంత్రిస్వప్నమనివాదించెను. సర్వమునామాయగాని నిజమైనయనుభవమగాదనిపలికిన, నామండలాధిపతివెఱఁగుపడి నేమియునుదోఁచక తానుధరియించియుండిన వస్త్రాభరణములనుజూచుకొనియును, భ్రమపీడకయంతఃపురములోనికింబోయి నగళ్లన్నియు వెదకియు, నెందునుజగద్భ్రమను దానిచెలికత్తియలనుగానక ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొని యద్భుతమొందుచు, నాయింద్రజాలకునింజూచి, మహాత్మా, ముందుగానాకుందెలియఁజేయకజాలమేలగావించితివి? నాకుసందియంబుజనించుచున్నదనిపలికి యతనింగీర్తించెను. సభవారందఱునాశ్చర్యపడి యానందించిరి. కాఁబట్టి యసత్యమేజనరంజకంబని చెప్పిన, నారామచంద్రుఁడు, మునీంద్రా, దేవరవారివాక్యములమృతతుల్యములు. నామనంబింకనునింద్రజాలమునేవినఁగోరుచున్నది. పుహూరవచక్రవర్తియాయింద్రజాలమును మఱలఁబరీక్షించెనా? యనియడిగిన, నావసిష్ఠమహర్షి, రాజేంద్రా, యాచక్రవర్తియేలపరీక్షించకవిడుచును? చక్కెరను దినని వారుచుంగలరా? అందఱికిని దీపురుచ్యముగానేయుంచును. ఆ

పురూరవచక్రవర్తియింద్రజాలకునిఁజూచి, మహాత్మా, నీవిద్యావినోదములఁ జూపుమనిన నాయింద్రజాలకుఁడు, మంచిది, దేవరవారును సభికులును జాగ్రతగనుండుఁడనియింద్రజాలముఁగావించెనుఆజాలమునలనరాజేంద్రుఁడునుసభికులును నేత్రములనుమూసిరి. ఆవెంటనేవారికిందమపట్టణమును నలుదిక్కులును జక్కగాఁగనుపించెను. ఇదియేమింతటివెలుఁగెందుండి వచ్చె? ననియోచించుచుండ, నాపురికినలుదిక్కులయందగ్నియుద్భవించి భయంకరముగా మండుచు, నాపురమంతయుఁ గాల్చుటఁజూచి యందఱు భయపడిగొప్పకంఠధ్వనితో నేడ్చి నేత్రములను దెఱచిరి. ఆయింద్రజాలకుఁడు వారినందఱ నాదరించిమీరుభయపడి యేడ్చుటకుఁగారణమే? మనియడిగిన, నారాజేంద్రుఁడు జరిగినవర్తమానమునుజెప్పెను. ఇంద్రజాలకుండుసర్వము నామాయ, మీచిత్తములట్లువ్యాపించెను. మీపురమునుజూడుఁడనిచెప్పి మఱికొంతజాలముఁ జూపించిన నారాజేంద్రుఁడద్భుతమందియా యింద్రజాలకునిఁగీర్తించియాలింగనముఁ జేసుకొనియతఁడు గోరినవస్తువులన్నియు నిచ్చిసువర్ణరత్నములతోఁబూజించిసెలవిచ్చిపుచ్చెనని చెప్పెను. ఆరామచంద్రుఁడద్భుతమంది, మునీంద్రా, స్వప్నమునకు నింద్రజాలమునకు భేదమేమనియడిగిన నా మునీంద్రుఁడు, రాజేంద్రా, ప్రపంచముపెద్దమాయ, స్వప్నముచిన్నమాయ. ఇంద్రజాలముమధ్యమాయ. ఈమూటికి భేదము లేదు. నేత్రములమూసినఁ బ్రపంచమును, నేత్రములను దెఱచిన స్వప్నేంద్రజాలములును, మఱుమాయముగాఁబోవునుగాఁబట్టి మూఁడును మిథ్యారూపకములు. ఈమూటికిభ్రమయే కారణము, కార్యముభ్రమయే, భ్రమయేపరబ్రహ్మము, భ్రమయే త్రిమూర్తులు, భ్రమయేలోకములు, భ్రమయే పదవులు, సర్వముభ్రమ. ఈ పరిపూర్ణమునకు నేమిలేదు. ఏమిలేని యీబట్టబయలేపరమపదము, ఇదియేజన్మశూన్యము, మోక్షాదిపదవులన్నియు బునరావృత్తిమార్గములు, భ్రమరూపకమును. అవిస్థిరములుకావు, బుద్ధిమంతులీపదవులనుగోరక జన్మశూన్యమునే గోరుదురనిచెప్పిన, నా రామచంద్రుఁడాశ్చర్యపడి, మునీంద్రా, దేవరవారి యమృత వాక్యములచేత నేను బావనుండనైతిని. ఇంద్రజాలపుఁ గథలు మిగులు నద్భుతములు నామనంబింకను వినఁగోరుచున్నది, సగర చక్రవర్తి దినములలో నింద్రజాలకులు వచ్చిచేసిన యింద్రజాలమంతయుం నెఱిఁగించుఁడని వేఁడిన నా వసిష్ఠమహర్షి యిట్లనియె.

పురూరవ చక్రవర్తికథ - ముగిసెను.

(సగర చక్రవర్తికథాప్రారంభము.)

శ్రీరామచంద్రా ! వినుము, తొల్లిసగరచక్రవర్తిధర్మమును నాల్గు పాదములయందునునడిపించుచుం బరస్పరపాత్రంబులకు సహింపని మను



జుల దండింపుచు, భక్తివైరాగ్య తత్వయోగజ్ఞానులను బూజించుచుఁ, బురిజనుల కానందముగా రాజ్యమును బాలింపుచు, నీ విశ్వరూపమైన శరీరము దానుగాభావించి మిగుల సుఖానంద మనుభవించుచుండెను. రాజేంద్రుని కొలువుకూటమున కొకయింద్రజాలకుండువచ్చి ప్రభువున కెదుటనిలిచి, రాజేంద్రా, నేనుమిక్కిలిబీదవాఁడను. మీకృపకుఁబాత్రుఁ డనై వచ్చియున్నాను, నావిద్యను బరీక్షింపుఁడనిచెప్పుచుఁ దనహస్తమం దుండిన నెమిలి యీఁకలకుంచెఁద్రిప్పి చిత్తసంకల్పము నొందించెను. ఆ యింద్రజాలకుని విద్యావిశేషమువలన నా రాజేంద్రుఁడు నిద్రచే మై మఱచి నేత్రములమూసుకొనెను. సభికులందఱు ప్రభువునిద్రించుచున్నాఁ డని సంగడిసేయక నిశ్శబ్దముగానుండిరి, దేహముస్మృతిందప్పిన యా రాజేంద్రునకు దివ్యసుందరియైన స్త్రీయును బురుషుఁడును గనుపించెను. ఆపురుషుఁడుప్రభువునకునమస్కరించి, పుణ్యాత్మా,యిదినాభార్యమత్స్య దేశమునుండి వెంటఁబెట్టుకొని వచ్చుచుండఁగా దారిలోదొంగలడ్డగించి మాధనమును వస్త్రాభరణములను దోఁచుకొనిపోయిరి. మాకిచటం జుట్టములెవ్వరు? దేవరవారుసహాయముచేసి మేముమాదేశమునకుం బోవునటులంజేయుట మిగులనుపకృతియు నాదరణీయంబునునై యుండు ననిపలికెను. ఆరాజేంద్రుఁడు దనకట్టెదుటందొలుకరి మెఱుపుదీఁగెవలె నిలిచి కనులకు మిఱుమిట్లుఁగొలుపుచుండెడు నాయిందుముఖింజూచి, యాహా! విధాతయిట్టిసుందరీమణిని నాకుభార్యగాసృజింపక నీదరిద్రునకు భార్యగాసృజించెను. ఈ బిసరుహదళాక్షింగూడ భోగించనిజన్మ మెందు కని పెక్కువిధముల యోచించుచుఁ, జంచలంబగు చిత్తముతో నాచప లాక్షినింజూచుచు, దానిపురుషునింగాంచి, యోపథికుఁడా, మీరుదొంగ లచే మోసపోయి వచ్చితిరా ? మంచిది మీకు ధనమును వస్త్రాభరణ ములను నిచ్చి మార్గసహాయంబొసఁగూర్చి మీ పురికిం బంపెదను, మీ రిచటరెండుదినములుండి పొండనిచెప్పుచుండఁగా, వేఱొకపురుషుఁడు పెనుదుఃఖముతోవచ్చి యాప్రభునకునమస్కరించి, రాజేంద్రా, దేవర వారుపాలించెడు ధర్మ పరిపాలనయందిట్టి యకృత్యము జరుగవచ్చునా ? నాడెందంబెఱియుచున్నది, నేనేమనిచెప్పుదును ! ఈ కాంతామణి నేనగ్ని సాక్షిగా వివాహము చేసికొనినభార్య. ఈమాయకుఁడు నన్నిటెనినము

నాయింటికతిథిగావచ్చెను. నేనితనినాదరించియన్నముపెట్టిస్థలమిచ్చితిని. రాత్రివేళనన్ను మోసపుచ్చినాభార్యంగొనివచ్చెను, తెల్లవాఱినవెనుక నేను నా భార్యనుంగానక యచ్చటచ్చటవెదకి జాడలంగనిపెట్టివచ్చితిని. ఈ యిరువురను దేవరవారి కొలువుకూటమునం గనిపెట్టితిని. ఇట్టి యన్యాయము మోసదైననుగలదా! మీరువిచారించి యీదురాత్మునకుందగిన దండనగావించి, నాభార్యనునాకునిప్పించవలయుననిపలికిదుఃఖించెను. ఆ రాజేంద్రుండు వానినాదరించి భయపడకుండుమని మొదటివానింబిలిచి, ఓరీ, యిదినీభార్యయనిపలికితివి,నీదొంగతనము తెలియవచ్చె. ఆదరించి యన్నముపెట్టినవానిభార్యం గొనివచ్చిన దుర్నీతివి, నీకుందగినదండన గావింపక విడువను. నిజముచెప్పుమనిన, నతండుచక్రవర్తికినమస్కరించి, రాజేంద్రా, నేనుబొంకులాడువాండనుగాను, నేనగ్నిసాక్షిగావివాహము చేసుకొనినభార్యగాని వేఱుకాదు. వీండెవండోదురాత్ముండు, మావస్త్రాభరణాదులపహరించిన దొంగలలో వీండొకండుగానుండును, నాభార్యంగూడ నపహరింపందలంచి దేవరవారితో నిట్లు ప్రేలుచున్నాండు, వీనికిందగినదండనగావించుండనిపలికెను. ఆరాజేంద్రునకు నేమియునుదోంచక, ఓహో! యిది మిగులంజిత్రమైన వివాదముగానున్నది, వీరికిసాక్షులెవ్వరు ? ఈసుందరీమణినివిచారించి వీరిద్దఱిలో నేరముగలవానిశిక్షింపవలయు నని యోచించి, యాబిసరుహపత్రాక్షినిం దగ్గఱకుం బిలిచి, చంద్రముఖీ, నీవునిజముచెప్పుము, వీరిలోనెవరు నీభర్త? యనియడిగిన నాకంజదళాక్షి, పుణ్యాత్మా, దేవరవారితోనేనేమనిచెప్పుదును! రూపమునందును, నాకారమందును, యౌవనమందునునిద్దఱునొక్కటేవిధముగా నున్నారు, నాకేమియుం దోంచలేదు, మిగుల మోసముగా నున్నదని పలికెను. ఆరాజేంద్రుండు వారినింజక్కగాం బరిశీలించిచూచి వారిరువురి రూపంబు లొక్కటిగానుండుటం బట్టి భేదమేమియుం గనంజాలక యద్భుతమునొంది, యిందుముఖీ! నీభర్తయందేమి గుఱుతులున్నవో చెప్పుమనిన నామాయలాడి యిట్లనియె.

ఓపుడమిఱేఁడా! నాపతికి నెడమతొడయందు గాయపడిన మచ్చయుం, గుడిభుజముమీందం బుట్టుమచ్చయు నున్నవనిచెప్పెను. అంత నా ప్రభువువారింజూచి మీమీ తొడలయందును భుజములయందును

నుండెడు నంగమచ్ఛములఁ జూపుఁడనిన, వారిద్దఱు నాయువిదచెప్పిన చొప్పున గుఱుతులఁ జూపించిరి. ఆమండలాధిపతి మిగులనద్భుతమంది యామృగాక్షినింజూచి, యిందుముఖీ, యిఁకనేమిచేయవచ్చునని యడిగిన నాయువతీమణి నాభర్త తనకుడిహస్తమున నగ్నియు నెడమహస్తమున నుదకంబును సృజించఁగలం డనిచెప్పెను. ప్రభువు వారిరువురినింజూచి మీలోనెవరు కుడిహస్తమున నగ్నియు నెడమహస్తమున నుదకంబును బుట్టింతురో వారికి నీమెభార్యయని పలికిన, వారు నేనుసృజింపఁగలను నేనుసృజింపఁగలనని యిద్దఱుం గుడియెడమహస్తముల ననలోదకముల సృజించినంజూచి యా రాజేంద్రుఁ డద్భుతమంది, యాహా! యిట్టివాద మెట్లు పరిష్కరింపనగునని మనంబునఁదర్కించుచుండఁగా నామాయా వాదులిరువురుం బ్రభువునకునమస్కరించి, రాజేంద్రా! మేమిరువురము యుద్ధముచేసి మాలోనెవ్వఁడుబ్రదికివచ్చునో వానికీయువతీమణి నీయ వలయునని పలికిరి. ఆమండలాధిపతి తనమనంబున నీదురాత్ములిరువురు హతులైనవెనుక మన మీయిందుముఖిని వివాహముచేసుకొంద మని యోచించి వారిచ్చనప్పుడే యుద్ధంబునకు సెలవిచ్చెను. అంతనాయిర్వురు మాయకులునుభుజములఁదట్టుచు ఘోరరూపులై వీరాలాపములాడుచుం గొంతసేపుభూమిమీఁద మల్లయుద్ధములంబోరాడి, మింటికెగసి యందు భయంకరములైన తర్జనభర్జనాదులు సేయుచుఁ బ్రతాపములు పలుకుచు, రక్తములు గురియించుచుఁ గండలుదొఱఁగించుచు, నార్భాటములు సేయుచుం బోరాడుచుండిన, నారాజేంద్రుఁడు వెఱఁగుపడి మనకేమి యుపద్రవములు గావింతురో యని యోచించుచుండఁగా, నాయిరువురి శిరంబులును గాత్రములును భూమిమీఁదం బడుటనుంజూచి యామాయ లాడి, యకటా! మీరిరువురును హతులైతిరాయని దుఃఖించుచుండెను. ఆమండలాధిపతియును వారిగాత్రములను శిరములనుజూచి, దురాత్ము లిర్వురుహతులైరి, మనయిష్టము దీర్చుకోవచ్చునని మనంబుననుప్పొంగి యాకులుకులాడిం జూచి, యోహో! సుందరీరత్నమా, యీదురాత్ముల నిమిత్తము నీవేలశోకించెదవు. నేనుండఁగా నీకేమిభయము, నేనిన్ను వివాహము చేసుకొని పట్టపుదేవిగాఁగైకొందును, నీకిది సంతోషకాల ముగాని దుఃఖకాలముగాదు, నీవు నగుమొగముతో నన్నుంజూడుమనిన,

నా యిందుముఖి, రాజేంద్రా, నన్ను నీబంధువులు నిందించి రట్టుపఱతు రేమోయనిపలికిన, నతఁడు నిన్ను నాబంధువులు గొనియాడునటులఁ జేయుదును సంశయింపవలదనిన నా మాయలాడి ముఖ కమలమును వికసింపఁజేసి క్రీఁగంటిచూపులఁ బ్రభువునుజూచెను. ఆరాజేంద్రుఁడు పంచశరుని బాణములకుం దత్తరపాటునొంది వివాహయత్నముగావించి యాపూఁబోఁడిం దనయంతఃపురమునకనిపి పురిశ్శృంగారమును గావించు చుండఁగా, దేవేంద్రుఁడుదేవగణములతోడవచ్చి యారాజేంద్రునిచేతం బూజింపఁబడియతనియభిప్రాయమునెఱింగి, తానావివాహమునకు ముం దు నిలిచి నిర్విఘ్నముగా వివాహమును నెఱవేర్చి యాదంపతులదీవించి తనలోకమునకుంబోయెను.త్రిమూర్తులునువచ్చిదీవించి,యిదిజగన్మోహిని నీయదృష్టవశమున నీకుసంభవించెను. సుఖముగానుండుఁడని పలికి వారి వారి లోకములకుంబోయిరి. అంతనారాజేంద్రుఁడు మిగుల సుందరియైన యాభార్యతో నెల్లసుఖములనుభవించుచుం బహుదినములు కొలువు కూటమునకుంబోక యంతఃపురముననుండి, పదియాఱవదినము సభకుం బోయి తనసింహాసనముమీఁదంగూర్చుండి విచారణ చేయుచుండఁగా, నామాయకులలో నొకఁడువచ్చి ప్రభువునకునమస్కరించి, రాజేంద్రా, నాశత్రువునుహతముచేసివచ్చితిని, నాభార్యను నాకిండనియడిగిన నా మండలాధిపతి యతనింజూచి గుండెలు ఝల్లనవెఱఁగుపడి, కొంతసేపు మాన్పడియుండి, పిమ్మటఁగొంతధైర్యమునొంది, యోరిమాయకుఁడా, యింతకుముందుగా నీశత్రువువచ్చి యాలతాంగిందోడ్కొనిపోయెను. పిమ్మట నీవునువచ్చి యడుగుచున్నావు. మీమాయలు మంత్రములు మాకుఁదెలియవు వచ్చినత్రోవంబట్టి పొమ్మని గదమాయించిపలికిన, నామాయకుఁడు పక్కుననగి, యోహో, రాజేంద్రా, నీవుసత్యసంధుఁడ వనినమ్మితి,నిటుల నబద్ధములాడవచ్చునా ? ఆచిన్నవాఁడు నావెంబడిన నావస్త్రము నాకబ్బునను లోకోక్తి ప్రకారము మేమిరువురము యుద్ధము చేసివచ్చినవెనుక, మాభార్యను వివాహముచేసికొన యత్నించి యుంటివిగాఁబోలును. ఆహా! నీయిష్టము నెఱవేర్చుకొనినట్లున్నది. అందు వలననేయబద్ధమాడితివి. నేనునాశత్రువుంజంపివచ్చియుండఁగా వాఁడు వచ్చి వెంటఁబెట్టుకొనిపోయె నంటివి, కటకటా! యిట్టియకృత్యమెందైనఁ

గలదా ! సత్యసంధుఁడ వని నమ్మితిని. పరస్త్రీలోలుండ వని యెఱుంగక మోసపోతిని. ఇప్పుడైనను నాభార్యను నాకిమ్ము, నేను దప్పిదము లెంచువాఁడను గాను, నీవు పరిపూర్ణకటాక్షముతో నాభార్యను నాకొప్పగింపుము, లేనియెడలఁ బ్రమాదము సంభవించును, నీవుచూచుచుండఁగానే యంతఃపురమునుండి నాభార్యనురప్పించి, నీపట్టణమంతయుం గాల్చి మహాప్రవాహములోఁ గొట్టుకొనిపోవునట్లు సేయుదు ననిపలికెను. అందు కా రాజేంద్రుఁ డేమియుఁ బలుకక విచార పడుచుండఁగా, నా మాంత్రికుఁడు వెంటనే తనభార్యనురప్పించి, యోసిదుష్టాత్మురాలా, నాప్రభావ మెఱింగియును సుఖమునకాశించి, రాజేంద్రుని వివాహము చేసుకొంటివిగదా, నిన్ను వ్రతభంగముగావించిన యీ చక్రవర్తిపాటు చూడుమనిపలికి, యతనిపట్టణముమీఁదనగ్నిదరికొలిపెను. అగ్నిదేవుఁడు చిటిలిపెటిలియనుశబ్దముతో నిప్పుకణములను రాల్చుచు ఘోరముగా మండుచు, నాపురియంతయుఁ గాల్చిభస్మముగావించుటను జూచి యా రాజేంద్రుఁడు పెనుదుఃఖముతో నేమియునుజేయఁజాలకుండఁగా, నంతట మేఘములుగ్రమ్మి యుఱుములు మెఱుములతోడ మిగుల విస్తారమైన వర్షమునుగురిపించి గొప్పప్రవాహముగావించెను. భయంకరమైన యా ప్రవాహములో నేనుఁగులును, గుఱ్ఱములును, బదాతులును, బత్నీపుత్ర బంధువర్గంబులునుగొట్టుకొనిపోవుటంజూచి భయభ్రాంతుఁడై యచ్చెరువందియుండఁగా, నాప్రవాహము కొలువుకూటమునుముంచి తనమంత్రులనుసామంతరాజులను విద్వజ్జనంబులను గొట్టుకొనిపోవుటంజూచి, యా మండలాధిపతి కన్నీరు విడుచుచుండిన, నా ప్రవాహ మతనిసింహాసనమును బోర్లపడఁద్రోచిన నా రాజేంద్రుు, డాహా ! పరస్త్రీగమనముచే నిట్లు సంప్రాప్తమయ్యె ! నేమిచేయవచ్చు ననిదుఃఖించుచు, నాప్రవాహముమీఁద గొట్టుకొనిపోవుచు, నెవ్వరురక్షించఁగలరని తత్తరపడుచు, నొక సాలవృక్షమాప్రవాహముమీఁదంగొట్టుకొని వచ్చుటంజూచి త్వరితముగా దానింబట్టుకొని ప్రాణములనుదప్పించుకొని యావృక్షముతోడ నొకద్వీపమునుజేరి, యటనావృక్షమును విడుచుటకును, జేతులను గదలించుటకునుసాధ్యపడక దుఃఖించుచుండిన, నచటికొక సుందరీరత్నమువచ్చి యతనిపట్టువదలించి యతనిచుట్టును నగ్నిదరికొలిపి వేడిమిని

బుట్టించెను. అంతనామండలాధిపతికిఁ గాలుసేతులువశపడిలేచి కూర్చుండి, యాంతలోఁదరినిఁ జూచి, యిఁగుముఖీ! నీవెవ్వరివిదానవు నాప్రాణములను గాపాడుటకై వచ్చిన ధర్మదేవతవు గానుందువో యనిన నా కన్నియ, రాజేంద్రా, నేనుధర్మదేవతనుగాను, ధర్మదేవత నాయక్క యదిమాలది, నేను గుక్కనుదినినదానను, పెండ్లిలేనికన్నియను, నిన్నువివాహముచేసుకొనయత్నించివచ్చినానవిపలికిన, నతఁడు తలయాడించి, యోహో! యిదియేమన్యాయము! నేనుత్తమక్షత్రియుఁడను, నీవుమిగులసుందరివి. నీవృత్తాంతమునునిజముగాజెప్పుమనిన నా కంజదళాక్షి, రాజేంద్రా, యీ ద్వీపమునందుండువారందఱును మాజాతివారేగాని వేఱొక జాతి వారులేరు. అందఱును గుక్కనుదినినవారే, మాకుజాతియునుగులగోత్రములును లేవు. అరుంధతి మాజాతికన్నియ, శ్యామలాశక్తియును మా కులమేగానివేఱుకాదు, పందినిందినిన పరిదేశులువచ్చి యాయిరువురు మహాపతివ్రతలను వివాహముచేసుకొని మిగులఁ గీర్తిపొంది రని పలికిన నాచక్రవర్తి, యకటా! పశువుందినెడు పంచములకంటెఁ గుక్కందినెడు శ్వపచులుహీనులు, మిగులనిషిద్ధులు. ఐనను నీకన్నియ మిగులసుందరి. ఎటులవివాహముచేసుకొందును? ఏమిచేయుదును? దైవమా! యని విచారపడుచువిధినాథునిందూఱుచు, నేమియుఁదోఁచక విచారపడుచుండిన, నాకన్యకామణి యారాజేంద్రుని మనస్సంకటమును గ్రహించి యతనికి నమస్కరించి,పుణ్యాత్మా,మేము మాలవారమని శ్వపచులమని యోచించవలదు, మేముకుక్కనుందినినవారమనిచెప్పితిని. అనఁగా నహంకారము లేనివారము, మాకుఁబితృదేవతలు ప్రత్యక్షముగాఁగనుపింతురు, నీమనస్సంకటమునువిడిచి, నిన్నుబంధవిముక్తునిఁగాఁజేసిన నన్నాగరించి దయతోవివాహముచేసుకొనుమని ప్రార్థించిన, నారాజేంద్రుం డాశ్చర్యపడి, యాహా! వీరికింబితృదేవతలుప్రత్యక్షమగుటెట్లు? నిషిద్ధమైనకులముగానుండినయెడలఁ బితృదేవతలెట్లుప్రత్యక్షమగుదురు? మిగులనుత్తమకులముగానేయుండుననియోచించి, యాకన్నియయందు మోహముగలవాఁడై, యోకన్యకారత్నమా, నేనుదిక్కులేనివాఁడను నన్నురక్షించుభారమునీది, నీవుండుద్వీపమునకుఁబోదమనిన నాకన్నియ, ప్రాణనాథా, నిన్నుదేవునిఁగానెంచి పూజించుచునెల్లసుఖముల నిచ్చెదను, నీవుమనో

వ్యాకూలమును విడిచి రమ్మని వెంటఁబెట్టుకొనిపోయి తనతల్లిదండ్రులకుం జెప్పిచూపించెను. దానిజననీజనకులు మిగులసంతసించి వివాహము గావించిరి. ఆరాజేంద్రుఁడు మిగుల గుణవంతురాలైన భార్యతో నెల్ల సుఖములననుభవించుచు, నొకనాఁడుభార్యంజూచి, ప్రాణనాయకీ, నిన్ను వివాహముచేసుకొని యైదుసంవత్సరములాయెను. ఇంతవఱకునాకుం బితృదేవతలదర్శనము గాకుండుటకుఁగారణమెయ్యది? యనిపలికిన, నా కంజదళాక్షి, ప్రాణనాథా, దేవరవారి చిత్తమునకుం గలిగిన చాంచల్యమింతవఱకుస్థిరపడక యున్నది. ఆచిత్తముస్థిరపడినయెడలమనకుసంతానము కలుగును, సంతానముకలిగినవెంటనే పితృదేవతలుదర్శనమిత్తురు. కాఁబట్టి శోకరహితమైనచిత్తముతోనుండుఁడనిపలికెను. ఆరాజేంద్రుఁడు తనమనోభావమును గ్రహించిన భార్యనుమెచ్చుకొని మిగుల నన్యోన్యమైన మైత్రికలిగివర్తించుటంబట్టి యతని భార్యగర్భమునుధరియించి మగబిడ్డనుంగనెను. చక్రవర్తియత్యంతసంతోషమునుబొంది పుత్రోత్సవాదికార్యములను నెఱవేర్చి యాబిడ్డను నత్యంతప్రేమతోఁ బెనుచుచుఁ బితృదేవతలనుదర్శించి యానందించుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడారాజేంద్రుఁడు భార్యంజూచి, ప్రాణనాయకీ, నేనీద్వీపమునకువచ్చినిన్నువివాహమాడి యిరువదిసంవత్సరములాయెను, మనబిడ్డకుఁ బదునైదుసంవత్సరముల ప్రాయమాయెను. ఇంతవఱకుఁదగుమైనవిద్యాభ్యాసములేకయున్నది ఎందైననొకపట్టణమునకుంబోవుటయుక్తమనితోఁచుచున్నది, నీయిష్టముచెప్పుమని యడిగిననాయువిదయుసంతసించి, ప్రాణనాథా! మనముండినయీద్వీపమునకుఁగ్రింది భాగమున నొక గొప్పపట్టణమున్నది, దేవరవారియిష్టప్రకారమచటికిం బోదమనిన, నారాజేంద్రుఁడు భార్యయందుమిగులఁ బ్రేమగలవాఁడై పుత్రునింబత్నినిందోడ్కొని యాద్వీపమునుదిగి, తనపట్టణమునుగొలువుకూటమునుజూచి యద్భుతమునొంది, ప్రాణనాయకీ, యిరువదిసంవత్సరములకు ముం దీపట్టణమంతయు నగ్నిచేఁగాలిపోయెను. మఱల నెవరు నిర్మించిరో తెలియదు. నాసభామంటపమును సింహాసనమునుగనుపించుచున్నవి. మన మచటికింబోయి మంగళవాద్యములు వచ్చునంతవఱకు నుంద మనివారినివెంటఁబెట్టుకొనివచ్చి తనసింహాసనముమీఁదం గూ

ర్చుండి, బిడ్డనుదొడమీఁదం గూర్చుండఁబెట్టుకొని భార్యనెదుటనిలుపుకొనిసంభాషించుచు, నాయింద్రజాలకుని మహిమవలన నేత్రములనుదెఱచి, భార్యనుబిడ్డనుగానక యాశ్చర్యముతో నలుదిక్కులం బరికించుచుఁ దనసభికులందఱఁ జూచి మిగులనాశ్చర్యానందభరితుండై, యోహో! మిత్రులారా, నాతో నింతకుముందు భాషించుచుండిన నాభార్యయు నా తొడమీఁదనుండిన నాబిడ్డయునెందుఁబోయిరి. అయ్యో! యిది మటుమాయముగనున్నది, మీరుచూడలేదా? యనియడిగిన, నా సభవారందఱునాశ్చర్యపడి యేమియుఁబలుకకుండిరి. ప్రథమమంత్రియైనసునీతి ప్రభువునుంజూచి, రాజేంద్రా, దేవరవారు నిద్రమైకముచే నేత్రములను బదినిమిషములకాలము మూసుకొంటిరి, నిద్రాభంగముగావించుటకు నోడి మేమందఱము నిశ్శబ్దముగానుంటిమి. ఇంతలో దేవరవారికిస్వప్నము గలిగియుండునేగాని నిజముకాదు. దేవరవారిభార్యయును బిడ్డయును మనసభ కెన్నఁడును రాలే దనిపలికిన, నారాజేంద్రుఁడు వెఱఁగుపడి, మిత్రుఁడా, నిజముగాజరిగినవర్తమానముగానికలగాదు. ఇరువది సంవత్సరములుండియనుభవించి వచ్చినయనుభవమునునీవుస్వప్నమనిచెప్పుటెట్లు? మనకన్నులకెదుటఁ బట్టణమంతయుఁగాలిభస్మమాయెఁగదా, మన మందఱము మహాప్రవాహమునం గొట్టుకొనిపోతిమిగదా, మీరెటులఁ బ్రాణములఁదప్పించుకొనివచ్చితిరి? మఱల మనపురమెవ్వరు సృజించిరి? ఆమంత్రిగాఁ డెందుఁబోయెను? జరిగినవివాదమంతయును, నింద్రాది దేవతలువచ్చి వివాహముగావించుటయు, నామాంత్రికులలోనొకఁడు వచ్చి చేసినదుర్మార్గమును మీకుం దెలియునుగదా? అందుపైనజరిగిన వర్తమానమంతయునువినుఁడని సర్వమునెఱింగించిన, నాసభవారందఱును విని యద్భుతమునొందిరి. ప్రథమమంత్రియైనసునీతి, రాజేంద్రా, స్వమబద్ధము. అంతయుహుళిక్కి. అనుభవముకల్ల. జరిగినదంతయుదబ్బర. నిజముకొంచెమైనను లేదు. స్వప్నమున మీకటులఁదోఁచియుండును. మేల్కనిన సర్వము దబ్బర. ఏమియులేదు. మనసభకు నీబీదబ్రాహ్మణుఁడు దప్ప నితరులెవ్వరునురాలేదు. మనపురమెన్నఁడును గాలిపోలేదు. మహాప్రవాహములో మనముగొట్టుకొనిపోలేదు. అంతయు సుమా రిరువదినిమిషములుండును. ఇంతలో మీరెన్నఁడుశ్వేతద్వీపమున నిరువదిసంవత్సర

ములుండివచ్చితిరి ? సర్వమబద్ధము. స్వప్నమునమీఁచిత్తమునకట్లుతోఁచి యుండుననిపలికెను ఆసభికులందఱునిజముగాస్వప్నమేయనియాశ్చర్య పడుచుండిరి. అంతరాజేంద్రుఁడు మనఃప్రత్యక్షముగాననుభవించివచ్చిన యనుభవమంతయును సభికులు కలయనిచెప్పుచున్నారని యోచించు చుండఁగా, నాయింద్రజాలకుఁడుప్రభునుంజూచి, రాజేంద్రా, నేనుదేవర వారితోనేనింద్రజాలకుఁడనని చెప్పుచు నా విద్యావినోదముంజూపించితి. అందువలన దేవరవారిసభకు నొకపురుషుఁడును స్త్రీయునువచ్చివారివర్త మానమునుజెప్పుకొనుచుండిరి. వెంటనే వేఱొకపురుషుఁడువచ్చి తప్పు వాదముచేసివానితోనెదిరించియిద్దఱుయుద్ధముచేసిచచ్చిరి ఆసుందరీమణి మూలమాయ, దేవేంద్రుఁడువచ్చిదానినిమీఁకుంబెండ్లిగావించెను. త్రిమూ ర్తులునువచ్చిదీవించిరి. ఇరువదిసంవత్సరములు జ్ఞానశక్తితోఁగూడిబిడ్డ సుంగని పితృదేవతలనుదర్శించివచ్చితిరి, సర్వమునాజాలముగానినిజము గాదు, స్వప్నముంగాదు, చిత్తవ్యాప్తియేగానిమీశరీరమెందునుంబోలే దనిచెప్పిన, నతఁడద్భుతమునొందిముక్కుమీఁద వ్రేలుపెట్టుకొని, మ హాత్మా, మఱలనీవిద్యావినోదమును జూపుఁడనిన నతఁడుతనహస్తమం దుండిన నెమిలి యీఁకలకుంచెనుద్రిప్పిచిత్తసంకల్పమునుబొందించెను. ఆవెంటనే ప్రభువును సభికులును నిద్రచేమైమఱచి నేత్రములనుమూసి గొప్పవెలుఁగునుంగాంచి, దశవిధనాదములనువిని యీవింతవాద్యము లెక్కడి వనియోచించుచుండఁగా, నింద్రాదిదేవతలును మహర్షులును వచ్చి యాప్రభువునుదీవించి, పావనచరితా, మహేంద్రలోకమునకు దేవరవారిందోడ్కొని వచ్చితిమని త్వరితముగానతని సభికులతోడ వి మానముమీఁదం గూర్చుండఁబెట్టుకొనిపోయి యా మహేంద్రునిసభలో విడిచిరి. ఆచక్రవర్తి సన్మానింపఁబడి మిగులనద్భుతమైనయాకొలువు కూటమునంగూర్చుండియామహాత్మునింద్రిమూర్తులుసహాసభికులఁజూచి యాశ్చర్యపడుచుఁ దనసభికులకుంజెప్పి చూపించుచుండెను. ఆమహేం ద్రుఁడు చక్రవర్తికిని నతనిసభికులకును వివిధమర్యాదలుగావించి వెలలేని గొప్పదేవరత్నములను వేఱువేఱుగానంగఱకినిచ్చి సెలవిచ్చెను. వారు మగుడి యా విమానము నెక్కి భూలోకమునం దమకొలువుకూటమునకు వచ్చి నేత్రములనుదెఱచి తమహస్తములందుండిన దివ్యరత్నములను

గానక, యొకరిముఖమొకరుచూచుకొనుచుదిగ్భ్రమఁజెంది, యోహోహో! మనహస్తముల ధరించిన దివ్యరత్నము లెందుఁబోయె నని యోచించుచుండిన, నాయింద్రజాలకుఁడు, పుణ్యాత్ములారా, మీరేల భ్రమించెదరు? ఇప్పుడైననామహేంద్రజాలమని తెలియవచ్చెనా? సంశయము విడిచెనా? యనిపలికిన, నారాజేంద్రుఁడునుసభికులునునామహాత్మునిం బెక్కువిధములఁగీర్తించి దివ్యవస్త్రాభరణములను, గోరినవస్తువులను, నగ్రహారములనునిచ్చి పుచ్చెనని చెప్పిన, నారామచంద్రుఁ డాశ్చర్యపడి, యోహోహో! ఇంద్రజాలపుఁగథలుమిగులనద్భుతములనిపలికిన నావసిష్ఠమహర్షి చిఱునగవుతో నతనిఁజూచి, పుణ్యాత్మ, పప్పన్నమును దినునపుడందఱికిని సంతోషమే, కడుపునొప్పికలిగినప్పుడుగదా, దానివిశేషము దెలిసికొనఁబడును, గాఁబట్టి యల్పసుఖమునకాశించి ఘోరమైననరకంబునం బుట్టుట వివేకముకాదు. జననమరణంబులును, సుఖదుఃఖంబులును, బంధమోక్షంబులును లేని, నీనిజస్వరూపమే నిత్యమైనయచలపరిపూర్ణము. అదియే పరమపదము. దానింగోరుట వివేకముగాని బంధమోక్షములత్రోవలు భ్రమరూపకములు, భ్రమవలననేజన్మములు, భ్రమలేనివారికిం బరిపూర్ణమునకంటెనేమిలేదు, గురుకటాక్షమును బొందిన తరువాతమఱలఁ దోఁచుటకునేమిలేదు, మాయయొఱుక భ్రమస్వరూపము, గాఁబట్టి మాయకు జననీజనకులు లేరు, తల్లిదండ్రులులేని దానికి మూలములేదుగాఁబట్టి పుట్టుకయును జావును లేదు, భ్రాంతివల్లనేజననమరణములు. అన్నిత్రిప్పలు ప్రకృతిద్వయమునకే. ప్రకృతిద్వయమునకు మూలములేదు. శరీరాత్మలకుమూలములేదు. కనుకఁగులగోత్రములులేవు సర్వముభ్రమ. రజ్జుసర్పభ్రాంతియేగాని, ప్రపంచమునకును స్వప్నమునకును నింద్రజాలమునకును భేదములేదు. కలలోవచ్చినశరీరములు మేల్కనిననొక్కటియైనలేకపోవునుగాఁబట్టి కలలోవచ్చిపోవు దేవతాస్వరూపములు సహసమస్తము భ్రమరూపకములేగాని దేవుఁడుగాఁడు. దేవుఁడుస్వప్నమునవచ్చి మేలుకొనినంబోవువాఁడుగాఁడు. దేవునకురాకపోకలులేవు. ఎందును నిండినిబిడీకృతమైనయచలమే దేవుఁడు. త్రిమూర్తులుభ్రమ. ఇంద్రాద[illegible]లుభ్రమ. మహేంద్రుఁడుభ్రమ. శ్రీసదాశివుఁడుభ్రమ. శ్రీమన్నారాయణమూర్తి భ్రమ. అందఱునుభ్రమస్వరూపులుగానే దెలియును. శ్లో॥ భ్రమేణాహం

భ్రమేణాత్వం భ్రమేణోపాసకంజనాః। భ్రమేణేశ్వరభావత్వం భ్రమమూల మిదంజగత్ ॥' అనియున్నదిగనుకసర్వముభ్రమ,భ్రమయేయెఱుక. ఎఱుకే యహంకారము. అహంకారమేజీవేశ్వరులు. అహంకారమేప్రకృతిపురుషులు. అహంకారమేశ్రీమన్నారాయణమూర్తి. అహంకారమే మహాలింగము. అహంకారమేత్రిమూర్తులు. అహంకారమేపంచభూతములు. అహంకారమేపంచవింశతితత్వములు. అహంకారమేకులములు. అహంకారమే నేనుబ్రాహ్మణుండనని చండాలుండనని చెప్పుచున్నది, గనుకనహంకారమే సర్వకులములు. అహంకారము లేకుండిన కులము లేదువృత్తి లేదురాకపోకలులేవు. రాకపోకలులేని దేయచలపరిపూర్ణబ్రహ్మము. అదియేపరమపదమనిచెప్పిన, నారామచంద్రుండాశ్చర్యపడి, స్వామీ, మునీంద్రా,ప్రపంచాదివృత్తులనువిడుచుట యసాధ్యంబనిపలికిన, నామునీంద్రుండు, రాజేంద్రా, యచలపరిపూర్ణముసాధ్యాసాధ్యములులేనిది, ప్రకృతిద్వయములేనిదిగాఁబట్టి దానికిఁబట్టువిడుపులు లేవు. ఏకాలమందును శరీరాత్మలుకాలేదు. ఇకఁగాఁబోదు. దానికినేజోలిపట్టదు.ప్రపంచమునెఱుఁగదు. జ్ఞానములేదు. అజ్ఞానము లేదు. ఉపాధిద్వయదోషరహితమైన పరతత్వముగనుకఁ, బజ్ఞానచైతన్యములులేవుగనుక, దానివలనభ్రమరూపకమైనయెఱుకపుట్టనేలేదు. పుట్టించఁబడనులేదు. రజ్జువునందుసర్పభ్రాంతితోఁచినటుల, నచలబ్రహ్మమునందుఁ బ్రపంచభ్రాంతితోఁచుచుండును. ఎండమావులయందు నీరులేనటుల విచారణపరులకు భ్రమరూపకమైనయెఱుకలేకపోవుచున్నది. ఎఱుకవచ్చినవిధమును, నెఱుకపోయెడు విధమునుదెలిసిచెప్పుటకుఁద్రిమూర్తులకైననలవిగాదు.ఈయెఱుకయందుఁ దీపధికము. మిగులరుచ్యము. చిత్రవిచిత్రములకుంబుట్టిల్లు. సర్వవినోదములకుం బట్టణము. ఇంద్రజాలమహేంద్రజాలాదివిద్యలకుఁ బ్రపంచము. జననమరణములకుం బ్రవాహముగాఁబట్టి సర్వముభ్రమ. భ్రమకు మూలములేదు,భ్రమనువిడిపించుటకుగురుఁడేకారణము. ఆచార్యకటాక్షము చేతఁగానిభ్రమవిడువదనిపలికిన, నారామచంద్రుఁడద్భుతమునొంది, మునీంద్రా, భ్రాంతిలేనివారికిమహిమయు నణిమాదిసిద్ధులునుగలిగియుండునాయనియడిగిన, నాతపోధనుఁడు మందస్మితముఖుండై శ్రీరామచంద్రునింజూచి, పుణ్యాత్మా,భ్రమలేనివారే మహిమలేనివారు. భ్రమలేనివారే

యణిమాదిసిద్ధులులేనివారు. భ్రమలేనివారేబంధమోక్షములులేనివారు. భ్రమలేనివారే వేదశాస్త్రములులేనివారు. భ్రమలేనివారే ప్రపంచము లేనివారు. భ్రమలేనివారేచావుపుట్టుకలులేనివారు. భ్రమలేనివారేపుణ్య పాపములులేనివారు. భ్రమలేనివారే కులగోత్రములులేనివారు. భ్రమ లేనివారే నామరూపములులేనివారు. భ్రమలేవారే ప్రకృతిద్వయము లేనివారు. భ్రమలేనిదేయిర్వదాఱవపరతత్వము, భ్రమలేనిదేకేవలాత్మ, భ్రమలేనివారేయశరీరులు. వారుసర్వకాలసర్వావస్థలయందును సమస్త దేశములయందును సర్వలోకములయందును సమస్తవస్తువులయందును జలించకస్వతస్సిద్ధముగానుండువారు. అంతటివారేవారింగనిపెట్టవచ్చును గాని భ్రమస్వరూపులైనజ్ఞానులును యోగులునుభక్తులునువారినిం గని పెట్టఁజాలరని చెప్పిన, నారామచంద్రుఁడు విస్మయమునొంది, పావనచరితా, యచలపరిపూర్ణ బ్రహ్మమేదియుంగాదనిసెలవిచ్చితిరి. ఏమియునులేని బ్రహ్మమువలనం బ్రయోజనమెద్దియనియడిగిన నాతపోధనుండిట్లనియె.

రాజేంద్రా, యేమియునులేక యేమియునుగాకయెట్టివారిమనంబుల కుందగులక, యిట్టిదట్టి దని నిర్దేశింపరాక యుండునదియేబ్రహ్మము. అట్టి యచలబ్రహ్మమువలని ప్రయోజన మింతంతయని చెప్పటకునలవికాదు, జననమరణప్రవాహమను ఘోరనరకమునుండితొలఁగుటేప్రయోజనము. సుఖదుఃఖములు బంధమోక్షములులేనిదేప్రయోజనము. ఇంతకంటెను వేఱొండు ప్రయోజనమొకటిగలదా? మహర్షులందఱును సర్వముహేయ మనితలంచి యుగములపర్యంతము సమాధినిష్ఠలను గావించుటకు, నేప్రయోజనమునునమ్మిచేయుచున్నారు? అంతఱునుజననమరణప్రవాహ మునుండితొలఁగుటకేప్రయాసపడుచున్నారు. బుద్ధిమంతులుపదవులఁ గోరరు. జన్మశూన్యమునే కోరుదురుఁ. అట్టిమహాప్రభువు దర్శనమేజన్మ శూన్యముగాఁ బట్టి నిజస్వరూపమునుదెలిసినగురుఁడు, శిష్యునినిజస్వరూపమును సాక్షచేసిచూపించక జన్మశూన్యముకలుగనేరదు గాఁబట్టి సర్వకాలసర్వావస్థలయందునుసద్గురుపాదములనమ్మి యాతనికి వివిధశుశ్రూషలు చేయుటచేఁ గాని భ్రాంతిరహితముగానేరదనిచెప్పి నారామ చంద్రుఁ డానందభరితుండై త్రిలోకపావనుండవైనమునీంద్రా, కార్తవీర్యార్జునచక్ర వర్తిదినములలోనింద్రజాలకులుఁవచ్చి యేమేమివింతలుగావించిరి? ఆజాలమంతయు నెఱిఁగించి నాభ్రాంతినిందొలంచి జన్మశూన్యత్వమునుబొందించుఁడనివేఁడిన నా మునీంద్రుండిట్లనియె.

సగరచక్రవర్తికథముగిసెను.

—*(కార్తవీర్యార్జున చక్రవర్తికథ.)*—

శ్రీరామచంద్రా, తొల్లి కార్తవీర్యార్జునచక్రవర్తి తనభుజబలముచేత భూమండలమంతయును బాలించుచు, నొకనాఁడుమంత్రులును ప్రధానసామంతరాజులును విద్వజ్జనంబులునుగొలువ నిండుకొలువు కూటంబునంగూర్చుండియుండఁగా, నాసభకుభాస్కరుండను నొకయింద్రజాలకుఁడువచ్చితనహస్తమందలి నెమిలియీఁకలకుంచెను ప్రభువునకును పెద్దమంత్రికినిజుట్టి చిత్తసంకల్పమునుబొందించెను.

ఆవెంటనేప్రభువునకును మంత్రికిని నిద్రమైకముకలిగి నేత్రములనుమూసిన నిమిషమునకంతయు వారికిగొప్పవెలుఁగును నొక శృంగారవనమునుగనుపించెను. ఆరాజేంద్రుఁడు తనమంత్రినింజూచి, మిత్రుఁడా, మింటియందు సూర్యచంద్రుల ప్రకాశములేకయే యీవెలుఁ గెందుండివచ్చెను? ఈవనమెవ్వరి? దనియడిగిన నతఁడు, రాజేంద్రా, సూర్యచంద్రులకాంతులకుమించి యిందుంసురత్నములే ప్రకాశించుచున్నవి. ఈశృంగారవనములోనేమేమివింతలుండునో తెలియదు. ఆహా ! యిది దేవవనముగానుండునని చెప్పిన నారాజేంద్రుఁడు, చెలికాఁడా, నీమాటలునిజముగానుండును, మనమీవనమధ్యమునకుంబోయి చూతమురమ్మనియా యిరువురుంబోయియందుండునివ్యఫలకుసుమములనుజూచి తామొక్కఁడును వినికనితినియెఱుంగమని యాఫలములంగోసిభక్షించి వానిమాధుర్యమునకునద్భుతమునొందుచు,మనభాగ్యమేభాగ్యము! ఇట్టిదివ్యవనమును జూడఁగంటిమనియొకరికొకరుచెప్పుకొనుచు, జలాపేక్షులైపోయి యావనమధ్యభాగంబున బంగరుకమలములతో నొప్పెడుసరస్సును దొమ్మిదివిధములైనసోపానములను, నష్టకోణములయందును రవిచంద్రులవలె వెలుఁగుచుండెడు దివ్యరత్నములనుజూచి ముక్కులమీఁద ప్రేళ్లుపెట్టుకొని యాశ్చర్యపడుచు, నాకొలనిలోదిగిదాహమార్చుకొని దివ్యకుసుమములనుండి గుప్పుగుప్పునగుప్పెడు సుగంధతావి నాఘ్రాణించుచు, నొక విశాలమైన చలువరాతి బండమీఁదంబరుండి సుఖనిద్రఁజెంది లేచి, యాప్రభువు మంత్రినిఁజూచి, మిత్రుఁడా, దీనికింబూర్వపుదిక్కున నొక్క మంటపముగనుపించుచున్నది. దానిదగ్గఱకుంబోయి, యందలివింతలను జూచివిచారింతమురమ్మని యాయిరువురామంటపము దగ్గఱకుంబోయి



ధర్మాంగదచక్రవర్తి. ఇంద్రజాలికుఁడు. ప్రధానసామంతరాజులు. మన్త్రులు.

యందు శ్రోత్రములకానందముగా దివ్యవాద్యరవములనువిని, మిగుల సంతసించి, యామంటపములోనికింబోయియందొక రత్నపీఠమునం గూర్చుండి దివ్యవాద్యములనుజేయుచుండిన, దివ్యసుందరీరత్నమును దాని

చుట్టును వెలుఁగుచుండిన దివ్యరత్నములనుగాంచి యాశ్చర్యపడుచు నారాజేంద్రుఁ, హో హో! సుందరీరత్నమా, నీవెవ్వరిదానవు? ఒంటరిగా నీమంటపములో నుండుటకుంగారణమే? మనియడిగిన నా కన్నియ, రాజేంద్రా, నేను దేవకన్నియను. త్రిలోకభామయనుకన్యకామణికిం జెలికత్తియను, నేను దేవకన్నియనగుటంజేసి నాకుభయమును క్షుత్పిపాసలును సుషుప్తియును లేదు, నాదొఁసానియాజ్ఞప్రకార మిచట వాద్యములను జేయుచుందును, నీవృత్తాంతమంతయువినుపించుమనిన నతఁడు తనవర్తమానమంతయు నెఱిఁగించి, పుణ్యాత్మురాలా, యాత్రిలోకభామయెవ్వరు? ఆనారీమణివృత్తాంతమేమి? దానితల్లిదండ్రులెవ్వరు? సర్వము దయతో నాకువినుపించుమనివేఁడిన నాయిందుముఖియిట్లనియె.

రాజేంద్రా, యాశ్చర్యదేశమునకుఁబ్రభువైన మహేంద్రుఁడను దేవోత్తముఁడు త్రిభువనములకుం జక్రవర్తియై వినోదపురము దనకు రాజధానిగాఁజేసుకొనిపాలించుచున్నాఁడు. ఆతనికిం ద్రిలోకభామయను పుత్రికారత్నముజన్మించెను. ఆకన్నియకు మేము వేవురుచెలికత్తియ లున్నారము. మాకందఱికి నిట్టిమంటపములువేయి తనమేడయొద్దనుండి యింతవఱకును నిర్మింపఁబడియున్నవి. ఆలతాంగి తనమేడయొద్దనుండి శృంగారవనమునకుం బ్రతిదినము పండ్రెండు గడియలకు జలక్రీడార్థము వచ్చును. అప్పుడుమేమందఱమునుగూడుకొని దివ్యవాద్యములను జేయుచుందుము. రాత్రిపండ్రెండుగడియలకు మేమందఱము దానిమేడకుం బోయి వివిధవేడుకలుసలుపుచు, నరుణోదయమున కంతయువచ్చి మా మంటపములలోనుందుమని సర్వము నెఱిఁగించెను. ఆరాజేంద్రుఁడుతన మనంబున దీనిసుందరమేచపలచిత్తమును బొందించుచున్నది. దీనిదొరసాని యెంతటిసుందరమును గలిగియుండునోయని వితర్కించి, యారాజపుత్రినింజూడఁగోరి, మఱునాఁడునయమున లేచి రెండవమంటపమునొద్దకుంబోయి యందుండువింతలనుజూచి యద్భుతమునొంది తనమంత్రితో, నోమిత్రుఁడా, తొలిజన్మమున మనమేమితపంబుగాపించితిమో తెలియదు. ఇటువంటి దివ్యమంటపములను జూడఁగంటిమనిచెప్పుచు, నా మండపముచుట్టును నుండువనములోని ఫలములను గోసి భక్షించుచు దినమునకొకమంటపమునుగడచి యాయిరువురును బోవుచుండిరి.

ఇంతలో నక్కడనా మహేంద్రుఁడుతనపుత్రికి వివాహముచేయ యత్నించి తనకొలువుకూటమునకుఁ ద్రిమూర్తులను, నింద్రాదిదేవతలను, మోక్షాదిపదవులనుబొందిన పుణ్యపురుషులనుబిలిపించితనపుత్రినిరప్పించి, యమ్మా, వీరిలోనీకిష్టమైనవరుని గోరుమనిచెప్పిన నాకన్నియ నేనుయోచించిచెప్పెదనని, వారిరూపపటములను వ్రాయించి యాపటములనుం బుచ్చుకొని తనమేడకుంబోయి యాపటములనన్నింటినినిలిపి తనసహస్ర చెలికత్తియలకుం జూపించిచెప్పెను. వారిలోఁగొందఱు చెలికత్తియ, లమ్మా, రాజపుత్రికారత్నమా, మేము భూలోకచక్రవర్తినిం జూచియున్నాము. అతనింజూచిన కన్నులనీపటములనుజూచిన మాకుమిగుల హీనములుగానున్నవి. అతఁడునీయందభిలాషతోఁదనమంత్రితోడంబ్రతి దినమునొక్కొక్కమంటపమును దాఁటివచ్చుచున్నాఁడనిచెప్పిన నాకన్యకామణి పులకితదేహయై యాచక్రవర్తికిఁ దా నెదురుగాఁబోయి యందొక మంటపములో నతనింగాంచిన, నామండలాధిపతియు నతని మంత్రియుఁగ్రొక్కారుమెఱుంగు తెఱంగుననాయిందుముఖి తళుక్కున మెఱసినంజూచి యాయిరువురు నేత్రములను మూసుకొని నిశ్చేష్టితులై భూమిమీఁదంబడిరి. ఆకన్యకామణి యాచక్రవర్తినిం జక్కఁగాఁజూచి యతనిరూపపటమును వ్రాయించి పుచ్చుకొనితనతండ్రిమేడకుఁబోయి చూపించి చెప్పెను. ఆమహేంద్రుఁడును సమ్మతించి చతురంగబలముల తోడ నతనికి నెదురుగావచ్చుచుండెను. ఇంతలోనామంటపమందుండు చెలికత్తియయాయిరువురిమీఁదను బన్నీరుచల్లిలేవఁదీసి, యారాజేంద్రునింజూచి, పుణ్యాత్మా, నీభాగ్యమేమనిచెప్పవచ్చును! మారాజపుత్రియైన త్రిలోకభద్రియ నిన్నువివాహముచేసుకొనుటకుసమ్మతించి నీరూపపటమునుంగొని పోయి తనతండ్రికింజూపించి చెప్పెను. ఆమహేంద్రుఁడు త్రిమూర్తులును, నింద్రాది దేవతలును దన్నుఁగొలువఁ జతురంగబలములతోడ నీకెదురేఁగి వచ్చుచున్నాఁడనచెప్పిన, నారాజేంద్రుఁడు మిగుల సంతసించి, యోపుణ్యాత్ములారా, నీవుచేసినయుపకారమునకు నేనేమిప్రత్యుపకారము సేయనేర్తును? నీవునామంత్రినివివాహము చేసుకొనుటకు సమ్మతించుమనిన, నాకన్నియమంచిదని యారాజేంద్రుని శృంగారభూషితునిఁగాఁజేసెను. అంతనామహేంద్రుఁడు మంగళవాద్యములతోడ వచ్చి

తనకునమస్కరించినభూలోకచక్రవర్తినిం గీర్తించిదివ్యవిమానముమీఁదం గూర్చుండఁబెట్టుకొనిపోయి శుభముహూర్తంబునఁదనపుత్రినిజక్రవర్తికిని, జెలికత్తెనుమంత్రికినినిచ్చివివాహమహోత్సవముగావించెను. ఆరాజేంద్రుఁ డా త్రిలోకభామనుంగూడి వివిధసుఖము లనుభవించుచు నూతన వస్త్రాభరణముల ధరియించుచు, నూతనపదార్థములనుభుజియించు, చా మేడలోనివినోదములకు నద్భుతమునొందుచుండెను. మంత్రియును దన భార్యతోడసుఖించుచు నెల్ల వినోదములనువేడుకలనుగావించుచుండెను.

ఇట్లుండఁగానామంత్రియొకనాఁడు ప్రభువునుంజూచి, రాజేంద్రా, మనమీలోకమునకువచ్చి పదునైదుసంవత్సరములాయెను. ఇందుంసు సుఖానందముచేత సర్వమునుమఱచియుంటిమి. ఇంతటనైన మనదేశ మునకుంబోవుటయుక్తము. లేనియెడల లోకులవలన నిందింపఁబడుదు మనిచెప్పిన, నామండలాధిపతి, మిత్రుఁడా, కలంత కాలముమనలోకము న ననుభవించెడు ననుభవ మిచట నొక దినమునకు సమానముగాదు. ఇట్టిమహదానంద సుఖములనువిడిచి యెట్లుపోనేర్తు? మనిన నామంత్రి, పుణ్యాత్మా, దేవరవారు దీర్ఘాలోచన సేయకుండిన మనకు నపఖ్యాతి సంభవించునని చెప్పి సమాధానపఱచెను. ఆమండలాధిపతిమంచిదనిసమ్మ తించి యామహేంద్రుని సముఖమునకుంబోయి తనయభీష్టమునుజెప్పిన నావంధ్యాసూనుఁడు గొంతసేపువిచారపడి, యల్లుని నాలింగనముచేసు కొని, పుణ్యాత్మా, నీయుద్దేశమునకుంగారణమేమనియడిగి తెలుసుకొని యతనికి దివ్యరత్నకిరీటాది యాభరణము లన్నియునుధరియించి, దివ్య విమానముమీఁదఁ దనపుత్రిని నల్లుని, మంత్రిని తనభార్యనుగూర్చుం డఁబెట్టిసెలవిచ్చెను. ఆరాజేంద్రుఁ డావిమానమును మెల్లగానడిపించు కొని భూలోకమునకువచ్చి తనపురికివెలుపలందిగి మంగళవాద్యములును ముత్తయిదువలు వాహనములునువచ్చి పురిలోనికివెంటఁబెట్టుకొని పోవునటుల నందొక భటునిచేఁదెలియపఱచి, వానికి నెదురుచూచుచు నామాంత్రికుని మహిమవలన నేత్రములనుదెఱచి తమ భార్యలనుగానక దిగులుపడి నలుదిక్కులుపరికించుచు నాసభికులనుజూచి, యోహో! మిత్రులారా, మాతోడలమీఁదంగూర్చుండియుండినమాభార్యలెందుఁ బోయిరనియడిగిన, నా సభవారాశ్చర్యపడి, యిది యేమి వింతకార్యము!

మీభార్యలెన్నఁడును నీకొలువుకూటమునకు రాలేదు. వారెపుడువచ్చి మీతొడలమీఁదం గూర్చుండిరి? అంతయు నబద్ధము, మీరిరువురు సుమారైదు నిమిషముల కాలము నేత్రములను మూసితిరి. ఇంతలో నెంతటిస్వప్నమునుగంటిరో చెప్పుఁడనిన, నామండలాధిపతియు మంత్రియు, నోహో! మిత్రులారా, స్వప్నము కాదు, నిజముగా మేమనుభవించి వచ్చిన యనుభవముగాని కలగాదు. నిజ మని జరిగిన వృత్తాంతమంతయును జెప్పి యా దేవకన్నియనిమిత్తముగా వ్యసనపడుచుండిరి. ఆయింద్రజాలకుఁడు పన్నెతింగించి, పుణ్యాత్ములారా, నే నింద్రజాలముఁగావించితిని. అందువలనమీచిత్తములట్టుల వ్యాపించెనేగానియనుభవమేమియునులేదు. మీశరీరము లిందుండియెందునుంబోలేదు. సర్వము నా మాయగానినిజముకాదు, స్వప్నముంగాదు, ముందుమీరుధరియించిన వస్త్రాభరణములే గాని, మహేంద్రుఁడిచ్చిన దివ్యవస్త్రాభరణములు గావని వారియెదుటనిలువుటద్దమునునిలిపిరి. ఆయిరువురు నొకరిముఖమొకరుచూచుకొని ముక్కులమీఁద వ్రేళ్లుపెట్టుకొని యాశ్చర్యపడి యాయింద్రజాలకునింజూచి, మహాత్మా! నీమహిమవలన నద్భుతానంద సుఖము లనుభవించివచ్చితిమి. ఇంకొకసారి మాకు నీజాలమునుజూపుమనిన నతఁడుమంచిదని తననెమలియీఁకలకుంచెను ప్రభువునకుంజుట్టి చిత్తసంకల్పమునుబొందించెను.

ఆవెంటనే యా రాజేంద్రునకు నిద్రమైకముగలిగి నేత్రములను మూసిననిమిషమునకంతయు నామండలాధిపతికివివిధతళుకులును గొప్ప వెలుఁగునుగనఁబడి, యందొకవిదేశీయుఁడుమిగులధావళ్యమైమహారమ్యమైనయశ్వమునుదెచ్చినంజూచి యీయశ్వమెవరిదనియడిగెను. అతఁడు, రాజేంద్రా! ఇది మిగులశ్రేష్ఠమైనగుఱ్ఱము, దేవరవారిచిత్త[illegible] దెలిసిమెలఁగునటులసాధకపఱచియున్నాను, దీనివెలనాకుఁదెలియదు. ఏలినవారుదీని నెక్కి స్వారిచేసిన పిమ్మట నాకేమియిప్పించిననుబుచ్చుకొందుననిపలికిన, నారాజేంద్రుఁడుతనసింహాసనమునుండిలేచితనకుడిహస్తముతో దానిదేహమునుదడివి, తనకాశెనుబిగించికట్టి కిరీటముపడకుండునటులమకుటమునుగట్టిగాఁగట్టుకొని యాతురగమునెక్కి కూర్చుండెను. ఆమాయాతురగము చిత్రగతులభూమి మీఁదందిరుగుచుఁ దనత్రొక్కులను

విడలించుకొని యుప్పరవీధికెగసి వాయువేగముగాఁ బోవుచుండెను. ఆగుఱ్ఱముయొక్క వేగమునకు నారాజేంద్రుఁడు భయాశ్చర్యములును బ్రాణభీతియునుబొంది, ఓహోదైవమా! నేఁ డీయశ్వము నన్నంతము నొందించునటులనున్నది. ఇట్టి సమయమున నీవుతప్ప నాకువేఱు రక్షకులు లేరనిపరమాత్మునిధ్యానించుచు నెలుఁగెత్తియేడ్చుచు, గళ్లెమును బిగియంబట్టుచు విధినాధునిం దూఱుచుండెను. ఆనాయాతురగము ప్రభువుభయపడుటను గ్రహించి తనవేగమునుమట్టుపఱచి పోయిపోయి యందొకద్వీపమునుజేరెను. ఆరాజేంద్రుఁడు త్వరితముగానాయశ్వమును దిగి, అబ్బా! పునర్జీవితుండనైతినని కొంతమట్టుకుసంతసించియాగుఱ్ఱమును జూచుచుండఁగానే యది [illegible]టుమాయముగాఁబోయెను.

ఆమండలాధిపతియాశ్చర్యపడి, యాహా! యిదియేమి వింతకార్యము! అశ్వమెందుఁబోయెనని యోచించుచు సూర్యకిరణములకుండాళఁజాలక యందొక కపిద్ధవృక్షము క్రిందంగూర్చుండి, యోహో! యిదియే లోకమో, యేదివియో తెలియదు. ఇందుండుభూరజమంతయునువర్ణమువలెఁ దళతళమెఱయుచున్నది. ఇందుండురాళ్లన్నియును రత్నములవలెఁబ్రకాశించుచున్నవి. క్షుత్పిపాసలనుభరించుట దుస్తరముగానున్నదని, యాచెట్టుక్రిందరాలినవెలగపండ్లనుంగొట్టిభక్షించుచు దూరముగా నొకపట్టణమునుజూచి, యాపురిలోదేవతలుందురో లేక రాక్షసులుందురో యనివితర్కించుచు నొకనారీమణినింగాంచి, యోపుణ్యాత్మురాలా! నేనుభూలోకచక్రవర్తిని, దారిదప్పి యీద్వీపమునకువచ్చితిని, మిగులఁ దప్పిగొనియున్నాను. ఈద్వీపమెయ్యది? ఆపురమునకుఁబేరెయ్యది? పాలించువారెవ్వరు? జలములుండు చోటెయ్యది? యనియడిగిన నాపడఁతి యతనికినమస్కరించి, స్వామీ! ఇదిసంకల్పమను ద్వీపము. అది వికల్పమనుపట్టణము, భ్రిమాదేవియను మతంగకన్యకామణి ధర్మయుక్తముగా రాజ్యమునుబాలించుచున్నది. ఆకన్యకామణి సుందరలావణ్యవిశేషములనుఁజెప్పుటకు బ్రహ్మేంద్రాదులకైన నలవిగాదు. పురిలోనందప్పమీకెందునునీళ్లుదొరకవు, మీవయోరూపలావణ్యములను జూచి మారాణి మిమ్ముఁబరించుననితోఁచుచున్నది. పూర్వజన్మమునమీవెట్టితపంబుఁగావించితివో తెలియదు, నీభాగ్యమేభాగ్యమనిపలుకుచుండఁగా, నా

భ్రమాదేవిశృంగారభూషితురాలై, యాణిముత్యములకుచ్చులు వ్రేలాడెడు నవరత్నఖచితమైన యపరంజి పల్లకిలోఁ గూర్చుండి పట్టపుటేనుఁగును శృంగారించి వెంటఁబెట్టుకొని మంగళవాద్యములతోడ మూడు వేలస్త్రీలు వివిధాయుధములధరియించి బరాబరులునేయుచు ముందునడువఁగాఁ, గొందఱుముద్దియలు ఛత్రచామరములువేయుచు వెంబడిరాఁగా, నాయువతీమణియాప్రభువునుంజూచి, యోరాజేంద్రా! మాభ్రమాదేవికిభూతభవిష్యద్వర్తమానములు దెలియును, దేవరవారు వచ్చినసమాచారమెఱింగివచ్చుచున్నదనిచెప్పుచుండఁగా నాకన్యకామణి యతనిదగ్గఱకువచ్చి పల్లకిదిగినంజూచి యారాజేంద్రుఁడు దానిరూపముఁ జూడఁజాలక నేత్రములనుమూసుకొని భూమిమీఁదంబడెను. ఆకన్నియ యతనిముఖముమీఁదంబన్నీరుచల్లిలేవఁదీసికూర్చుండఁబెట్టి, రాజేంద్రా! దేవరవారుమూర్ఛిల్లుటకుఁగతంబెయ్యది ? నాదేహకాంతులకేమూర్ఛిల్లితిరో, లేకమతంగకన్నియయనిమనంబొప్పకసొమ్మసిల్లితిరో ? ఇందుండు సువర్ణమును రత్నములనుజూచి భ్రాంతిచే మైమఱచితిరో నిజము చెప్పుఁడు, సుగుణసంపత్తియే విశేషార్థముగాని కులరూపములు విశేషార్థములుగావు. ఏకులజుండైననుబ్రహ్మజ్ఞానముచేతనే బ్రాహ్మణుండగును. మీకులగురుండైన వసిష్ఠ మహాఋషి మాజాతి కన్నియయైన యరుంధతిని వివాహముచేసుకొని త్రిలోకపూజ్యుండుగాకుండెనా ? మీకేలభేదమెంచెదరు. నేనుత్రికాలజ్ఞానిని, నావలన మీకుంగీర్తియును యశస్సును నాయుర్వృద్ధియునుమోక్షమునుగల్గుటకు సందియములేదు. మీరుసంశయింపక ముఖమెత్తినన్నుంజూడుఁడనిన, నామండలాధిపతికి మనస్సంశయమువిడువక ముఖమెత్తి యాపూర్ణేందుముఖినిం జూచి నేత్రములకుమిఱుమిట్లుకలిగి నిలువనోపక మగుడభూమిమీఁదవ్రాలినం జూచి, యాలలనామణి మఱల నతనిలేవఁదీసి యతనికంఠమున దివ్యరత్నాభరణముంచి యాపట్టపుటేనుఁగుమీఁదంగూర్చుండఁబెట్టితానొక పల్లకిలోఁగూర్చుండి మంగళవాద్యములతోడం బురిలోనికి వెంటఁబెట్టుకొని పోవుచుండెను.

ఆరాజేంద్రుఁడు తనమనంబున, నకటా! విధాత యిట్టిజగన్మోహినిని మతంగకన్నియఁగా నేలసృజించెను! ఆహా! దీనిసుందరమునకు సరి

మైనస్త్రీ లే లోకమందునునుండరు. దేవగంధర్వ యక్షకిన్నరస్త్రీలు దీనిపాదరేణువునకుసరిరారు. దీనితో భోగించనివాని జన్మమెందుకు? ఈ ఋశాంగివలనంగలిగినచండాలత్వమును దపస్సిద్ధివలనం బాపికొందును, [illegible]ంకమహాఋషికి నల్లుండునునైన మనగురుండు [illegible]కపూజ్యుండుగాకుండెనా? గార్దభమునకుం బుట్టిన గా[illegible]మహాఋషి తపస్సువలనం బూజ్యుండుగాకుండెనా! చాకితకుంబుట్టిన నారదమహాఋషి బ్రహ్మజ్ఞానముచేఁ ద్రిలోకపూజ్యుండు గాకుండెనా? కులమువలనఁ బ్రయోజనము లేదు, మతంగకన్నియలు గారా శ్యామలాశక్తియును నాయరుంధతియును? వీరేగదా యిపుడు లోకమాత లని ప్రసిద్ధలై యున్నారు. అహంకారమువలననే కులగోత్రములు. అహంకారములేనివారికిం గులముతో టిపనిలేదు. సర్వమును శుక్లశోణిత కులములు. ఇంతకంటె వేఱొండుకులము లేదు గాఁ బట్టిమిగుల సుందరియైనయీకన్యకామణితోడసుఖించుటే మోక్షమని పెక్కువిధముల యోచించుచుండఁబోయెను. ఆభ్రమాదేవిపురమంతయును మంగళవాద్యములతోడం జుట్టియంతఃపురములోనికిం దోడ్కొనిపోయి మైదుదినములు నగ్నిసాక్షిగా వివాహముచేసుకొనెను. ఆరాజేంద్రుండు త్రిలోకములను భ్రమింపంజేసెడు దివ్యసుందరియైన యాభ్రమాదేవినింగూడి మెల్లసుఖము లనుభవించుచుఁ బ్రతిదినము నూతనపదార్థముల భుజియించుచు, నాకన్యకామణివినోదమంటపమునకుందాపించియుండిన దివ్యరత్నములనుజూచిచూచియచ్చెరువందుచు, దివారాత్రులని యెఱుంగఁబడక దారుణమైన మోహమునందగిలి ప్రమత్తుండై దేహమునుమఱచి యిరువదిసంవత్సరములు మహదానందసుఖముల ననుభవించుచు, ముగ్గురుమగబిడ్డలను నలుగు రాడు బిడ్డలనుంగాంచి, యాబిడ్డలతోఁగొంత ప్రొద్దుపుచ్చుచు, నొకనాఁడు తనపురమును బత్నీపుత్రులను బంధువుల నుం దలంచి మనంబునవిచారమునొందుచు, నెట్టు లీగుణవంతురాలిని విడిచిపోనగు నని పరితాపమునుబొందుచు, నొకనాఁడుప్రాతఃకాలంబున యథాపూర్వకముగా సూర్యనమస్కారమునకు నూరిబైటికింబోయి యందుసూర్యునకు నమస్కారములుచేసి యాయశ్వమునుదలంచిన మాత్రముననాతురగమువచ్చియెదుటనిలిచినంజూచియాశ్చర్యపడిదానికి

నమస్కరించి, యోయుత్తమాశ్వమా ? నన్నునాసభామంటపమునకుం గొనిపొమ్మనిప్రార్థించి త్వరితముగానాయశ్వముమీఁదంగూర్చుండెను. అమాయాతురగ మతివేగముగాఁబోవునపు డారాజేంద్రుఁడు, డకటా ! ముద్దులబిడ్డలను మిగులసుందరియైన భార్యనువిడిచివచ్చితి, నిందువలన నేమియుపాధికలుగునో తెలియదు, నే నీరహస్య మెవ్వరికిం జెప్పక కొంత ప్రాయశ్చిత్తమునుబొంది కల్మషరహితుండ నయ్యెదననియును మంత్రి ప్రధానసామంతరాజులకును బంధువులకును దెలియవచ్చినఁ దన్ను మిగుల నిందింతురనియును, మనంబున యోచించుచువచ్చి తనకొలువు కూటమునొద్ద గుఱ్ఱమునుదిగి తనసింహాసనముమీఁదం గూర్చుండెను.

అంతలో నాభ్రమాదేవి యారాజేంద్రుఁడు మోసపుచ్చి తన లోకమునకుంబోయిన వర్తమానమును దెలుసుకొనియతివేగముగానా యేడ్గురుబిడ్డలుం దానును వచ్చి యెదుటనిలువంబడి, ఓహోరాజేంద్రా ! నీవుభూలోకచక్రవర్తివిగానుండియును నన్నునగ్నిసాక్షిగా వివాహము చేసుకొనియు, నిరువదిసంవత్సరములు నాతోననుభవించియు, నీకుం బుట్టిన యీయేడ్గురుబిడ్డలు నిదర్శనముగానుండియు, నన్ను మోసపుచ్చి దొంగతనముగానిటులరాఁదగునా ? ఇదిరాజనీతియగునా ? ఉత్తమక్షత్రియులు దొంగతనమునుమోసమును జేయంగూడునా? లేచిరమ్మని పలికిన నారాజేంద్రుఁ డామృగాక్షిని బిడ్డలనుజూచిగుండెలుఝల్లనిదిగులొంది, ఆయ్యో! ఇదియేమియన్యాయము! ఈమాలదిబిడ్డలతో నీసభకువచ్చెను. మనగుట్టంతయునుబయలుపడుచున్నది. సభికులకుందెలియవచ్చుటచే నేమిసంకటమోయని మనంబున యోచించుచు దలవంచుకొని కొంత సేపూరకయుండి పిదపధైర్యమునుబొంది, యోహో! యాఁడుదానా, నీ వెవ్వరవు? ఏలోకమునుండివచ్చితివి? సిగ్గువిడిచి యీసభామండలియందు నోటికివచ్చినటులఁ బలుకందగునా పొమ్మనిపలికెను. ఆభ్రమాదేవి కన్నీళ్లుదుడుచుకొనుచు, రాజేంద్రా! నన్ను దేవరవారికిం దెలియదా? నేను మతంగకన్నియనుగానా? ఈబిడ్డలు నీబిడ్డలుగారాయనిపలికిన, నతఁ, డోహో! చండాలభామినీ ! నీమాటలెవరును నమ్మరు, చతుస్సముద్రముద్రితమైన భూమండలమంతయు నేకచ్ఛత్రమునఁబాలించు చక్రవర్తి మాలకన్నియనువివాహముచేసుకొనునా ? మాయలాడి! ఇట్టియపోహమేల

పన్నెదవు, గయ్యాళితనము విడిచినీకునునీబిడ్డలకును దగునైనధనమును బుచ్చుకొనిపాఱిపొమ్మనిపలికిన నాబిసరుహదళాక్షి, ఓహోరాజేంద్రా ! నీసభికులు నామాటలునమ్మకుండినను బిడ్డలనైననుజూచి గ్రహించరా? గ్రహించియైనను నిజముపలుకవెఱచినయెడల ధర్మస్వరూపుఁడును సర్వభక్షకుండునునైన యగ్నిదేవుఁడు ప్రత్యక్షమై నిజముచెప్పకుండునా? నేనెందుఁబోవుదానననిపలికిన, వెంటనేయాయగ్నిదేవుఁడు తనయగ్నిశిఖలనుబర్వుచు, నోహోరాజేంద్రా! అనృతదోషమునకంటె దురితములేదు. మాయాప్రపంచమును నిత్యముగానెంచి నీవీపరమసాధ్విని నిందింపదగునే? ఇదినీభార్యయగుటసత్యము, ఈబిడ్డలు నీకుంబుట్టినబిడ్డలు. తామసింపక గ్రహించుమనిచెప్పియదృశ్యుండాయెను. అంతనామండలాధిపతికి నేమియుఁదోఁచకకొంతసేపటికి, యోమాదిగదానా! అగ్నిదేవుఁడు తప్పుసాక్ష్యము చెప్పిపోయెను. నేనుదేవతలకైన భయపడువాఁడనుగాను. ప్రారబ్ధకర్మమని యెంచి నీబిడ్డలతోడ నీదీక్షకింబొమ్ము. అనుభవమెవ్వరికినిం దప్పదు. నన్నునిందించవలదుపొమ్మనిపలికిన, నామాయలాడి, ప్రాణనాథా! నన్నిటులవంచించుటదగునా? అగ్నిదేవుఁడుతప్పుసాక్ష్యము జెప్పిననుత్రిమూర్తులైననువచ్చి నిజముచెప్పరా? యని పలికినమాత్రముననే దివ్యవాక్యములరవములతోడ నాముమ్వురుమూర్తులును ప్రత్యక్షంబైనఁజూచి,యారాజేంద్రుండు భయభ్రాంతుఁడై వారికిసాష్టాంగదండంబు లిడిన వారుదీవించి, ఓహోరాజేంద్రా ! ఈభార్యమాదేవిచండాలకులమునంబుట్టినదని యోచించవలదు, మిగులనుత్తమురాలు. ఆత్మధ్యానపరాయణులైన వారెవ్వరైనను మాకుసమానులుగాని కులమెంచువారముగాము, కులములన్నియును శుక్లశోణితసంబంధములైయున్నవి, కాఁబట్టి విధినిషేధములులేవు. ఆలస్యముచేయక గ్రహించుమనిన, నతఁడు, స్వాములారా ! నాసభికులకండఱికిస్పష్టముచక్కఁగాఁదెలియవచ్చె. మీదర్శనముచేత ధన్యుండనైతినని వారినింబెక్కువిధముల వినుతించి నమస్కరించినవాముమ్వురుమూర్తులునదృశ్యులైరి. అంత నారాజేంద్రుఁడాభార్యనుబిడ్డలను దగ్గఱకుఁబిలిచి, ప్రియురాలా ! మనతపస్య మీసభికులకండఱికిం దెలియఁగోరి యింతదూరమునిన్నుంబరీక్షించితి. ఇప్పుడు త్రిమూర్తులువచ్చి చెప్పఁగానందఱికి నిర్దోషులనిదెలియవచ్చెను. నీవు

నాయందసూయతనుబొందకు మనిప్రియవచనములతో నూరడించి బిడ్డల ముద్దులాడి వారినందఱిని వెంటఁబెట్టుకొనిపోయి యందొక మంటపము లోనిలిపిమీరిచటనేయుండుఁడు, పుణ్యస్త్రీలును మంగళవాద్యములును వచ్చునని చెప్పి మగుడికొలువుకూటమునకువచ్చి సింహాసనము మీఁదం గూర్చుండి, యింద్రజాలకునిమహిమవలననేత్రములను దెఱచి సభికులను జూచి, మిత్రులారా! త్రిమూర్తులును, నగ్నిదేవుండును బ్రత్యక్షమై భద్రిమాదేవి మహాపాత్తమురాలనియును గుణశ్రేష్ఠురాలనియును దాని గ్రహించుటచేత నీకుదోషముకలుగనేరదనియును దీవించిచెప్పిపోయిన సమాచారములన్నియు మీకుఁదెల్లముగాఁదెలిసియున్నవిగదా? ఐనను మనము పెద్దలనురప్పించి కొంతమట్టుకు బ్రాయశ్చిత్తమునుగావించు కొనుటయుక్తమని నాకుదోఁచుచున్నది. మీయందఱియభిప్రాయములఁ జెప్పుఁడనియడిగిననాసభికులందఱు ప్రభువు నిదానముదప్పి యేమేమో మాటలాడుచున్నాఁడని యొకరిముఖమొకరుచూచుకొనుచుండిరి.

ప్రథమమంత్రియైన సునీతి ప్రభువునుంజూచి, రాజేంద్రా! దేవర వారేమేమోచెప్పితిరి. అవి మాకేమియును దెలియలేదు. అవేమి వృత్తాంతమో సాంగముగావినుపించుఁడని వేఁడిన నామండలాధిపతిజరిగిన వృత్తాంతమంతయునుజెప్పిన నామంత్రియును, నాసభికులును ముక్కుల మీఁద వ్రేళ్లుపెట్టుకొని యద్భుతమునొంది, మంత్రి, రాజేంద్రా! దేవర వారు నేత్రములను మూసుకొని యైదునిమిషము లాయెను. ఇంతలోమీ రెన్నఁడు సంకల్పమను ద్వీపమునకుఁబోతిరి? వికల్పమనుపట్టణమును బాలించెడు భద్రిమాదేవియనెడు మతంగకన్నియనుమీరెన్నఁడు వివాహము చేసుకొంటిరి? అచట నిరువదిసంవత్సరములుండి యేడ్గురుబిడ్డల నెన్నఁడుగంటిరి? ఆభద్రిమాదేవియును బిడ్డలునుమనసభకెన్నఁడువచ్చిరి? అగ్నిదేవుఁడును ద్రిమూర్తులునుబ్రత్యక్షమై యెప్పుడుదీవించిపోయిరి? సర్వమబద్ధము. అంతయుహుళిక్కి. జరిగినదించుకైనను లేదు. దేవరవారికి స్వప్నమువలననో, లేక యింద్రజాలకుని మహిమవలననో యటులఁదోఁచి యుండునని చెప్పిన నారాజేంద్రుఁడు, మిత్రుఁడా! స్వప్నముగాదు. ఇంద్రజాలముగాదు. నే నిరువది సంవత్సరములనుండి యనుభవించివచ్చిన ప్రత్యక్షమైన యనుభవమును నీవు హుళిక్కియనిచెప్పుటెట్లు? చలవ

రాతి మంటపములో నాభ్రమాదేవియును దానిబిడ్డలునున్నారు. నీవు పోయివారినిఁజూచి రమ్మనిన నతఁడుపోయిచూచి యెవనింగానకవచ్చి చెప్పిన నామండలాధిపతి, ఆహా! ఇది యేమి వింతకార్యము! ఇంతకు ముందుగనా మంటపములోనిలిపివచ్చితినే! ఇంతలో వారెందుఁబోయిరని యోచించుచుండఁగా, నాయింద్రజాలకుఁడు ప్రభువుంజూచి, రాజేంద్రా! సర్వము నాజాలమువలనంగలిగిన చిత్తభ్రమయే గాని యదినిజము గాదు, స్వప్నముంగాదు. అనుభవమంతయుహుళిక్కి, జరిగినదంతయు దబ్బర, సర్వముభ్రమయనిపలికిన, నారాజేంద్రుఁడు ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొనియతనిం బెక్కువిధముల నుతించి, మహాత్మా! అత్యద్భుతమైనయింద్రజాల మత్యానందమును బుట్టించుచున్నది. వేఱొకజాలమును జూపుఁడనిన నతఁడు, పుణ్యాత్మా! తొలుత నేఁజూపించినది మహేంద్రజాలము. ఇప్పుడుచూపించినది యింద్రజాలము. కనుకట్టువిద్యయైనజాలమునుజూపించెదనని చెప్పి, యాయింద్రజాలకుఁడు తనచేతిలోని నెమిలియీకలకుంచెను సభవారికినింజుట్టి చిత్తసంకల్పమును బొందించెను.

అంతనాసభకు నొకముసలిబ్రాహ్మణుఁడును సుందరమైనస్త్రీయు వచ్చి యారాజేంద్రునింజూచియావృద్ధుఁడు, పుణ్యాత్మా! నేనునాభాగ్యవశమునరాక్షసులను దప్పించుకొనివచ్చి దేవరవారి కొలువుకూటమును బ్రవేశించితిని, నేనురక్కసులకుభయపడువాఁడఁగాను, నేనుదివ్యాస్త్రశస్త్రకోవిదుండను, నాయొద్దదివ్యాస్త్రములుమెండుగాఁగలవు. రాక్షసమాయలునాకుఁదెలియును. ఇదినాభార్య మిగులగుణవంతురాలు, రూపసియగుటంజేసి యాదురాత్ములేమికీడుగావింతురోయను భయముచేఁ బరుగున వచ్చిచేరితిమి. ఆదురాత్ములకు నాప్రభావము తెలియదు, నేనుగడియలోపలనందఱినింజంపివచ్చెదను. అంతవఱకు నాభార్యనుగాపాడవలయునని ప్రార్థించి చేతిలోనిపుస్తకమును భూమిమీఁదంగొట్టి రథమునురథ్యములనుధనుర్బాణములనురప్పించి, యారథముమీఁదం గూర్చుండిధనుర్బాణములనుధరియించి కూతలార్భాటములనుజేయుచు నారథముతో మింటికెగసిపోయెను. ఆరాజేంద్రుఁడును సభికులును నాబ్రాహ్మణునియద్భుతపుశక్తికిమిగుల నాశ్చర్యమునొంది, చక్రవర్తి యాబ్రాహ్మణినిం గాపాడుటకుఁ దగినబందోబస్తు గావించెను. మింటియందు మిక్కుటము

లైనకూతలార్భాటములును ధనుష్టంకారములును గర్జనలును ప్రతాప
వచనములును వినవచ్చినందున, నాసభికులందఱుభయపడి, రాజేంద్రా!
మనకును నుపద్రవములు కలుగునటులఁ దోఁచుచున్నది. ధనుర్బాణము
లనుధరియించి జాగ్రతతో నుండుటయుక్తమని యందఱును ధనుర్బాణ
ములనుధరియించిరి. అంతట మింటియందుండి రక్తమును ఖండములు
ను దలలును మొండెములునుబడుటనుజూచి యాప్రభువును సభికులును
బ్రాహ్మణుఁడును సతివాఁడుగానుండినను, మిగులసమర్థుఁడు. రాక్షసుల
తలలు నఱికి నఱికి పడఁద్రోయుచున్నాఁడని యాశ్చర్యపడుచుండఁగా
నాబ్రాహ్మణుని శిరస్సును గాత్రమును భూమిమీఁదంబడెను. అవిచూచి
ప్రభువును సభికులును విచారపడుచుండ నాబ్రాహ్మణివికలమతై పడిన
తనభర్తశిరమును మొండెమునుజూచి విలపించుచు, నామండలాధిపతినిం
జూచి, పుణ్యాత్మా! నాభర్తశత్రువులచేతహతుఁడై భూమిమీఁదంబడెను.
పతితోడ సతికిగమనమని శాస్త్రధర్మము గనుక నాకు సహగమనమునకు
సెలవిండనియడిగెను. ఆరాజేంద్రుఁడు వలదని యెన్నివిధములఁజెప్పిన నా
బ్రాహ్మణివినక నేనొకనిమిషమైనను జీవింపనోపనని పలికి యగ్నిగుండముఁ
గావించుకొని యగ్నిఁదరికొలిపి భర్తశిరమును గాత్రమునుబడవైచి తానును
నాయగ్నిగుండమునంబడి కాలిభస్మమాయెను. ఆరాజేంద్రుఁడుసభికులును
విస్మయమునంది, ఓహో! ఇదయేమియింతకార్యము! మనభాగ్యవశమున
నీమహాపతివ్రతనుఁ జూడఁగంటిమని యా లతాంగినిం గీర్తించుచుండిరి.

అంతఁ గొంతసేపటికి నాబ్రాహ్మణుఁడు ధనుర్బాణములను ధరించి
వచ్చినంజూచి, యారాజేంద్రుఁడును సభికులును వెఱఁగుపడి నిశ్చేష్టితు
లైరి. ఆమాయకుఁడు, రాజేంద్రా! పెక్కండ్రుఘోరరక్కసులనుహతము
చేసివచ్చితిని, హతశేషులుభయపడిపరుగుఁబాఱిరి. నాభార్యనునెక్కడ
దాఁచితిరనియడిగినఁ బ్రథమమంత్రియైన సునీతి యతనింజూచి, యో
బ్రాహ్మణుండా! భూమిమీఁదం బెక్కురక్కసుల తలలునుగాత్రములుం
బడెను. అవిచూచియాశ్చర్యపడుచుండఁగా నీతలయునుగాత్రమునుబడు
టను మేమందఱమునుజూచివ్యసనపడుచుంటిమి. నీభార్య నేనొకమిషమైన
జీవింపననిపలికి మేమెంతచెప్పినను వినక యగ్నిగుండమునుగావించి యగ్నిఁ
దరికొలిపి నీశిరమును గాత్రమునుబడవైచి తానునాయగ్నిలోఁ బ్రవేశ

మయ్యెననిజరిగినవర్తమానముంజెప్పిరి. ఆబ్రాహ్మణుఁడకటా! యిది యేమి యన్యాయము! నాతలయును డొక్కయును భూమిమీఁదం బడుటెట్లు! ఆబ్రాహ్మణి యాశిరమును గాత్రమునగ్నిలోఁబడనై చితానుంబడుటెట్లు మగుడినేనుజీవించివచ్చుటెట్లు! మీమాటలు గడువింతలుగానున్న వని భూమిమీఁదంబడివిలపించుచుఁ గొంతవడికిలేచి యాప్రభువును సభికులు నెంతదూరముచెప్పినను వినక యాబ్రాహ్మణుండునాయగ్నిగుండములోని యగ్నిం దరికొలిపి యాయగ్నిలోదుమికి కాలి భస్మమాయెను. ఆరాజేంద్రుఁడిట్టిఘోరకృత్యము మనయెదుట సంభవించె. మిగులనుత్తములై నయీవధూవరులిద్దరు నగ్నిలోనంబడిదహించిరి, ఇందుకు మనమేమి చేయుదమని సభికులతోడనాలోచించుచుండఁగా నాయగ్నిగుండములో నుండి శ్రవణానందముగా దశవిధ వాద్యములు వినవచ్చిన నాశ్చర్యముతో నాప్రభువునుసభికులు నాయగ్నిగుండమునే చూచుచుండఁగా, నందుండి యావధూవరులిరువురు బైటవచ్చినఁజూచివిస్మయమునొంది, ఓ హో! ఇతఁడుమిగులఁ బ్రభావసంపన్నుండని పెక్కువిధముల నతనిం గీర్తించిరి. అంతనాయింద్రజాలకుఁడు తనజాలమునునిలిపిన నాచక్రవర్తికినిసభికులకును నాయిరువురునుగనుపించక యింద్రజాలకుఁడుమాత్రము గనుపించి, ఓపుణ్యాత్ములారా! సర్వమునామాయవలన మీనేత్రములకట్లుగనుపించెనేగానినిజముకాదు. బ్రాహ్మణుండును, బ్రాహ్మణియు, యుద్ధమును నగ్నిగుండమును, నగ్నిలోనాయిరువురుపడుటయు, మగుడిలేచివచ్చుటయుసర్వమునామాయయనిచెప్పిన నారాజేంద్రుఁడును సభికులునద్భుతపరులై యతనినాలింగనముచేసికొని పెక్కువిధములంగీర్తించి యిష్టదేవునకుంబూజించునటులంబూజించుచు నతనికివిందులుగావించుచుండిరి. ఆభాస్కరుండును వివిధవేడుకలుగావించుచుఁ గండగర్వముచేత గురుని యాజ్ఞనుమఱచియుండఁగా, నాగురుఁడు తనజీవితకాలమునుజెప్పియుండియును దనశిష్యుండురానందుకై మిగులవిచారమునొంది యతఁడుండిన స్థానమునుదెలుసుకొని రౌద్రావేశముతో నాపురికివచ్చుచుండెను.

ఈవర్తమానమును భాస్కరుండెఱింగి మిగులవిచారమునొంది త్వరితముగానామహాత్మునకు నెదురుగాఁబోయి యతనిపాదములమీఁద వ్రాలిపెక్కువిధములవినుతించిన నతఁడొప్పక, ఓరికపటాత్మా! గురు

ద్రోహీ ! కండగర్వముచేత మదించి నను లక్ష్యపెట్టక నాయాజ్ఞను మీఱి నడిచితివి. దురాత్మా! నకరమనుభవింతువుగాక; నీవిద్య నీతోడ నశించును గాక ; నీకుం దగిన శిష్యుఁడు లేకుండునుగాక ; యని ఈమూఁడు శాపములిచ్చి ప్రాణాయామము చేతఁ బద్మాసనముమీఁదం గూర్చుండి హంసను సహస్రార కమలమునకుం గొనిపోయి యచట విజృంభించి బ్రహ్మకపాలమును భేదించుకొని ప్రాణవియోగమును బొందెను. అంత నాభాస్కరుఁడు ఘోరముగా దుఃఖించుచు నా మహాత్ముని సమాధి కావించి, యా సమాధిమీఁద నలువది దినములు పరుండి ధూపదీపనైవేద్యములను గావించుచుండెను. అటుపిమ్మట నాభాస్కరుఁడు తనకు నమ్మకమైన శిష్యుఁడు సంభవించ నందుకై దుఃఖించి, తనవిద్య తనతోడం బోకుండునట్లు యోచించి పదుగురు శిష్యులను గూర్చుకొని వారికెంత బోధించినను వారికి ఫలితార్థము కలుగ నందుకై వగచుచుం గొన్ని దినంబులుండి యతండును మరణించెను. అతని శిష్యులు కొంతమట్టుకు జాలవిద్యను మాత్రము చేయుచుండిరి. ఇంద్రజాల మహేంద్రజాలాది విద్యలు లేవు. వాయుస్తంభన జలస్తంభనాది విద్యలు, వివిధమంత్రయంత్రతంత్రములు, మోహనాది విద్యలు గలవు. మహామహిమలు, జిత్రవిచిత్రములు, ధనకనకవస్తువాహనములు, సుఖసంతోషములు, సింగారవేడుకలు, వివిదవాద్యగోష్ఠియు, గీతనృత్యనాటకాలంకారములు, నవరత్నములు, నివి యన్నియు మాయ, మనస్సునకు మిగుల రమ్యములై మిత్రులపగిది వివిధవాంఛలను బొందించుచు, మోహాంధకారముచేతను మదగర్వముచేతను ధనగర్వముచేతను రాజ్యగర్వముచేతను లోభముచేతను విషయములందుఁ జిత్తమును బ్రవేశపెట్టుటచేత జననమరణ ప్రవాహమును దప్పించుకొనెడుయుక్తిలేక జననమరణములఁ బొందుచుందు రని చెప్పిన నా రామచంద్రుఁ డద్భుతమునొంది, మునీంద్రా ! ఇంద్రజాల మహేంద్రజాల విద్యలిప్పుడుండినయెడల నేను మిగుల సంతుష్టితో వానిఁ బరీక్షించక విడువ ననిపలికిన, నా మునీంద్రుఁ డతని చిత్తానందమును గ్రహించి, యకటా ! యీపుణ్యపురుషుని మనంబింకను ధర్మార్థకామమోక్షములనెడు భ్రమల యందే తగులుకొని నిజస్వరూపధర్మమును గ్రహించుట కుపక్రమింపకున్నదని మనంబున యోచించి యామునీంద్రుండిట్లనియె.

శ్రీరామచంద్రా ! శ్రద్ధాసక్తుఁడవై వినుము, తొల్లి యయాతి మహారాజుతనభార్యయైన దేవయానతోఁ జిత్రశయ్యమీఁదంబరుండి స్వప్నమునుబొందెను. ఆస్వప్నమునగొప్పవెలుఁగునుంగాంచిదివ్యవాద్యములఘోషములనువిని యాశ్చర్యపడిలేచికూర్చుండి నలుదిక్కులుపరికించుచుండెను. ఆవెంటనే యనేకరథములును గజములును తురగములును వేలకొలందికాల్బంటులునువచ్చిబారులుబారులుగానిలిచిరి. ఆరాజేంద్రుఁడివి యెవరిసైన్యము లని చూచుచుండఁగా నొకదివ్యపురుషుఁడు శ్వేతగజమునెక్కివచ్చినంజూచివెఱఁగుపడి చేతులుగట్టుకొనియుండెను. అంతటఁ గ్రొక్కారు మెఱుంగుతెఱంగున నొకకన్యకారత్నము వేవురుచేడియలతోడ వచ్చుటనుగాంచి నేత్రములనుమూసుకొని నిశ్చేష్టితుండాయెను. ఆకన్యకామణియతనిముఖమునంబన్నీరుచల్లికంఠమునంబుష్పహారమువైచెను. ఆదివ్యపురుషుఁడునీభాగ్యముమంచిదని యతనిగజముమీఁదనెక్కించుకొని తనపట్టణమునకుం గొనిపోయి వివిధమర్యాదలు గావించి వివాహమహోత్సవమును జరిపించెను. ఆయయాతిమహారాజు త్రిభువనసుందరియైన భార్యతోడ నెల్లసుఖము లనుభవించుచు వేఁటకుఁబోయి త్రిమూర్తులనుదర్శించి వారివలన దీవనలుగైకొనుచు నింద్రాదిదేవతలతోవిహరించుచు, నుద్యానవనమునకుంబోయి జలక్రీడలాడుచు నూతనవస్త్రాభరణములను బ్రతిదినముధరియించుచు,నచటఁ గొన్నిదినములుండి భార్యను వెంటఁబెట్టుకొని చతురంగబలములతోడ వచ్చినిద్రమేల్కాంచి నేత్రములనుదెఱచియెవ్వరినింగానక, దేవయానను మాత్రముచూచి నిద్రలేచి, ఓహో ప్రియురాలా ! నాతోడలమీఁదం గూర్చుండిన దేవకన్నియయును, దానిచెలికత్తియలును జతురంగబలములును నెందుఁబోయిరనియడిగిన, నాకలువకంటి యాశ్చర్యపడి, ప్రాణనాథా! దేవకన్నియయెవరు? జరిగినవృత్తాంత మేమి? సర్వమును దెలియఁజెప్పుమనిన నతఁడు జరిగినవర్తమానమంతయునుజెప్పెను. ఆదేవయాన యాశ్చర్యపడి, ప్రాణనాథా! మీకట్లుస్వప్నముగలిగియుండుటకు సందియములేదు. జరిగినదంచుకైనను లేదు. సర్వముదబ్బర. స్వప్నమువంటిదే ప్రపంచమును నింద్రజాలమును, నస్థిరమును, నబద్ధము, నాతండ్రి శుక్రాచార్యుఁడు తనశిష్యులకు బోధించునపు డిట్టిధర్మములను జాలామట్లుకు

వినియున్నాను. కాఁబట్టినీకునుస్వప్నమునకటులఁదోఁచియుండును. చిత్తవ్యాప్తియేగాని నిజముకొంచెమైనను లేదని చెప్పిన నారాజేంద్రుఁడాశ్చర్యపడి, ఓహో! ఇది యేమివింతస్వప్నము! అనుభవమంతయును చెప్పపాటులోనేమిలేకపోయెనని యోచించుచుండఁగా, నాదేవయాన భర్తనుజూచి, ప్రాణనాథా! చిత్తవృత్తినేనేమిచెప్పుదును! నిమిషకాలములోపలఁ జిత్త మేడేడుపదునాలుగు లోకములుసంచరించి యందుండు వింతలనుజూచియద్భుతమునొందుచుఁ బెక్కుసంవత్సరములుండినట్లును ముసలివాఁడై మరణించిమఁగుడిజన్మించినట్లును, నీప్రకారముపెక్కుజన్మము లెత్తివచ్చి తన భ్రమకుందానేయద్భుతమొందుచుభ్రమించుచుండును. కాఁబట్టి భ్రమరూపకమైన యీమాయాశరీరములకు మూలములేదు. స్వప్నమునందు దోఁచినశరీరములకును మూలములేదు. మూలములేక తనంతటఁదామేవచ్చి తమంతటఁదామే మటుమాయముగాఁబోవుచుండు మనస్సువలనంగలిగెడు సర్వార్థములును గలవంటివేగాని నిక్కములు గావు. సర్వము భ్రాంతియని భర్తకుఁజెప్పి సమాధానపఱచె నని చెప్పిన నా రామచంద్రుఁడద్భుతమునొంది, మునీంద్రా! ప్రపంచమును స్వప్నమును నింద్రజాలమును నివి మూఁడును భ్రమరూపకములని సెలవిచ్చితిరి. ఈమూఁటియందును సమ సవినోదములను బుట్టింపఁజేసిన కారణపురుషుఁ డెవ్వఁడనియడిగిన నావసిష్ఠుండిట్లనియె.

శ్రీరామచంద్రా! మాయయెఱుకే కారణము. కార్యమునెఱుకే. ఎఱుకే చైతన్యస్వరూపిణి యనునమ్మవారు. ఎఱుకే చిద్బ్రహ్మము, ఎఱుకేచిదాకాశము. ఎఱుకేజీవేశ్వరులు. ఎఱుకేయంతరాత్మ. ఎఱుకే ప్రకృతిపురుషులు. ఎఱుకే పరమాత్మ ఎఱుకే రాజహంస. ఎఱుకే త్రిగుణములు ఎఱుకేజననమరణంబులు. ఎఱుకేబంధమోక్షంబులు. ఎఱుకేమహాకాశము. ఎఱుకేసంధ్యాసూనుఁడు. ఎఱుకేదారుపురుషుఁడు. ఎఱుకేమహేంద్రుఁడు. ఎఱుకేప్రపంచము. ఎఱుకేసంకల్పవికల్పములు. ఎఱుకేపంచకోశములు. ఎఱుకే పంచభూతములు. ఎఱుకే పంచప్రాణములు. ఎఱుకేస్వప్నాద్యవస్థలు. ఎఱుకేజ్ఞానేంద్రియకర్మేంద్రియములు. ఎఱుకే సద్రూప, చిద్రూపానందరూపములు. ఎఱుకే దేవమనుష్య మృగపక్షి క్రిమికీటకాది జంతువులశరీరాత్మలు. శరీరాత్మలే ప్రకృతిపురుషులు.

ఆపురుషుని దేహములే స్థూలసూక్ష్మకారణమహాకారణములు. ఎఱుకేయీ విశ్వరూపము. విశ్వరూపమే మాయ. ఎఱుకేయుపాధిద్వయముగాఁబట్టి యెండమావులయందునీరుదోఁచినదియెఱుకకే. భ్రమచేతమరణించినదియును నెఱుకే. భ్రమనువిడిచినదియును నెఱుకే గాఁబట్టి సర్వముభ్రమ. కార్యకారణములు రెండును నెఱుకేగాని బ్రహ్మముగాదు. అచలపరిపూర్ణబ్రహ్మమే నీనిజస్వరూపము. నీనిజస్వరూపమే వేదాంతము. నీకువేదములుప్రమాణములుకావు. విశ్వరూపమైనమాయాశరీరమునకేయవిప్రమాణములని చెప్పిన నా రామచంద్రుఁడు మహాత్మా! మాయ యెఱుకను బుట్టించినవారెవ్వరు? అవియెటులవచ్చెను జక్కఁగా వినిపించి యీ భ్రమనుదొలఁగించుఁడని వేఁడిన నాతపోధనుండిట్లనియె.

శ్రీరామచంద్రా వినుము "అధ్యారోపాపవాదాభ్యాం। అపమృత్యుర్భవిష్యతి" యనియును "అధ్యారోపాపవాదాభ్యాంనిష్ప్రపంచం ప్రపంచతే" యనియును ప్రమాణములున్నవి. కాఁబట్టియధ్యారోపాపవాదమును నేనెటులఁజేతును. ఈవాదమెన్నఁడును జేయఁగూడదు. లేనిదానినిఁగలుఁగఁజేసి చెప్పుటేయధ్యారోపాపవాదము, పండితపామరులు నచలపరిపూర్ణబ్రహ్మమువలననాకాశాదిమహాభూతములు పుట్టినవనివేదశాస్త్రములఁగల్పించిరి. ఆహా! వారివివేకముమిగులదొడ్డది! వారేమాయ యెఱుకనుబుట్టించినవారుగాని యచలపరిపూర్ణబ్రహ్మమువలనమాయ యెఱుకపుట్టనేలేదు, పుట్టించనుబడలేదు. పుట్టినదియును దెలియదు. అచలపరిపూర్ణబ్రహ్మము కేవలనిర్వికారము. ఏవికారమునులేనిది. ఏ కాలమందును శరీరాత్మలు కానిది. ఏరూపమునుబొందనిది. ఏగుణములులేనిది. ఇట్టిదట్టిదని నిర్దేశింపరానిది. అంతటనునిండి స్వతస్సిద్ధముగానుండెడుపరిపూర్ణమును దెలియక యుక్తిచేసి, తమకుఁదోఁచినమట్టుకు వేదశాస్త్రములనల్లిరేగాని నిజమెఱిఁగిచెప్పినవారుకారు. అవియన్నియును గల్పితవాక్యములేగాని నమ్మఁదగినవిగావు గాఁబారుచేతనట్లువ్రాసిరి. అచలపరిపూర్ణబ్రహ్మమును దెలియనివారే. తెలిసియుండినయెడల నీపాపవాదమును జేయరు. శరీరాత్మలుగాని మహాకారణ శరీరాత్మలుగాని లేనట్టినిర్వికారాచలపరిపూర్ణబ్రహ్మము తానెటులఁబుట్టించును. ఏవికారమునులేని యచల పరిపూర్ణమువలన నేవికారమునులేని యచలమే

పుట్టునుగాని వికారములెట్లుపుట్టును? చైతన్యములేని పరిపూర్ణమెట్టులఁ
బుట్టించును ఏకాలమందునుబుట్టించఁబడలేదు. ఇఁకమీఁదనుబుట్టింపదు.
పుట్టించనుబడదు. దానికి నేజోలిపట్టదు. ఎందుఁజూచిననొకవిధముగానే
యుండును దానికిఁబ్రతిలేదు. సమానములేదు. దానిఁజూడని పండిత
పామరులుగాఁబారుచేసెచలపరిపూర్ణబ్రహ్మమువలనమాయయెఱుకపుట్టిన
దనిచెప్పిరి. సత్యమైనయచలపరిపూర్ణ బ్రహ్మమువలనసత్యమేపుట్టును
గాని, యసత్యమైనమాయయెఱుకయెట్లుపుట్టును? ఏకాలమందునుసత్య
మునందసత్యముపుట్టనేపుట్టదు, పుట్టించనుఁబడదు, గాఁబట్టిపండితపామ
రులుచేసినయధ్యారోపవాదము మిగులఁదప్పువాదము. ఇంతటివివేక
పరులుగొడ్డురాలికిబిడ్డయున్నదనియును, గుండేటికిఁగొమ్ములున్నవనియు
ను, నెండమావులయందునీళ్లున్నవనియును, రజ్జుసర్పమునుగారుపురుషుఁ
డు చంపెననియునుఁజెప్పుటకుసందియములేదు. ఆహా! యెంతచదివినను
భ్రమకేకారణము. భ్రమలేనిచదువుచదువవలెను. అదియే యచలపరి
పూర్ణబ్రహ్మము. వేదములుమాయయెఱుకమైనశరీరాత్మలకే ప్రమాణ
ములుగాని యచలబ్రహ్మమునకుం బ్రమాణములుగావు.

ఇదియునుగాక తొల్లింటికథయొకటికలదు. చక్కఁగావినుము,
హుళిక్కియనుదేశములో దబ్బరయనునొకపట్టణముగలదు. ఆపట్టణము
ను నేమిలేనిప్రభువు పాలించుచుండెను. ఆప్రభువు తన మంత్రులైనదారు
పురుషుని వంధ్యాసూనునిఁజూచి, మిత్రులారా! మీరిరువురుంబోయి
యాకాశపుష్పమునుదెండని సెలవిచ్చెను. వారియిరువురును బ్రయాణమై
పోవుచు నామార్గమునవివిధములగువేడుకలనుఁ జూచుచుంబోయిపోయి
యొకప్రదేశమున రజతశుక్తికములువిశేషముగానుండుటఁజూచియాశూరు
లిరువురునువెండిగనియని మిగులసంతసించి, హా! తమ్ముఁడా! హా! యన్నా!
మనము తొలిజన్మమున నెంతటి పుణ్యముచేసితిమో తెలియదు. మనకీ
జన్మమున వెండిగనిసంభవించెను. కృతార్థులమైతిమని యాయిరువురును
బయివస్త్రములను భూమిమీఁదంబఱచి యాగుల్లలం బ్రోఁగుచేసికొని
మూటలుగట్టిరి. ఆమూటలలో వంధ్యాసూనుఁడుగట్టినమూట పెద్దదిగా
నుండుటను దారుపురుషుఁడుచూచి, యన్నా, మనమిద్దఱము నొకటిగా,
గూడివచ్చితిమి. ఏమిదొరికినను సమానముగాఁ బంచుకోవలయునే గాని

వ్యత్యస్తపు భాగములుగానుండఁగూడదు. నీమూట పెద్దదిగానున్నది. నామూట చిన్నదిగానున్నది. నాకుం బంచిపెట్టు మనియడిగిన నాగొడ్రాలిబిడ్డ నేనునీకుఁబంచిపెట్టను. నేనుత్వరపడి యెక్కువగాఁ బ్రోఁగుచేసుకొంటిని, నీవునుబ్రోఁగుచేసుకోరాదాయనిపలికెను. ఆదారుపురుషుఁడు పంచిపెట్టక నిన్నుంబోనీనని యతనిమూటంబట్టుకొనెను. ఆవంధ్యాసూనుఁడుకోపించియతనింబిడికిటంబొడిచెను. ఆదారుపురుషుఁడు రౌద్రాకారుండై యతనిఁబొమ్మమీఁదంగొట్టెను. అంతట యిరువురును హస్తములతోఁగొంతసేపు పోరాడి యాయుధములతో యుద్ధము చేయుదమని యోచించి, శశవిషాణముల నూడఁబెఱికి వానితో యుద్ధము చేయుచు దేహములుగాయపడి రక్తములుగాఱుచుండఁగా మిగులఁదప్పిఁగొని, దాహమార్చుకొనివచ్చినపిమ్మట మరలయుద్ధము సేయుదమని యోచించి యెండమావులనుజూచినీళ్లని భావించియత్యంతదాహముచేతనిరువురును బరుగువాఱిపోవుచుండిరి. ఆయిరువురు రజ్జుసర్పముగఱచుటచేనా సర్పవిషముతలకెక్కినవారలై, వెంటనే ప్రాణవియోగమునొంది రని చెప్పిన, నారామచంద్రుఁడు, మహాత్మా, మిగులనద్భుతమైనచరిత్రమును జెప్పితిరనిపకపకనవ్వుచు, నాహా! మిగులఁజిత్రమైనకథగానున్నది. ఇట్టి కథనుముందెన్నఁడునువినలేదు. నిజములేశమైనను లేదు. గొడ్రాలికిబిడ్డ యుండునా? దారువుపురుషుఁడగునా? రజతశుక్తికము వెండియగునా? కుందేటికిఁగొమ్ములుండునా? ఎండమావులనీళ్లుండునా? రజ్జుసర్పముగఱచునా? ఆకాశమందుఁబుష్పముండునా? సర్వమునుదబ్బర. అంతయు హుళక్కి. నిజమించుకైనను లేదు. అబ్బా! మిగులవింతయైనకథఁజెప్పితిరనియామునీంద్రునింగీర్తించి, పావనచరితా, నామనంబునకుఁ గొప్ప సందియము జనించుచున్నది. అచల పరిపూర్ణబ్రహ్మమువలన మాయయెఱుకపుట్టుచున్నదియెట్లువచ్చి శరీరాత్మలుగాఁ బరిణమించియెట్లుపోవుచున్నదనియడిగిన నామునీంద్రుఁడు, రాజేంద్రా, మాయయెఱుకయెవరివలననుబుట్టినదికాదు. దానికిఁదల్లిగానిదండ్రిగానిలేదు. అది తల్లిదండ్రులు లేకనే వచ్చినది. తనంతటఁదానేవచ్చి తనంతటఁదానే కొన్నిదినములుండితనంతటఁదానే మటుమాయముగాఁ బోవుచుండును. కాఁబట్టి మూలములేని మాయయెఱుక పుట్టనేలేదు. పుట్టనిదానికిఁజావునులేదు.

వచ్చుటలేదు. పోవుటలేదు. రాకపోకలకుభ్రిమయేకారణము. భ్రమకు నిలుకడలేదు. కలలోవచ్చినయేనుఁగులును, గాల్బంటులును, సుందరులైన దేవతాస్త్రీలును మేలుకొనిననేమిలేకపోయెను. భ్రమవలనం జిత్తమునకటులఁదోఁచునేగాని నిజముగారాలేదు నిజముగాఁబోలెదు. వానినెవరురప్పించిరి? ఎవరుగొనిపోయిరి? భ్రమవలననామాయ నడుమంత్రముగానేవచ్చి నడుమంత్రముగానేపోవును. గురువాక్యముచేమేలుకొన్నవారికి భ్రమ యేకాలమందును బుట్టదు. భ్రమలేనివారే యశరీరులు భ్రిమలేనివారేయచలులు. భ్రిమిలేనివారే ప్రకృతిద్వయ రహితులు. కాఁబట్టి గురుకటాక్షమొందినవారికి సూర్యకిరణములకు మంచువిడియునటుల భ్రిమవిడిచిపోవుననుటకు సందియములేదు. మాయయెఱుక వచ్చినవిధమును, బోయెడు విధమును దెలిసిచెప్పుటకుఁ ద్రిమూర్తులకైన నలవికాదు. లేని మాయయెఱుకగనుకనే యదియెవ్వరి చేతికిం జిక్కక, నిల్కడయును లేకమటుమాయముగాఁ బోవుచుండును. భ్రిమ రూపకమైనమాయయెఱుకను మేమెఱుంగుదుమనియు జ్ఞానముచేతం దెలుసుకొంటిమనియు, యోగసమాధులే యాత్మను జూచుటకుఁ గారణములనియుఁ, జూచినవెంటనేయామాయయెఱుక మాయమైపోయెననియుంజెప్పుదురు. ఆత్మస్వరూపుండు సదా గనుపించ నందుచేతనే, కొందఱు కళాస్వరూపమనియుఁ, గొంద ఱానందస్వరూపంబనియుఁ, గొందఱుచిదాకాశమనియు, గొందఱుజ్యోతియనియు నానావిధములుగాఁజెప్పుదురు. అందఱునునిల్కడగాఁజూడనివారే, గ్రంథములఁ జూచి భయపడిగాభారుచేతఁ దబ్బిబ్బుమాటలుగాఁ జెప్పుదురుగాని నిజముగా నుండిన సమాచారముకాదు. మాయయెఱుకనుజూచి యుండినయెడల, వేదములను గల్పించినవారు దానిని నిట్టిట్టిదని నిర్దేశించిచెప్పక యాత్మయనియును, బ్రజ్ఞానమనియును, నహంబ్రహ్మాస్మియనియును, దత్త్వమసియనియును నాలుగు ప్రకారములుగానేలచెప్పిరి? కాఁబట్టి మాయయెఱుక నెవ్వరునుజూడలేదు. అదిభ్రిమస్వరూపముగనుక లేనిదనియే తీర్మానము. వేదములిరువదియైదు తత్త్వములుగల శరీరాత్మలనే చెప్పుటచేత వేదములుమాయకే ప్రమాణములు. ఆత్మమాయ. అంతరాత్మమాయ. జీవేశ్వరులుమాయ ప్రజ్ఞానముమాయ. మనస్సుమాయ. బుద్ధి

మాయ. చిత్తముమాయ. అహంకారముమాయ. పంచప్రాణములు మాయ. పంచతన్మాత్రలుమాయ. కర్మేంద్రియములుమాయ. అధిదేవతలుమాయ. అధిభూతములుమాయ. సర్వసాక్షిమాయ. చైతన్యస్వరూపిణియనుసమ్మవారుమాయ. ముక్తికాంతమాయ. ఆదిశక్తిమాయ. మహాశివుఁడుమాయ.నారాయణుఁడుమాయ. సచ్చిదానందముమాయ. కళమాయ. జ్యోతిమాయ. ఆనందముమాయ. ప్రజాపతిమాయ. ప్రపంచముమాయ. చిదాకాశముమాయ. భ్రిమస్వరూపముగనుకమాయను మూలముతేదు. మాయగానిదే యచలపరిపూర్ణబ్రహ్మము. అది యాత్మకాదు. శరీరముకాదు. ఇరువదియాఱవదియైన పరతత్వముకాదు. కేవలాత్మయైనయచలమునకు స్థూలసూక్ష్మకారణశరీరములుగాని,మహాకారణదేహముగానిలేవు. అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయకోశములుగాని, జాగ్రత్ స్వప్న సుషుప్తి తుర్యావస్థలుగానిలేవు. తుర్యాతీతమేయచలము. అది పురుషుఁడుగాఁడు, స్త్రీగాదు. కలలోవచ్చి మేలుకొనినంబోయెడువాఁడుగాఁడు. సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును, జలించక స్వతస్సిద్ధముగానుండువాఁడు. శోకపోకలులేనివాఁడు సచ్చిదానందరహితుఁడు. ప్రపంచమునెఱుఁగఁడు. ఎఱుకలేనివాఁడు. కార్యకారణము లెఱుక. ప్రకృతిపురుషులెఱుక. జీవేశ్వరులెఱుక. నాదబిందుకళలెఱుక. క్షేత్రబీజంబు లెఱుక. విద్యావిద్య లెఱుక. సగుణనిర్గుణము లెఱుక. దేహిదేహము లెఱుక. భగవంతుం డెఱుక. ఆదినారాయణమూర్తి యెఱుక. మహాలింగమెఱుక. త్రిమూర్తు లెఱుక. చిదాకాశమెఱుక. ప్రపంచమెఱుక. విశ్వరూపమెఱుక. శరీరమెఱుక. ఎఱుక యనఁగా మాయ. మాయ యనఁగా భ్రిమ. ప్రపంచముభ్రిమ. లోకములు భ్రిమ. జననీజనకులు భ్రిమ. పుత్రీపుత్రులుభ్రిమ. భార్యాభర్తలు భ్రిమ. స్త్రీపురుషులు భ్రిమ. దేవతలు భ్రిమ.పశువులుభ్రిమ. స్వర్గనరకంబులు భ్రిమ. బంధమోక్షంబులు భ్రిమ. సుఖదుఃఖంబులు భ్రిమ. జన్మనమరణంబులు భ్రిమ. నామరూపంబులు భ్రిమ. కులగోత్రములుభ్రిమ. పంచభూతములుభ్రిమ.పంచలోహములు భ్రిమ. నవరత్నములు భ్రిమ. ధనధాన్యములు భ్రిమ. గృహగోపురములు

భ్రమ సర్వజ్ఞత్వములు భ్రమ. కించిజ్ఞత్వములు భ్రమ. పుణ్య పాపంబులుభ్రమ. అహంకారమునుభ్రమయునొక్కటే అహంకారమున కే భ్రమ. అహంకారములేకున్న భ్రమలేదు. అహంకారరహిత యచలబ్రహ్మమునకేమి భ్రమయున్నది? అహంకారముతోడ భ్రమపోయెను. అహంకారమునకే కులగోత్రములు అహంకారములేని పరిపూర్ణమునకేమికులమున్నది? ఏమియునులేనిదే యచలము. ఉపాధిద్వయదోషరహితమే యచలము. నీనిజస్వరూపమేయచలము. నీనిజస్వరూపమే రూపనామములులేని పరతత్వము. నీనిజస్వరూపమే నిర్వికారము. నీనిజస్వరూపమేనిరంజనము. నీనిజస్వరూపమే యశరీరము. నీనిజస్వరూపమే సదాయుండునది. నీనిజస్వరూపమే శరీరాత్మలులేనికేవలాత్మ. నీనిజస్వరూపమే ప్రకృతిద్వయదోషరహితము. నీనిజస్వరూపమే పరమపదము. నీ నిజస్వరూపమేసర్వకాలములందును, సర్వదేశములందును సర్వావస్థలందునుస్వతస్సిద్ధముగా నుండునది. నీనిజస్వరూపమువినదు. చూడదు. చేయదు. భాషించదు. చేయించదు. పెరుగదు. తరుగదు. అరుగదు. కరుగదు. తిరుగదు. మొరుగదు. రతిచేయదు. పుట్టదు. గిట్టదు. సర్వకాల మొకరీతిగానేయుండును. నీనిజస్వరూపమైన యచలమునకు శరీరములేదు. అదియాత్మకాదు. పరమాత్మకాదు. ప్రజ్ఞానముకాదు. చైతన్యముకాదు. సర్వసాక్షికాదు. అంతరాత్మకాదు. జీవేశ్వరులుకాదు. చిదాకాశముకాదు, చిత్తుకాదు, ద్రష్టకాదు, జ్యోతికాదు, ఆనందముకాదు, మోక్షాదిపదవులుకాదు, త్రిగుణములుకాదు, శ్రీమన్నారాయణమూర్తి కాదు. శ్రీసదాశివుడుగాదు, బ్రహ్మదేవుడుగాదు, ఐక్యముకాదు, కళగాదు, సూర్యమండలముకాదు, చంద్రమండలముకాదు, అగ్నిమండలముకాదు, క్షేత్రముకాదు, క్షేత్రజ్ఞుడుకాదు, ప్రకృతికాదు, పురుషుడుకాదు, స్త్రీకాదు, నపుంసకుడుకాదు, శూన్యముగాదు, తత్పద త్వంపదములుకాదు, అసిపదముకాదు, విద్యావిద్యలుకాదు, బీజజడములుకాదు. అకారముకాదు, ఉకారముకాదు, మకారముకాదు. ఈమూడునుగూడినఓంకారమునుగాదు. త్రికూటముకాదు, భ్రూమధ్యముకాదు, ముక్తికాదు, ముక్తికాంతయునుగాదు, భక్తికాదు, వైరాగ్యముకాదు, యోగముకాదు, జ్ఞానముకాదు, సమాధికాదు, నియమముకాదు, నిష్ఠకాదు, బంధ

ముకాదు, మోక్షముకాదు, పదవులుకాదు, ప్రపంచముకాదు, ప్రణవముకాదు, ప్రజ్ఞకాదు, అఖిలశాస్త్రములుకాదు, ఆకాశముకాదు, వాయువుకాదు, అగ్నికాదు, జలముకాదు, పృథివికాదు, విశ్వముకాదు, జగముకాదు, అర్ధనారీశ్వరుఁడుకాదు, హంసకాదు, హరిహరులుకాదు, అండముకాదు, పిండముకాదు, బ్రహ్మాండమునుగాదు, లక్ష్యార్థములుకాదు, లక్ష్యముకాదు, ముద్రలుకాదు, మానసముకాదు, ప్రసంగముకాదు, స్థూలముకాదు, సూక్ష్మముకాదు, కారణముకాదు, కార్యముకాదు, కైలాసమునుగాదు, సత్యలోకమునుగాదు, వైకుంఠమునుగాదు, మోక్షముగాదు, జీవన్ముక్తిగాదు, పంచకోశములుగాదు, జ్ఞానకర్మములుగాదు, బంధమోక్షములుగాదు, శ్రుతులుగాదు, స్మృతులుగాదు, సూత్రములుగాదు, భాష్యములుగాదు, కర్తగాదు, భోక్తగాదు, ఉపాధిద్వయదోషరహితమైన పరమపదమే నీనిజస్వరూపము, నీనిజస్వరూపమునకు శరీరత్రయము లేదుగనుక పాపముచేయదు, పుణ్యముచేయదు, పుట్టించదు, పుట్టించనుబడదు, చిక్కదు, చొక్కదు, భోగించదు, భోగములెఱుఁగదు, వినదు, తినదు, చూడదు. అవయవములు లేనిదిగాఁబట్టి మొఱుక లేదు, మఱుపు లేదు, రూపనామములు లేవు, నీనిజస్వరూపమును నిర్ణయించి చెప్పుటకు హరిహరాదులకైనసాధ్యపడదు. యుగములపర్యంతము సమాధినిష్ఠలు సాధించువారైన నిన్నుఁబట్టఁజాలరు, సాధ్యాసాధ్యములు లేనివాఁడవు, సర్వసముఁడవు, అంతటనుండువాఁడవు, నీకురెండవది లేదు, గురుకటాక్షముచేతఁగాని నిన్నుం జూడఁజాలరు, గురుకటాక్షమునకంటె వేఱొండు లేదు, గురుడేఁ దేవునిం జూపించువాఁడు. దేవభ్రాంతిగలవారికి లోకభ్రాంతిగలవారికి మోక్షభ్రాంతిగలవారికిఁ దెలియంబడవు, జ్ఞానకర్మములం దాశయున్నఁ బ్రకృతిద్వయము వీడదు. ప్రకృతిద్వయదోషులే పరబ్రహ్మ పరమశివులు. ప్రకృతిద్వయదోషులే బ్రహ్మేంద్రాదులు, ప్రకృతిద్వయదోషులే ఋషులు ప్రకృతిద్వయదోషులే జ్ఞానులు, ప్రకృతిద్వయదోషులేయోగులు, ప్రకృతిద్వయదోషులేభక్తులు, ప్రకృతిద్వయదోషులేదేవతలు, ప్రకృతిద్వయదోషులే మానవులు, ప్రకృతిద్వయదోషులే చతుష్పాదద్విపాదజంతువులు, ప్రకృతిద్వయదోషులే క్రిమిపక్షికీటకాదులు, ప్రకృతి

ద్వయదోషులే రాక్షసులు, ప్రకృతిద్వయదోషమే త్రిలింగములు, ప్రకృతిద్వయదోషరహితమే నీనిజస్వరూపము, ఉపాదిద్వయదోషమే విధినిషేధములు, ఉపాధిద్వయదోషరహితమే నీనిజస్వరూపము, ఉపాధిద్వయదోషమే యుపవాసము, ఉపాధిద్వయదోషమే వ్రతము, ఉపాధిద్వయదోషమేనీమము, ఉపాధిద్వయదోషమేనిష్ఠ, ఉపాధిద్వయదోషమే యాత్మధ్యానము, ఉపాధిద్వయదోషమే జ్ఞానము, ఉపాధిద్వయదోషమేయోగము, ఉపాధిద్వయదోషమేభక్తి, ఉపాధి ద్వయదోషమే వైరాగ్యము. ఉపాధిద్వయదోషమే జడలుదాల్చుట. ఉపాధిద్వయదోషమే సన్న్యసించుట. ఉపాధిద్వయదోషమేమానము. ఉపాధిద్వయదోషమేప్రసంగము. ఉపాధిద్వయదోషమేప్రపంచము. ఉపాధిద్వయదోషమే యహంకారుఁడు. అహంకారమువలననే చావుపుట్టుకలు అహంకారమువలననేజ్ఞానకర్మములు. అహంకారమువలననేబంధమోక్షములు. అహంకారమువలననే సుఖదుఃఖములు. అహంకారము లేనివారికి నేమియును లేదు. ప్రపంచము లేదు. ఉత్పత్తిస్థితిలయంబులును లేవు. రూపనామంబులు లేవు. అహంకారములేకుండుటే నీనిజస్వరూపము. నీనిజస్వరూపమునకు వేదశాస్త్రములు ప్రమాణములుకావు. వేదశాస్త్రములు మాయమెఱుకకే ప్రమాణములు. గొడ్రాలికి బిడ్డలేనటులఁ బ్రకృతి ద్వయదోషరహితున కెఱుకలేదు. ఎండమావులయందు నీళ్లులేనటు లుపాధిద్వయదోషరహితులకుఁ బ్రపంచములేదు. ఆకసమునందుఁ బుష్పములేనటుల గురుమర్మముం దెలిసినవారికి లోకములేదు. కుందేటికిఁ గొమ్ములులేనటుల నాచార్యకటాక్షము నొందినవారికి జగత్తులేదు, బొమ్మయందుఁ బురుషుఁడు లేనటుల విచారణపరులకు విశ్వములేదు. త్రాటియందు సర్పములేనట్లచలపరిపూర్ణమునకు భ్రమలేదు. సర్వముభ్రాంతి. భ్రాంతిచేతనే లోకములు, దేవులు, పదవులు, పుణ్యస్థలములు, కులభేదజాతిభేదములును, గలిగియుండుట. కాఁబట్టి శరీరాత్మలు భ్రమ. రూపనామములు భ్రమ. ధననిక్షేపములు భ్రమ. సంపత్తుభ్రమ. గురుకటాక్షమునుబొంది నిజస్వరూపమెఱింగిన పుణ్యపురుషులకు మరల భ్రాంతిపుట్టనేరదు. భ్రాంతి పుట్టుటకు నింద్రియములులేవు. శరీరాత్మలులేవు. నిర్వికారమున కేమియునులేవు. కలలో

వచ్చినశరీరములును, జిత్రవిచిత్రములును, ధనవస్తువాహనములును, సుఖానందములును మేలుకొనిన నేమిలేదు. గురువాక్యముచేత మేలుకొనిన వారికిగుఱుతు నెఱుఁగుశరీర మేమిలేదు. సర్వముభ్రాంతి. భ్రాంతి రూపకమైన మాయయొఱుక యచలపరిపూర్ణ బ్రహ్మమువలనం బుట్టినదని కపీశ్వరుఁడు చెప్పినాఁడు. ఏమియును లేని పరిపూర్ణబ్రహ్మమువలన మాయయొఱుక యెట్లుపుట్టును? పుట్టినవాఁడుగదా పుట్టించును. పుట్టని చావని పరిపూర్ణ మెటులఁ బుట్టించును? ఇదియే యధ్యారోపాపవాదము. ఈవాదమును గపీశ్వరుఁడు చేసినాఁడు గనుకఁ గపీశ్వరుఁడే పుట్టుచున్నాఁడు. కపీశ్వరుఁడే గిట్టుచున్నాఁడు మాయయొఱుక పుట్టనేలేదు. మాయాయొఱుకకు జననీజనకులు లేరు. తల్లిగండ్రులు లేక యెటులఁబుట్టును? పుట్టనేలేదు. మూలములేని యొఱుకను గుర్తెఱుఁగుట గురుద్రోహము మూలములేని యొఱుక పుట్టదు. చావదు. పుట్టినట్టును జచ్చినట్టును దోఁచుట భ్రమ. భ్రమలేనిదే యచలము. అచలమువలననేమియును బుట్టనేలేదు. పుట్టించను బడలేదు. మూలములేక యే మాయయొఱుక మటుమాయముగావచ్చి మటుమాయముగాఁ బోవుచుండుచు. రాకపోకలకు భ్రమయే కారణము. కాఁబట్టి పుట్టునదేది? చచ్చునదేది? ఆహా! లేనిదే చెప్పి భ్రమింపఁజేసిన యాకపీశ్వరుని బుద్ధికి సంతసించెదను. మాయయొఱుక తనంతటఁదానే వచ్చి తనంతటఁదానే కొన్నిదినములుండి తనంతటఁదానే యేమియు లేకపోవును. సర్వముసుజిత్తవృత్తి. చిత్తుఁడే మూలమాయ. కలలోశరీరము లెందుండి వచ్చెను? ఎక్కడికిఁబోయెను? భ్రమమాత్ర మేగాని నిజముగా రాలేదు. అహా! ఏమియచ్చెరువు! మూలములేని మాయకు నిలుకడలేదు. ఉన్నదికాదు. లేనియొఱుక యెన్నివిధముల భ్రమింపఁజేయుచున్నది! మాయను విచారించినకొద్దిభ్రమవిస్తరించుచుండును! భ్రాంతిలేనిచదువు చదువవలెను. భ్రమలేనివాఁడవు గమ్ము. ప్రపంచముమాయ జీవేశ్వరులుమాయ. అంతరాత్మమాయ. చిదాకాశముమాయ. చిత్తుమాయ. సర్వసాక్షిమాయ, గ్రష్టమాయ. ఐక్యముమాయ, ప్రజ్ఞానముమాయ. జ్యోతిమాయ. ప్రకాశముమాయ. చిత్రతళుకులుమాయ. త్రిమూర్తులుమాయ. అండాండ పిండాండ బ్రహ్మాండములుమాయ, సూర్యచంద్రులుమాయ,

పంచభూతములుమాయ. పంచేంద్రియములుమాయ, పంచశక్తులు మాయ, పంచబ్రహ్మలుమాయ, ప్రకృతులుమాయ, మోహాదిపదవులుమాయ, కలలోవచ్చినవన్నియును మేలుకొనిన మటుమాయమై యేమియు లేకపోవు. ఈయుత్తబట్టబయలునకంటె నేమిలేదు. ఇంతకు మిక్కిలిలేదు. ఇంతకంటె నెక్కువలేదు. ఇదియే పరిపూర్ణము. ఇదియే నీనిజస్వరూపము, నీనిజస్వరూపమే కల్పనారహితము, నీనిజస్వరూపమే నిత్యము, నీవే దేవదేవుడవు, నీవేదాంవు, నీవేశాశ్వతుండవు, నీకు రెండవదిలేదు, నిన్నుఁదర్శించిన వారికేజన్మరహితము, నీదర్శనమే పుణ్యపాపరహితమని నిజస్వరూపమును సూచనగావించెను. ఆరామచంద్రుఁడు గ్రహించి నిజస్వరూపమునకంటె నేమియును లేదని ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొని సర్వము నచలపరిపూర్ణమని యాశ్చర్యపడుచుండెను.

వసిష్ఠమహాఋషి, బిడ్డా గురుశిష్యరహితమైన యీపరిపూర్ణమునకంటెను నేమిలేదు. ఇదియే ద్వాదశాక్షరీ మంత్రము. జ్ఞానమువలన గుర్తెఱుఁగుటగాఁబట్టి మూలములేని యీగుఱుతు నెఱుఁగు శరీరమేమి లేదు. ఇదియే షోడశాక్షరీమంత్రము. ఈరెండుమంత్రములను స్మరించుటే భ్రాంతిరహితము. ఈమంత్రములు రెండును దనకుఁదానే తాత్పర్యము కావలయును, కలలోవచ్చినశరీరము మేలుకొనిన నేమిలేదు, ద్వాదశాక్షరికంటె నెక్కువలేదు, షోడశాక్షరికంటె నీచములేదు, నీకుభ్రాంతి యెన్నఁడును బుట్టఁబోదు, పుట్టుటకు నేమియును లేదు, ఎటులఁబుట్టును? పుట్టనేపుట్టదు, నీకు జననీజనకులును సోదరులును భార్యయును గలరా? ఇంద్రియములున్నవా? చావుపుట్టుకలున్నవా? భ్రాంతిపుట్టునా? నిజముగాఁజెప్పుమనిన నా రామచంద్రుఁడా మహాత్మునిపాదకమలములను దన నేత్రములతో నద్దుకొని, స్వామీ, గురువరా, నానిజస్వరూపము నేనేమని చెప్పుదును! నాకుశరీరాత్మలు లేవు, చావుపుట్టుకలు లేవు, బంధమోక్షములు లేవు. ఇంద్రియములు లేనివానికి భార్యయు లేదు, పుట్టుక లేని వానికి జననీజనకులు లేరు. ఏవికారములేని యశరీరిని. అద్వయుండను. నాకు రెండవది లేదు, నేనేకాలమందును నొక యాకారముకాలేదు, ఎఱుకనుబుట్టించలేదు, పుట్టినదనియుఁ దెలియదు. ప్రపంచమెఱుఁగను, సత్యాసత్యముల నెఱుంగను, నానిజస్వరూపమునకంటె నేమియును లేదని

పలికిన నామునీంద్రుఁడతనిముద్దుపెట్టుకొని, బిడ్డా, నిజమెఱింగితివిగదా ! నీనిశ్చయమును విడువవద్దు, మూలములేనియీగుఱుతునెఱుఁగుశరీరము నేననిభావించవద్దు. అట్లుభావించుటేగుఱుతునెఱుఁగుట, గుఱుతునెఱుఁగుటేభ్రమ, గుఱుతునెఱుఁగుటే జ్ఞానము, గుఱుతునెఱుఁగుటేకర్మము, గుఱుతెఱుఁగుటే పుణ్యపాపములు, గుఱుతెఱుఁగుటే సుఖదుఃఖములు, గుఱుతెఱుఁగుటే బంధమోక్షములు, గుఱుతెఱుఁగుటే చండాలము. గుఱుతునెఱుఁగుటే గురుద్రోహము, గుఱుతు నెఱుంగుటచేతనే జననమరణములు, ఈగుఱుతెఱుఁగు శరీరమునకుమూలమే లేదు, మూలములేనిదానికి నేమియును లేదు, సర్వముభ్రాంతి, ఇది రజ్జుసర్పభ్రాంతి, విచారణచేతఁగాని భ్రాంతివిడువదు. ఈపరిపూర్ణమునకంటె నేమిలేదు. భ్రమస్వరూపకమైన మాయయెఱుకను నాకు గురుదక్షిణగా నిమ్ము, గురువునకర్పించినసొత్తునుగాని యెఱుకనుగానిపదపడి గ్రహించుటపాపకార్యము, నీనిజస్వరూపమేనీవుగదా? నీకెందును భ్రమపుట్టినేరదుగదా? ఈచండాలమైన మాయ యెఱుకతోడి సంబంధమును విడిచి, యుక్తపరిపూర్ణమునకంటె నేమిలేదనియును, నీగుఱుతెఱుఁగు శరీరమునకు మూలములేదనియును జపించుచుండుము. చండాలసంసర్గ నిన్నుంబాసిపోవును. ఇదేపరమరహస్యము. ఇంతకంటె నేమిలేదు. మనయిరువురసంవాదచరిత్రంబైన శ్రీరామహృదయమును నీవేదాంతగ్రంథముఁజదివినవారును, వినినవారును, మోక్షాదపదవులను బొందుదురు. గురుకటాక్షముచేతవిచారణచేసిన పుణ్యాత్ములుప్రకృతిద్వయదోషరహితమైనపరమపదమునుబొందుదురు. ఇందుకుసందియములేదు. ఇదిగురువాక్యము. ఇది వేదాంతము. ఇంతకంటెను విశ్రాంతిమార్గము వేఱొండులేదు.

జ్ఞానకర్మములలోని మార్గము లనేకములుగలవు. అవియన్నియు జననమరణప్రవాహములోనివి. వానినివినరాదుస్మరింపరాదు. వారే మాయకులు. వారేభక్తియోగజ్ఞానులు. వారికేవేదములు ప్రమాణములు. వారేచచ్చువారు, పుట్టువారు. వారువేదాంతులుగారు. వారు విశ్రాంతిమార్గమునెఱుఁగరు. వారేమిథ్యాస్వరూపకమైన ప్రపంచము సత్యమనినమువారు. వారేప్రకృతిద్వయదోషులు వారేయాత్మసత్యమని చెప్పుచునాత్మంతోడంజచ్చి యాత్మతోడనే దేహములెత్తువారు, వారే

యుపాధిద్వయదోషులనిచెప్పిన, నారామచంద్రుఁడానందభరితుండై యా
మునీంద్రుని పాదకమలములను బన్నీటుంగడిగి, యర్చనవందనాది పూజలు
గావించి, సువర్ణరత్నములతోఁబూజించి ధూపదీప నైవేద్యములచేత
సంతుష్టినొందించి, యామహాత్ముని శ్రీపాదజలమునుభక్తశేషమునుదిగ్ధ
ప్రసాదములుగాగ్రహించియాగురుస్వామికి వెలలేనివస్త్రాభరణములను
వివిధవస్తువులనిచ్చిప్రయాణముచేసి తానుబాదచారియై యామహాత్ముని
వెంటఁగొంతదూరముపోయి యతనివలన దీవనలుగైకొని, మగుడఁబురి
లోనికివచ్చి యామునీంద్రుని యద్భుతపుశక్తికి నాశ్చర్యపడుచు, నా
మహాత్ముఁడిచ్చినమంత్రములను మఱవక, యశరీరుండై, యచలుండై,
పరిపూర్ణుండై, ప్రకృతిద్వయదోషరహితుండై సచ్చిదానందరహితుండై,
శాశ్వతుండై యుండెననిచెప్పిననాశిష్యవరు లద్భుతమునొంది, గురురాయ
నింజూచి, పావనచరితా, యత్యద్భుతమైన వసిష్ఠశ్రీరామసంవాదమును
జెప్పిమాకుభ్రాంతినిరాసకంబుగావించితిరి, మహాత్మా, ప్రపంచభ్రాంతియు,
స్వప్నభ్రాంతియు, నింద్రజాలభ్రాంతియు, మమ్ముంబాసిపోయెను.
భ్రమస్వరూపకమైనమాయ యొఱుకసంబంధమును విడిచి నిజస్వరూప
మొందినిత్యులమైతిమి. ఐనను దేవరవారికొకవిన్నపము. మోక్షాదిపదవుల
కన్నిఁటికిఁగర్త యెవ్వరు? ఏవిచారణచేతనవిపొందవచ్చును? అవిస్థిరములా
యస్థిరములా? దయతో మాకెఱింగించుఁడనిన నాగురువరుండిట్లనియె.

భక్తులారా! ఆత్మయేపరబ్రహ్మము. వేదములాత్మకేప్రమాణ
ములు. ఆత్మనుగుఱించియే వేదములువచించుచున్నవి. ఆత్మయేమాయ
యొఱుక. మాయయొఱుకే చైతన్యస్వరూపిణియను నమ్మవారు. ఆదేవి
సర్వసాక్షిస్వరూపమైకన్నులయందున్నది. ఆదేవిని ముక్తికాంత యని
యును, నాదశక్తియనియును, ద్రష్టయనియును, నాపోజ్యోతియనియును,
శ్రీమన్నారాయణుండనియును, మహాలింగమనియునుజెప్పుదురు. ఆదేవి
వలనంజిదాకాశమును, నాచిదాకాశమువలనసోహమను రెండక్షరముల
తోఁగూడిన ప్రణవమను శబ్దమునుగలిగెను. ఆప్రణవమునే హంసయని
యును, బరమహంసయనియును, బ్రాణవాయువనియునుజెప్పుదురు. ఆ
పరమాత్మునియొక్క త్రిగుణములనేత్రిమూర్తులని, అకార-ఉకార-మకా
రములని నానావిధములుగాఁ జెప్పుదురు. కాఁబట్టి మోక్షాదిపదవులకు

బ్రహ్మవిష్ణుమహేశ్వరులుకర్తలుగారు, వీరుప్రతిదినమునిద్రయనుప్రళయమునఁ ద్రిగుణశూన్యంబై పోవువారు. వీరుమువ్వురు మాయలోకములకుఁగర్తలుగాని మోక్షాదిపదవులకుఁగర్తలుగారు. మాయయెటుకయె కర్త కర్మ క్రియలుగాను, గారణకార్యములుగానునున్నది. కాఁబట్టి మోక్షాదిపదవులకు నెటుకేకర్త.ఆయెటుకచేతఁదన్ను బ్రహ్మమనిభ్రాంతిపడినభక్తులకును, వివిధసాధనపరులైన యోగులకును, జ్ఞానులకును, నాలుపదవులుగల్పింపంబడెను. అవియెవ్వియనిన :—సాలోక్యము, సారూప్యము, సామీప్యము, సాయుజ్యము, సార్ష్టిఁత్వము, మోక్షము. ఈ యాఱును మాయవలనంగల్పితములుగాఁబట్టిభ్రమరూపకములు. భక్తియోగజ్ఞానులు మాయయెటుకను బ్రహ్మమనినమ్మి,నాదబ్రహ్మమునులేపి యానందింతురు. ప్రణవధ్యానమునుజేయుదురు. షడాధారములనుదర్శింతురు. చిదాకాశమువఱకువ్యాపించిచిత్కళలుదర్శించి యానందింతురు. ముక్తికాంతనుసేవింతురు. ఈమాయకులకుఁగాను నాపదవులు గల్పింపంబడెను. అవికల్పితములుగాని శాశ్వతములుగానుండునవిగావు. అస్థిరములైనపదవులు పుణ్యమునశించఁగానే మగుడనరకమునకు రప్పించునట్టివి. జననమరణప్రవాహములోనివి. పుణ్యపాపములుగలవి. సుఖదుఃఖములుగలవి.ఈబ్రహ్మాండమున నొక్కొకప్రదేశమున నిర్ణయింపఁబడినవి. ఇవి భ్రమస్వరూపకమైనపదవులు. అవిసువర్ణరత్నములతో నిర్మింపంబడిన సుఖస్థానము లగుటంజేసి భ్రమచేతనందఱు నాపదవులనే కోరుదురు. కలలో నేనుఁగునెక్కి మేలుకొనిన నేమిలేనటులఁ బదవులన్నియును స్వప్నమువంటివేగానినిల్కడగానుండునవికావు.ఈభ్రమరూపకపదవులను గోరువారికి జననమరణములుండును. అవి యుపాధిద్వయముతోఁగూడుకొనియున్నవి. కాఁబట్టి యీపదవులకుమితిమేరలుండును.నిత్యములుగానుండునవికావు కల్పనాసహితములు. భ్రమవలననేయుండునవి.మాయామయుండైనపరమాత్మునిపదవులేయనిత్యములగుచుండఁగా,నిద్రయందులయించుత్రిగుణస్వరూపులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులపురములెంతమాత్రము. అనఁగానెంతటిస్థిరములు. కల్పనారహితమైన పరమపదమే నిత్యము. ఉపాధిద్వయదోష రహితమైన పరమపదమేస్థిరము. సుఖదుఃఖరహితమైన పరమపదమేసత్యము. బంధమోక్షరహితమైనపరమపదమే

శాశ్వతము.సర్వలోకములందు, సర్వకాలములందు,సమస్తదేశములందు, సమస్తవస్తువులందు నిండియుండునదియే పరమపదము. వేదాదిగ్రంథములు సంప్రాప్తమేలేదు. బంధమోక్షములనెఱుంగదు. సాధకవిద్యల కందదు. ఆచార్యకటాక్షమునుబొందినవారికి మిగులసులభము. అత్యంత సునాయాసము.ఆచార్యకటాక్షమునకుఁ బిదప మఱలఁదోఁచుటకు నేమి లేదు. ఇదియే వేదాంతము. పరమరహస్యము. గురుగోప్యమని చెప్పిన నాశిష్యవరులు,స్వామీ ! గురుశిష్యులెట్టివారు ? వారిధర్మములెట్టివి ? దయతో నెఱింగించుఁడని వేఁడిన నాగురువరుండిట్లనియె.

శిష్యులారా, తల్లి తండ్రి గురుఁడు దేవుఁ డనియున్నదిగనుక, తల్లిబిడ్డకుం దండ్రినిఁజూపించినటుల గురుఁడు శిష్యునకుం దేవునిఁ జూపింపవలయును. అట్లుచూపించినవాఁడేయాచార్యుఁడు. దేవునింజూచినవాఁడే శిష్యుఁడు. నిజస్వరూపమునుబొందించినవాఁడే యాచార్యుఁడు. జననమరణప్రవాహమునుండి తొలఁగించినవాఁడే యాచార్యుఁడు. నీకు వేదశాస్త్రములు ప్రమాణములుగావని చెప్పినవాఁడే యాచార్యుఁడు. పరమపదమందునిలిపినవాఁడే యాచార్యుఁడు. బంధమోక్షములు, సుఖదుఃఖములు, కులజాతిభేదములు, మతాభిమానములు, లేకుండఁ జేసినవాఁడే యాచార్యుఁడు. ఆచార్యుఁడుదేవుఁడునొకటే. ఆచార్యకటాక్షమే బంధమోక్షరహితము.ఆచార్యుఁడేబ్రాహ్మణుఁడు. బ్రహ్మమునుదర్శించినవారే బ్రాహ్మణులు. పరిపూర్ణమును సేవించినవారేబ్రాహ్మణులు. అచలమును బొందినయశరీరులే బ్రాహ్మణులు. శరీరాత్మలులేనివారే బ్రాహ్మణులు. విధినిషేధములులేనివారేబ్రాహ్మణులు. సచ్చిదానందరహితులే బ్రాహ్మణులు. నాదబిందుకళాతీతులే బ్రాహ్మణులు. జననమరణములు లేనివారే బ్రాహ్మణులు. అహంకారములేనివారేబ్రాహ్మణులు. అహంకారులే శూద్రులు.అహంకారులేభక్తియోగజ్ఞానులు. అహంకారులేబంధమోక్షములుగలవారు. అహంకారములేకుండుటే బ్రహ్మసిద్ధి.

శైవమతోద్ధారకుండైన బసవేశ్వరులవా రహంకారములేని నిజమైనబ్రాహ్మణుఁడుగనుకనే కులభేద జాతిభేదములనెంచక లింగబలిజ కులజుండగు చెన్నయ్యగారికి శిష్యుఁడై యతనికిఁబరిచర్యలు గావించుచు నతని తీర్థ ప్రసాదములను త్రికరణశుద్ధిగాఁ గైకొని పరిశుద్ధుండయ్యె

వనియు, నద్వైతమతోద్ధారకుండైన శంకరాచార్యులవారహంకారము లేని నిజమైన బ్రాహ్మణుఁడు గనుకనే కులభేదజాతిభేదము లెంచక మాదేవుల సిద్ధప్పగారికి శిష్యుఁడై యతని తీర్థప్రసాదములను గ్రహించి పరిశుద్ధుండయ్యెననియును, వైష్ణవమతోద్ధారకుండైన రామానుజులవారహంకారము లేని నిజమైన బ్రాహ్మణుఁడుగనుకనే కులభేద జాతిభేదముల నెంచక పంచమకులజులైన మారునూరినంబిగారికిని, దిరుప్పాణ్యాళ్వారుల వారికిని, రెడ్డికులజుండగు నమ్మాళ్వారులవారికిని భక్తుఁడై వారితీర్థప్రసాదములనుగ్రహించి పరిశుద్ధుండయ్యెననియును బ్రమాణములున్నవి.

అహంకారములేనివారే బ్రాహ్మణులు. అహంకారమేజన్మము. అహంకారమేపాపము. అహంకారమేబంధమోక్షములు. అహంకారమే సుఖదుఃఖములు. అహంకారములేకుండుటే పరమపదము. కులమువలన బ్రాహ్మణులుగారు. జాతివలన బ్రాహ్మణులుగారు. పుట్టుకవలనబ్రాహ్మణులు గారు. బ్రహ్మసంబంధులు బ్రాహ్మణులుగారు. అచలబ్రహ్మమును దర్శించినవారే బ్రాహ్మణులు. పరిపూర్ణమును సేవించినవారే బ్రాహ్మణులు. పంచబ్రహ్మలకుంబుట్టినవారును బ్రాహ్మణులుగారు. పంచబ్రహ్మలును గులమువలన బ్రాహ్మణులుగారు. మనుబ్రహ్మకమ్మరివాఁడు, వాని తమ్ముఁడు మయబ్రహ్మ వడ్లవాఁడు, వానితమ్ముఁడు త్వష్టబ్రహ్మకంచరవాఁడు. వానితమ్ముఁడుశిల్పిబ్రహ్మకాశీవాఁడు,(ప్రతిమలుబొమ్మలుచేయువాఁడు.)వానితమ్ముఁడుహిరణ్యబ్రహ్మఅగసాలవాఁడు. (బంగారుపనులు చేయువాఁడు.) వీరే బ్రహ్మాండమునుసృష్టించినవారు. వీరేలోకములను గల్పించినవారు, వీరేయంతర్నిర్మాణము బాహ్యనిర్మాణముచేసినవారు, వీరే త్రిమూర్తులుసహాదేవతలకందఱికిఁదండ్రులు, వీరేసృష్టికర్తలు. వీరే కులభేదజాతిభేదములఁ గల్పించినవారు, వీరే సర్వసృత్తులను గావించినవారు. వీరేమాయకులు వీరికంటెనుమాయలేదు. భ్రమలేదు. వీరలుపాధిద్వయదోషులుగనుకవీరును బ్రాహ్మణులుగారు. నిజస్వరూపమునుబొందినవారేబ్రాహ్మణులు. నిజగురువులుబ్రాహ్మణులు. అహంకారులు కల్లగురువులు. కల్లగురువులకు లెక్కలేదు. భ్రాంతితోఁగూడుకొనిన వారు, శరీరాత్మలుగలవారు, దేవునకునామరూపములఁ గల్పించి ప్రతిమలను బూజించి ధ్యానించువారు.యాత్ర తిరునాళ్లకుంబోవువారు,

మతములయందు వర్తించువారు. మతదేవతలనునమ్మువారు, ప్రకృతి ద్వయదోషులు. జననమరణ ప్రవాహములోనివారు.

సర్వధర్మములయందు నాసక్తులుగాక గురువాక్యపద్ధతినటించువారేశిష్యులు. త్రికరణశుద్ధిగావివిధశుశ్రూషలుగావించువారేశిష్యులు, తనుమనోధనములయందు వంచనలేకయాచార్యునకు సమర్పించినవారే శిష్యులు. ఆచార్యుఁడే దేవుఁడని భావించినవాఁడే శిష్యుఁడు. ఆచార్యుని శ్రీపాదజలమును మహాతీర్థముగాఁగ్రహించినవాఁడేశిష్యుఁడు. ఆచార్యుని భుక్తశేషమునుమహాప్రసాదముగాఁగ్రహించినవాఁడేభక్తుఁడు ఆచార్యునందుభక్తిశ్రద్ధలుకలిగి వినయముతో వర్తించినవారే భక్తులు. భక్తులేభాగవతులు. ఆచార్యునకు వివిధవస్తువులనుగూర్చువారేభాగవతులు. ఆచార్యకటాక్షముచేత నచలపరిపూర్ణబ్రహ్మమునుదర్శించినవారే భాగవతులు. నిజస్వరూపమును బొందినవారేభాగవతులు. శరీరాత్మలు లేనివారేభాగవతులు. మానాభిమానములనువిడిచినవారేభాగవతులు. ఈపరిపూర్ణమునకంటె నేమిలేదనువారే భాగవతులు. మూలములేని యీగుఱుతు నెఱుఁగుశరీర మేమిలేదనువారే భాగవతులు. నిజగురు సాంప్రదాయమెఱింగినవారేభాగవతులు. భాగవతులేకైంకర్యపరులు. ఆచార్యునకు వివిధశుశ్రూషలుగావించుటేకైంకర్యము. ఆచార్యుని గృహమందు వివిధకృత్యములను జరుపుటేకైంకర్యము, తనుమనోధనముల నాచార్యునకుసమర్పించుటేకైంకర్యము, కైంకర్యమునలననేజన్మరాహిత్యము. జన్మరాహిత్యమే పరమపదము. ఇదియేవేదాంతము.

గురుఁడేయాచార్యుఁడు. ఆచార్యుఁడేదేశికోత్తముఁడు. దేశికోత్తముఁడేగురుఁడు. గురునినరుఁడనుచుఁదలఁచినవారేగురుద్రోహులు. గురుమంత్రము మఱచినవారే గురుద్రోహులు. గురుపుత్రులనాదరణయొనర్చనివారేగురుద్రోహులు. గురునాజ్ఞమీఱినవారేగురుద్రోహులు. గురునితో నబద్ధమాడినవారే గురుద్రోహులు. తనుమనోధనముల నాచార్యునకు సమర్పించనివారే గురుద్రోహులు. మానాభిమానములను గలిగి గురుని యెదుటవర్తించువారేగురుద్రోహులు. లోభగుణముచేతగురుదర్శనము చేయనివారే గురుద్రోహులు. త్రికరణశుద్ధిగాదేశికోత్తమునినారాధించనివారే గురుద్రోహులు. కపటాత్ములై వినయమునుజూపువారే గురు

ద్రోహులు. దాసులపగిదివర్తించనివారేగురుద్రోహులు. శరీరాత్మలు తామనిభావించువారేగురుద్రోహులు. నిజస్వరూపమునొందియునుగురు నెఱింగినవారేగురుద్రోహులు. వారికినరకముతప్పదు. ఇదిగురువాక్యము.

మతములవారు వారివారి మతదేవతలే జగత్కారణంబని పిడి వాదముగా వాదింతురు. మతదేవులే యబద్ధప్రపంచమునకుఁ గారణ మైనయెడలఁ గార్యమెవ్వరు? కార్యములేక కారణమును, గారణము లేక కార్యమునులేదు, గనుక కారణము విత్తువంటిది, కార్యముచెట్టు వంటిది. విత్తనములేకచెట్టును, చెట్టులేక విత్తనమునులేదు. కనుక రెండును ప్రపంచమువలె మిథ్యారూపకములు. ఎండమావులయందు నీళ్లులేనటుల విచారణ పరులకుఁగాని భ్రమనిరాసకము గానేరదు. అహంకారములేకుండినవారికి మతములతోడి కులములతోడి పనిలేదు. అహంకారముచేతనే జన్మములు. మతములను మతదేవతలను నమ్ముట నిష్ప్రయోజనము. మతములనువిచారించినకొద్దీ భ్రమ విస్తరించును. ఆహా! భ్రాంతిలేకుండుటేపరమపదము. దేహాచారనిష్ఠలుభ్రమ. శంఖ చక్రాంకితములను ధరించుటభ్రమ. తిరుమణిశ్రీచూర్ణములనుధరించుట భ్రమ. లింగకాయలఁగట్టుటభ్రమ. విభూతిరుద్రాక్షమాలలుదాల్చుట భ్రమ. గుడిగోపురములకుంబోవుటభ్రమ. ప్రతిమారాధనభ్రమ. కాశీ రామేశ్వరములకుంబోవుటభ్రమ. భ్రమవలననేబంధమోక్షములు. భ్రమవలననేపుట్టుగిట్టుటలు. భ్రమవలననేపుణ్యపాపములు. ఈభ్రాంతిరజ్జు సర్పభ్రాంతి. అదియెట్టిదనినఁదొల్లియొకరహదారిబాటలో నొకత్రాడు లావుగానునిడివిగాను బడియుండెను. దానింజూచి పెక్కండ్రుమనుష్యు లు సర్పమునిభయపడి కొందఱు ప్రాణవియోగమునేపొందిరి, కొందఱు మూర్ఛిల్లిరి, కొందఱుభయముచేతంబడిగాయములనుగొట్టుకొనిరి, కొం దఱుప్రాణభీతిచేఁబరుగువాఱిపోయి పట్టణమునంజెప్పిరి. పురిలోనిజను లందఱును గలవరమంది గుంపులుగుంపులుగాఁగూడి పెక్కువిధముల యోచించుచుండిరి. ఇట్లుండ,నొకబాటసారి యామార్గమునవచ్చుచు నా రజ్జువునుంజూచి సర్పమనిభ్రాంతినొంది, కొంతదూరమువెనుకకుంబోయి నిదానించి యీరహదారిబాటలో నీసర్పము కదలకమెదలకయుండుట కుంగారణమేమని చేతులుదట్టిసందడిచేసెను. రాళ్లువిసరికొట్టెను. అందు

వలననునదిచలించనందున మెల్లమెల్లఁగఁబోయి కఱ్ఱతోఁగదలించిచూచి త్రాఁడని తెలుసుకొని సర్పభ్రాంతిని విడిచి యాత్రాటిని హస్తమునం బుచ్చుకొని, యోహోత్రాఁడా! నీవు నాకెంత భయోత్పాతములుపుట్టించితివి? ఆహా! శరీరాత్మలు లేనిదానవు. ఏకాలమందును నీవుగొఱ్ఱె యుండవు. ఏమిలేనినీయందు సర్పభ్రాంతిపుట్టుచున్నది. ఛీఛీ, నీయందు నేదోషమును లేదు. నిన్నును నితరులనునెఱుఁగవు. ఏజోలికిఁబట్టదు. ఆహా! యెంతమంది భ్రమచేతంబడిరి! ఇందుకు నీవే కారణము. నీవే కార్యము. కార్యకారణములెఱుంగవు. ఈరెండునుభ్రమ. నీకుందెలియకనే నీయందుమాయపుట్టుచున్నది. పండితపామరు లిది తెలియనేరక భ్రమను నీవుపుట్టించినటులఁజెప్పుదురు. ఏకాలమందును భ్రమను నీవు పుట్టించలేదు. నీవేమిలేనిత్రాడవని యచటదూరముగాఁబడవైచి భ్రాంతి యెంతమాత్రమునులేక పురిలోనికివచ్చి యందుగుంపులుగుంపులుగాఁ గూడి యుండిన జనసమూహములనుజూచి, యోహో! మిత్రులారా, గాబారేలపడెదరు? అది యేమిలేని యుత్తత్రాడు, సర్పభ్రాంతినిం బొంది బహుమందిజనులు పడిపోయిరి. అది సర్పముగాదు, నిజముగాఁ ద్రాడు. నేను జక్కఁగాఁ బరిశీలించిచూచి యే భ్రాంతినిఁ బొందించని యా యుత్తత్రాటినింబట్టి దూరముగాఁ బడవైచివచ్చితినని యథార్థమునుజెప్పిన నా భ్రమికు లతనినిజవర్తమానమును దబ్బరయని యెంచి, చాలుచాలునిలుపు నీమాటలు, నూర్గురుమరణించిరి, మున్నూర్గురు మూర్ఛిల్లిరి, బహుమందిపడిగాయములుగొట్టుకొనిరి, వేలకొలఁదిజనులు భయముచేతఁ బరుగుబాఱివచ్చిరి. ఇందఱు సర్పమని చెప్పుచుండఁగా నీ వొకఁడవుత్రాడనిచెప్పుటెట్లు? పోపొమ్మనిపరిహసించిరి. కాఁబట్టి యాభ్రమికుల కెన్నివిధములఁజెప్పినను, నెన్ని దృష్టాంతములఁ జూపించినను వారునమ్మరు. వారికి సర్పభ్రాంతియే పుట్టుచుండును. నిజమెఱింగివచ్చి త్రాడనిచెప్పిన యా పుణ్యపురుషుఁడు సర్పమనికోట్లకొలఁది జనులు చెప్పి పెక్కుదృష్టాంతములు చూపించినను నతఁడు త్రాడనియెంచునేగాని సర్పమని భ్రాంతింబొందఁడు. కాఁబట్టి నిజముగా బ్రహ్మమును దర్శించినవారికిందప్ప నితరులకు నీభ్రాంతివిడువదు. భ్రాంతిచేతనే పండితపామరులు వేదశాస్త్రములనుగల్పించిరి. అచల పరిపూర్ణ

బ్రహ్మమునందు భ్రాంతివలన ప్రపంచముతోఁచుచుండును. నిజగురుకటాక్షముచేతఁగాని భ్రమవిడువదు. భ్రమవిడుచుటే పరమపదము. పరమపదమే వేదాంతము. వేదాంతమేసత్యము. వేదములుభ్రమరూపకములు. వేదములు మాయమెఱుకనే చెప్పుటనుబట్టి వేదములు సత్యములుగావు. పరిపూర్ణమేసత్యము. ఈపరిపూర్ణమునకంటె నేమి లేదు. సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును, నిండియున్నదేపరిపూర్ణము. అంతయు నీయుత్తపరిపూర్ణము. ఇంతకంటెనేమిలేదు. మాయమెఱుకకు మూలములేదు. లేనిమెఱుక లేనేలేదు. ఈపరిపూర్ణము లేకపోదు. మూలములేనియీగుఱుతెఱుఁగుశరీరమేమిలేదు. కలలోవచ్చినశరీరము మేలుకొనిన నేమిలేదు. అంతయు నీయుత్తబట్టబయిలు. దీనికంటె నేమిలేదు. లేనిప్రపంచము లేనేలేదు. లేనిమెఱుకలేనేలేదు. లేనిమాయలేనేలేదు. లేనిభ్రమ లేనేలేదు. అంతయుహుళిక్కి. ఈపరిపూర్ణమునకంటెనేమిలేదు. ఉండునదంతయు నచలము. అచలమునకంటెనేమిలేదు. ఇది వేదాంతము. ఇదిసత్యము.

ఈవేదాంత గ్రంథమును జదివినవారును, వినినవారును, మోక్షమునుబొందుదురు. ఆచార్యకటాక్షముచేతవిచారణచేసినవారు భ్రాంతినిరాసకంబైన పరమపదమును బొందుదురు. ఇందుకు సందియము లేదు. ఇదిగురువాక్యము. గురువాక్యమే వాగ్దాంతము. వాగ్దాంతమే సిద్ధాంతము.

ఇది శ్రీమద్వేదాంతవిచారకుండును, సద్గురుశిష్యుండును, సచ్చిదానందరహితుండును, నుపాధిద్వయదోష రహితుండును, నచలుండును, నశరీరుండునునైన పోకల శేషాచలమునాయనివారిచే రచియింపఁబడిన శ్రీరామహృదయంబను షట్చక్రవర్తుల యింద్రజాలపుఁగథలుసర్వంబును సంపూర్ణము.

హిందూరత్నాకర ముద్రాక్షరశాల, మద్రాసు. 1927.